# అభిమానులు

| | |
|---|---|
| శ్రీ రాజా వెంకటమురళి మనోహరరావుగారు | మంచిరాల |
| ,, కొత్త పుల్లయ్యలింగం అండ్ బ్రదర్సువారు | ,, |
| ,, పెంజ్యాల చిన్నయ్యగారు | ,, |
| ,, జవ్వాది లక్ష్మయ్యనాయుడుగారు | పెనుగొండ |
| ,, నూలి లక్ష్మీనారాయణజమీందార్ వారు | ,, |
| ,, నాగుబండి చినకృష్ణయ్యగారు | వరంగల్ |
| ,, దేవిడీ జమీందారిణిగారు | దేవిడి |
| ,, తడవర్తి పున్నయ్య అండ్ బ్రదర్సువారు | రాజమండ్రి |
| ,, జూపూడి వెంకటేశ్వరరావుగారు | ,, |
| ,, కారుమూరి సర్వేశలింగంగారు | ,, |
| ,, శీమకుర్తి సుబ్బారావుగారు | ,, |
| ,, వెత్సా వెంకటరత్నంగారు | ,, |
| ,, అన్నం వెంకటరాజుగారు | ,, |
| ,, ఆలమూరి సీతారామస్వామిగారు | ,, |
| ,, పచ్చిగోళ్ళ వెంకటభోగేశ్వరరావుగారు | ,, |
| ,, దూడ వీరాస్వామిరెడ్డిగారు | ,, |
| ,, జి. వరదరావుగారు | ,, |
| ,, జిల్లా సుబ్బారావుగారు | ,, |
| ,, కోరుకొండ బుచ్చిరాజుగారు | ,, |
| ,, నూలు నాగేశ్వరరావుగారు | ,, |
| ,, యడవల్లి రామారావుగారు | ,, |
| ,, కోరంగి వీర్రాజుగారు | ,, |
| ,, గోకవరపు వెంకటసోమరాజుగారు | ,, |
| ,, బాలనాగు రామమోహన్ రావు అండ్ బ్రదర్సువారు | ,, |

| | | |
|---|---|---|
| శ్రీ | మిరియాల వెంకటరత్నం అండ్ బ్రదర్సువారు | రాజమండ్రి |
| ,, | వుడత్తు నారాయణమూర్తిగారు | ,, |
| ,, | బలభద్ర వెంకట్రాజుగారు | ,, |
| ,, | తవిడిశెట్టి సాంబయ్యగారు | కంభంమెట్టు |
| ,, | గుడిమెట్ల లింగయ్య అండ్ వందనం మల్లయ్యగార్లు | ,, |
| ,, | శిరం నర్సింహంగారు | ,, |
| ,, | సుగ్గుల లక్ష్మయ్యలింగం గుప్తగారు | ,, |
| ,, | సుగ్గుల తిరుమలరావుగారు | ,, |
| ,, | గెల్లా కేశవరావుగారు | ,, |
| ,, | రాయప్రూడి రాములుగారు | ,, |
| ,, | కుంచెపర్తి లక్ష్మీనారాయణగారు | ,, |
| ,, | పసుమర్తి వెంకటలక్ష్మయ్యగారు | ,, |
| ,, | పసుమర్తి వీరభద్రస్వామిగారు | విజయనగరం |
| ,, | నారాయణ వెంకటచలమాజీగారు | ,, |
| ,, | వెత్సా శ్రీరామమూర్తిగారు | ,, |
| ,, | వుసిరికల సోమసత్యనారాయణగారు | ,, |
| ,, | కొండా శంకరయ్యగారు | సికింద్రాబాద్ |
| ,, | బెల్లు జగదీశ్వరయ్యగారు | ,, |
| ,, | అల్లాడి వీరయ్యగారు | ,, |
| ,, | తేలుగుంట్ల బాలకృష్ణయ్య అండ్ బ్రదర్సువారు | ,, |
| ,, | తేలుగుంట్ల నాగయ్యగారు | ,, |
| ,, | దండు పెంటయ్యగారు | ,, |
| ,, | దండు ఆగయ్యగారు | ,, |
| ,, | వి. వి. రామన్‌గారు | ,, |
| ,, | ఉప్పల రాజవీరయ్య, శంకరయ్య అండ్ కంపెనీవారు | ,, |
| ,, | కైలాసం శరభయ్యగారు | ,, |

| | |
|---|---|
| శ్రీ దుండిగల్ల జగదీశ్వరయ్యగారు | సికింద్రాబాద్ |
| ,, ములుగు రాజయ్యగారు | ,, |
| ,, యిందూరి ఈశ్వరయ్యగారు | ,, |
| ,, పైండా వెంకటనారాయణగారు | కాకినాడ |
| ,, పైడా సుబ్బరామయ్య శ్రేష్ఠిగారు | నెల్లూరు |
| ,, బచ్చు శ్రీరామ గోపాలకృష్ణమూర్తిగారు | వడ్డిగూడెం |
| ,, కర్రి అప్పారెడ్డిగారు | గొల్లలమామిడాడ |
| ,, గోనుగుంట్ల అంకారావుగారు | వినుకొండ |
| ,, రాజా పెద్దసుబ్బారాయుడు శ్రేష్ఠిగారు | నంద్యాల |
| ,, ఉప్పల సత్యనారాయణమూర్తిగారు | అనకాపల్లి |
| ,, ఉప్పల శ్రీరామమూర్తిగారు | ,, |
| ,, అన్నవరపు సుబ్బారావుగుప్తగారు | విజయవాడ |
| ,, ఆలపాటి కుటుంబరావుగారు | ,, |
| ,, కాకరపర్తి భావన్నారాయణగారు | ,, |
| ,, డాక్టర్. ఉరటి సూర్యనారాయణగారు | ,, |
| ,, చుండూరి శ్రీరాములుగారు | ఏలూరు |
| ,, మోతే నారాయణరావుగారు | ,, |
| ,, శీర్ల బ్రిహ్మయ్యగారు | ,, |
| ,, యాదా వరసయ్యగారి జగన్నాథంగారు | పెదపల్లి |
| ,, వసుపర్తి రాఘవులుగారు | ,, |
| ,, జవ్వాది సత్యనారాయణగారు | ,, |
| ,, గుర్రం రామన్నగారు | ,, |
| ,, యాదా వైకుంఠంగారు | వరంగల్ |
| ,, చీదర రాజశేఖరంగారు | ,, |
| ,, భూపతి కృష్ణమూర్తిగారు | ,, |
| ,, మొరుకుల పాపయ్యగారి కృష్ణయ్యగారు | ,, |

శ్రీ మిరియాల వెంకటరత్నం అండ్ బ్రదర్సువారు రాజమండ్రి
,, వుదత్తు నారాయణమూర్తిగారు ,,
,, బలభద్ర వెంకట్రాజుగారు ,,
,, తవిడిశెట్టి సాంబయ్యగారు కంథంపొట్టు
,, గుడిమెట్ల లింగయ్య అండ్ వందనం మల్లయ్యగార్లు ,,
,, కోరం నర్సింహాంగారు ,,
,, సుగ్గుల లక్ష్మయ్యలింగం గుప్తగారు ,,
,, సుగ్గుల తిరుమలరావుగారు ,,
,, గెల్లా కేశవరావుగారు ,,
,, రాయపూడి రాములుగారు ,,
,, కుంచెపత్తి లక్ష్మినారాయణగారు ,,
,, పసుమర్తి వెంకటలక్ష్మయ్యగారు ,,
,, పసుమర్తి వీరభద్రస్వామిగారు విజయనగరం
,, నారాయణ వెంకటచలమాజీగారు ,,
,, వెత్సా శ్రీరామమూర్తిగారు ,,
,, వుసిరికల సోమసత్యనారాయణగారు ,,
,, కొండా శంకరయ్యగారు సికింద్రాబాద్
,, బెల్దు జగదీశ్వరయ్యగారు ,,
,, అల్లాడి వీరయ్యగారు ,,
,, తేలుగుంట్ల బాలకృష్ణయ్య అండ్ బ్రదర్సువారు ,,
,, తేలుగుంట్ల నాగయ్యగారు ,,
,, దండు పెంటయ్యగారు ,,
,, దండు ఆగయ్యగారు ,,
,, వి. వి. రామన్ గారు ,,
,, ఉప్పుల రాజవీరయ్య, శంకరయ్య అండ్ కంపెనీవారు,,
,, కైలాసం శరభయ్యగారు ,,

| | |
|---|---|
| శ్రీ దుండిగల్ల జగదీశ్వరయ్యగారు | సికింద్రాబాద్ |
| ,, ములుగు రాజయ్యగారు | ,, |
| ,, యిందూరి ఈశ్వరయ్యగారు | ,, |
| ,, పైండా వెంకటనారాయణగారు | కాకినాడ |
| ,, పైడా సుబ్బరామయ్య శ్రేష్ఠిగారు | నెల్లూరు |
| ,, బచ్చు శ్రీరామ గోపాలకృష్ణమూర్తిగారు | వడ్డిగూడెం |
| ,, కర్రి అప్పారెడ్డిగారు | గొల్లలమామిడాడ |
| ,, గోనుగుంట్ల అంకారావుగారు | వినుకొండ |
| ,, రాజా పెద్దసుబ్బారాయుడు శ్రేష్ఠిగారు | నంద్యాల |
| ,, ఉప్పల సత్యనారాయణమూర్తిగారు | అనకాపల్లి |
| ,, ఉప్పల శ్రీరామమూర్తిగారు | ,, |
| ,, అన్నవరపు సుబ్బారావుగుప్తగారు | విజయవాడ |
| ,, ఆలపాటి కుటుంబరావుగారు | ,, |
| ,, కాకరపర్తి భావన్నారాయణగారు | ,, |
| ,, డాక్టర్. ఉరటి సూర్యనారాయణగారు | ,, |
| ,, చుండూరి శ్రీరాములుగారు | ఏలూరు |
| ,, మోతే నారాయణరావుగారు | ,, |
| ,, శీర్ల బ్రహ్మయ్యగారు | ,, |
| ,, యాదా నరసయ్యగారి జగన్నాథంగారు | పెదపల్లి |
| ,, వసుపర్తి రాఘవులుగారు | ,, |
| ,, జవ్వాది సత్యనారాయణగారు | ,, |
| ,, గుర్రం రామన్నగారు | ,, |
| ,, యాదా వైకుంఠంగారు | వరంగల్ |
| ,, చీదర రాజశేఖరంగారు | ,, |
| ,, భూపతి కృష్ణమూర్తిగారు | ,, |
| ,, మెరుకుల పాపయ్యగారి కృష్ణయ్యగారు | ,, |

| | | |
|---|---|---|
| (శ్రీ) | బాలిపోతుల వెంకటరత్నం అండ్ బ్రదర్సువారు | రాజమండ్రి |
| ,, | వుడత్తా నారాయణమూర్తిగారు | ,, |
| ,, | కాలభద్ర వెంకట్రామాగారు | ,, |
| ,, | తపిడిసెట్టి సాంబయ్యగారు | కంథంమెట్టు |
| ,, | గుడిమెట్ల లింగయ్య అండ్ వందనం మల్లయ్యగార్లు | ,, |
| ,, | శిరం నర్సింహాంగారు | ,, |
| ,, | సుగ్గుల లక్ష్మయ్యలింగం గుప్తగారు | ,, |
| ,, | సుగ్గుల తిరుమలరావుగారు | ,, |
| ,, | గెల్లా కేశవరావుగారు | ,, |
| ,, | రాయపూడి రాములుగారు | ,, |
| ,, | కుంచెపత్తి లక్ష్మీనారాయణగారు | ,, |
| ,, | పసుమర్తి వెంకటలక్ష్మయ్యగారు | ,, |
| ,, | పసుమర్తి వీరభద్రస్వామిగారు | విజయనగరం |
| ,, | నారాయణ వెంకటచలమాజీగారు | ,, |
| ,, | వెత్సా శ్రీరామమూర్తిగారు | ,, |
| ,, | వుసిరికల సోమసత్యనారాయణగారు | ,, |
| ,, | కొండా శంకరయ్యగారు | సికిందాబాద్ |
| ,, | బెల్లు జగదీశ్వరయ్యగారు | ,, |
| ,, | అల్లాడి వీరయ్యగారు | ,, |
| ,, | తేలుగుంట్ల బాలకృష్ణయ్య అండ్ బ్రదర్సువారు | ,, |
| ,, | తేలుగుంట్ల నాగయ్యగారు | ,, |
| ,, | దండు పెంటయ్యగారు | ,, |
| ,, | దండు ఆగయ్యగారు | ,, |
| ,, | వి. వి. రామన్ గారు | ,, |
| ,, | ఉప్పల రాజవీరయ్య, శంకరయ్య అండ్ కంపెనీవారు | ,, |
| ,, | కైలాసం శరభయ్యగారు | ,, |

| | |
|---|---|
| (శ్రీ) దుంపిగల్ల జగదీశ్వరయ్యగారు | సికింద్రాబాద్ |
| ,, ములుగు రాజయ్యగారు | ,, |
| ,, యిందూరి ఈశ్వరయ్యగారు | ,, |
| ,, పైండా వెంకటనారాయణగారు | కాకినాడ |
| ,, పైడా సుబ్బరామయ్య శ్రేష్ఠిగారు | నెల్లూరు |
| ,, బచ్చు శ్రీరామ గోపాలకృష్ణమూర్తిగారు | వడ్డిగూడెం |
| ,, కర్రి అప్పారెడ్డిగారు | గొల్లలమామిడాడ |
| ,, గోనుగుంట్ల అంకాలరావుగారు | వినుకొండ |
| ,, రాజా పెద్దసుబ్బారాయుడు శ్రేష్ఠిగారు | నంద్యాల |
| ,, ఉప్పల సత్యనారాయణమూర్తిగారు | అనకాపల్లి |
| ,, ఉప్పల శ్రీరామమూర్తిగారు | ,, |
| ,, అన్నవరపు సుబ్బారావుగుప్తగారు | విజయవాడ |
| ,, ఆలపాటి కుటుంబరావుగారు | ,, |
| ,, కాకరపర్తి భావన్నారాయణగారు | ,, |
| ,, డాక్టర్. ఉరటి సూర్యనారాయణగారు | ,, |
| ,, చుండూరి శ్రీరాములుగారు | ఏలూరు |
| ,, మోతే నారాయణరావుగారు | ,, |
| ,, శీర్ల బ్రహ్మయ్యగారు | ,, |
| ,, యాదా నరసయ్యగారి జగన్నాథంగారు | పెదపల్లి |
| ,, వసుపర్తి రాఘవులుగారు | ,, |
| ,, జవ్వాది సత్యనారాయణగారు | ,, |
| ,, గుర్రం రామన్నగారు | ,, |
| ,, యాదా వైకుంఠంగారు | వరంగల్ |
| ,, చీదర రాజశేఖరంగారు | ,, |
| ,, భూపతి కృష్ణమూర్తిగారు | ,, |
| ,, మెరుకుల పాపయ్యగారి కృష్ణయ్యగారు | ,, |

| | |
|---|---|
| శ్రీ మదూరి శంకరలింగంగారు | వరంగల్ |
| ,, తోట సోమయ్యగారి శివలింగంగారు | ,, |
| ,, బచ్చు వెంకటేశ్వర్లుగారు | విజయవాడ |
| ,, వచ్చిపులుసు వెంకటసుబ్బారావుగారు | ,, |
| ,, తడవర్తి నాగపోతరావుగారు | బందరు |
| ,, దారా విశ్వేశ్వరరావుగారు | ,, |
| ,, వుప్పుటూరి పున్నారావుగారు | గుంటూరు |
| ,, తుమ్మలపల్లి సత్యనారాయణమూర్తిగారు | పిప్పర |
| ,, పులవర్తి వెంకటసుబ్బారావుగారు | ఆకివీడు |
| ,, యిన్నమూరి చెంచయ్యగారు | రాజమండ్రి |
| ,, పెమ్మాడ రామారావుగారు | ,, |
| ,, అద్దేపల్లి అప్పలరాజుగారు | ,, |
| ,, బచ్చు సత్యానందంగారు | ,, |
| ,, కురిచేటి జనార్దనంగారు | భద్రాచలం |
| ,, దూబగుంట శ్రీరామమూర్తిగారు | కొత్తగూడెం |
| ,, పరశురాం లక్ష్మీజీగారు | ,, |
| ,, మహమ్మద్ దావూద్ ఖాన్ గారు | రాజమండ్రి |
| ,, గుండు వెంకటేశ్వర్రావుగారు | ,, |



# ఆంగ్లేయా సుందరి

## ద్వితీయ భాగము

---

### ఇరువది యారవ ప్రకరణము

### రహస్యము బయలుపడెను

శైలా క్లాడిస్సాలుండిన శకటము వాయు వేగమున బ్రధావించుచుండెను. ఆ వెనుక నల్గురు యుద్ధానుగులు హయారూఢులై పోవుచుండిరి. వారిపిఱుందఁగొంతవర కున్మత్తునివలె ముస్తఫా బొబ్బలిడుచు బరుగెత్తి యలసి నిలచి తక్షణమే స్కుటారీపోవు తుఱుష్క రాజోద్యోగులకు శైలామరణించలేదనియు నిప్పుడే కొందరి సహాయమున పారిపోవుచున్నదని తెలియంబరచిన వారశ్వారూఢులఁబంపి వంటి బంధింతురనుకొని తనలో “నేనిట్లుపోయి చెప్పితినేని నాకు పిచ్చిపట్టినదని నన్నుబంధించి యిదివరకొక్క ప్రకారము మరణదండన విధింతురేమో!” యని చింతించుచు నిలచిపోయెను.

అప్పుడాతనికి మఱియొక యాలోచనగల్గి యాత్మగతంబున “ఇదంతయు నేల? వారు నన్ను క్షమించినాధన మొసంగిన మంచిది. లేనిచో పోనిమ్ము దాసి బెపోయి యీసంగతి రాజమందిరమున చాటితినా వారు తప్పక నమ్ముదురు! ఇక ననుమానమేల? తప్పకపోయెదను” అనుకొనుచు శైలా యెట్లు మరణించినట్లు నటించి పారివచ్చెనా? యని యాశ్చర్యమగ్నమానసుడయ్యెను. పోనిమ్ము శైలామరణించినదనుకొందము? కాదు. ముస్తఫాయొక్కయు కనులయెదుట శైలా సుందరవదనారవిందమును గాంచి చనిపోయెనని యెట్లు నమ్మగలడు?

కొంతవడికిట్లు మా స్నేహితుండు నాలోచనా పరంపరలం దుఱ్ఱుకి—మునింగియుండ పడవ జోస్ఫ్రగృహ సమీపప్రవాహమున వచ్చుచున్నట్లు శబ్దమువలన దెలిసికొని యుక్కసక్కిగ యుండుమండి దిగుచున్న తన స్నేహితునిసమీపించి లాఖ్యాత్యాగమున "ఏమాయె ?" యని ప్రశ్నించెను.

స్నేహితుఁడాతని చేయిఁబట్టుకొని సడచుచు "మఱలాభము లేదు. వజీరు నీప్రార్థనమంగీకరింపలేదు. కాడియాస్కారు విధించిన శిక్షయలంఘ్యనీయమట; కాబట్టి నీవేపోయి వజీరుకాళ్ళంబడిన లాభముండునేమో" యనెను.

మా స్నేహితుండు బాగ వేడినిట్టూర్పువిడిచి శైలామరణించ లేదనియు నిప్పుడే కొందరిసహాయమున పాఱిపోవ బ్రయత్నించుట తన కంగీకరగాంచితినని యాతనితో చెప్పి వాడటినష్మక యిక తానందు జాగ్రత్త గలుగ జేసికొనవ చూసిసంధిపింపవలెనని యాపాదించి యాకూలువకు కొంతధనమిచ్చి వానినే కనిస్టాంటినోపిలుకొమ్మని పడవనెక్కించి పంపివేసెను.

మేమిదివరకు తెల్లా—డోనిస్టా శైలాలను ప్రయాణము గావించి తాను కనిస్టాంటినోపిలునగరమునుండి పోయెనని చెప్పితిమి. ఆమెకటనుండుటకు స్వంత కార్యము లేమియును లేవు కాని శైలామరణమునుగూర్చి యాపట్టణమునందభిప్రాయము లెట్లుండెనో తెలిసికొనుటకును; తనకు శైలాను రాజాంతఃపురమునుండి తప్పించుటయందు సహాయమొసఁగిన క్రిస్టియను సంసారుల కీవిషయమున నేవిధమయిన చీకాకు సంభవించినను కాపాడుటకు నుండెను.

ఇపుడు తెల్లా ధౌతవస్త్రధారిణియై ముందుల పెట్టె చేతఁబుచ్చుకొని రాజవీధులందిరుగుచుండెను. ఆమె రాజనగరు సమీపమున నట్లు తిరుగుచుండ ద్వారపాలకులు కొన్నిమందులను, కొందరధి

మాగ్గురి పురుషులసహాయమున పారిపోవుచుండుటవారకంట్లబడఁ గాంచితి”
నని బిగ్గరగ బలికెను,

“ఓసీ! నీని వాక్యము లాశ్చర్యములుగనున్నవి. నీనికి పిచ్చి పట్టి నట్లున్నది పంపు. తక్షణమే నీనిని కిల్సన్ ఆగా కప్పగింతము” అని చెప్పుచున్న తరుణమున నీపనులతో వాసిని ఆగా కడ కీడ్చుక పోవుచుండె.

ఈసంభాషణ మంతయు నక్కడ నేయున్న తెల్లావిని శైలా సుఖముగ నూటారి తేరినదనియు నిక తాను వెంట నేపోయి శైలా రక్షణమునందు తనకు సహాయ్యముగావించిన క్రిష్టియను సంసారులకు రాజోద్యోగులవలన హాని వాటిల్లకుండ వారి నెటకయిన బంపి వేయ వలెనని యూహించి తక్షణమే యటఁ జాగుచేయక వారి గృహమును రమీాపించి యజమానితో “నయ్యా! మనరహస్యము బయల్పడెను. శైలాపారిపోవుట ముస్తఫాయాకూబు కంటఁబడెను. వాఁడు వచ్చి రాజమందిరమునఁ దెలియఁబరచెను. ఇక నీవీ పట్టణము నుండి యీరాయుత్తరక్షణము పారిపోనియెడల నాపద వాటిల్ల గలదు. త్వరపడుము. నీకు కావలసినంత ధనమొసంగెద. ఆలసింపకు మని చెప్పి, ఆతనిని భార్యాపిల్లలతోసహా గ్రీసునకు మారువేషములఁ బంపి తానును మారువేషధారియై యాయింటినుండి యీవలకు వచ్చుచుండ గొందరుబానిసలు వచ్చి బంధించి “ఈయింటివారేరి? నీవెవరు? అని ప్రశ్నింప తెల్లాతనకు తెలియదనెను. పిదప వారా యిల్లంతయు పరిశోధించి యేరినిగానక తెల్లానుపోల్చి యీామెయే శైలా పారిపోవుటకుఁ గారణమని బంధించి రాజనగరునకు గొంపోయిరి.

శైలా మరణింపలేదనియు మాయోపాయమున పారిపోయెననియు సుల్తానమ్మ ఆశ్చర్యమునొందెను,

అప్పుడే కిల్నర్ అగాచే క్రిష్టియనుల యిల్లు వెదుకబంపిన బానిసలువచ్చి సౌధము చేరనియు, నౌకమంచములపెట్టియు, లైలా కళేబరమును గొనిపోవచ్చిన స్త్రీ యొక తెయుం జేతంజిక్కెనని చెప్పిరి. అది విని రాజమాత తక్షణమే యామందులపెట్టె తెప్పించి వైద్యుల రావించి యందలి యౌషధము లేల పనికివచ్చునో పరీక్షింప మని యాజ్ఞాపించెను. వారుకొన్ని యౌషధముల బోల్చి వాటి యుప యోగము నెఱింగించి మిగిలినవాటి యుపయోగము తెలియదని యూరకొనిరి. రాజమాత "అవి మత్తు కలుగజేయునవా?" యని ప్రశ్నింప వారది యెఱుంగనివారగుటచే మాటలాడక యూర కొనిరి.

రాత్రి చాలసేపగుటచే రాజమాత వారిని విడచి తాఖానాను సమీపించి లైలా మరణింపలేదనియు మాయోపాయమున మోస గించెననియు చెప్పెను. తాఖానాయందలి రహస్యము నెఱింగిన దగు టచే తనపై నేమియు ననుమానము తట్టకుండునట్లు నటించి యేమియు తెలియని దానివలె నాశ్చర్యముగవినెను. రాజమాత తనగదిలో నికి పోయెను.

మరికొంత కాలమాయెను. తెక్లా కొందరి బానిసలవలన సుల్తానమ్మవద్దకుం దేబడెను. సుల్తానమ్మనుచూచి తెక్లా సలాము చేసి యెడముగ నిలచెను.

సుల్తానమ్మ—ఓసీ! మీదుర్మార్గములు బయటంబడెను.

తెక్లా—అట్లయిన నే నేమందును?

సు—అట్లయిన రమ్‌జానుత్సవమున మా చిరంజీవికి భార్యగ నెన్నంకొనబడిన సుందరి-లైలా-మమ్ము మోసగించి పారిపోవుటకు పన్నిన పన్నుగడ యందీవుకూడి బాల్గొంటివా?

తె—ఆ! ఇపుడబద్ధ మాడిన లాభ మేమి?

సు—అట్లయిన నే నేదివలన నాకొచ్చిన హానిని తెచ్చుకొంటిని కళాహీనమైనదో చెప్పుము, మా వైద్యులు సహితము మందలి రహస్య మెఱుంగక పోయిరి.

తె—అందలి రహస్యము నేరకనే చెప్పజాలను. పరోపకారము నకై యీ మందులుపయోగింపఁబడును, మీ వైద్యులకా యౌషధమును గురించి చెప్పుమనిన చెప్పెదను.

సు—అదంతయు నిపుడేల? నీ మందు ప్రభావ మెట్టిదో చెప్పుము. అది నీ కెట్లు వచ్చెను? చెప్పుము?

తె—ఒకప్పుడు-ముప్పది సంవత్సరముల క్రిందట కనిస్టాంటినోపిలు నగరమున కలరా జాడ్యము ప్రవేశించి భయంకరముగ వ్యాపించి ప్రజల మ్రింగివేయుచుండ నహమ్మదు అర్సాను నొక వైద్యుడు తన యౌషధ ప్రయోగము వలన నారుజనుండి యనేకుల మృత్యువక్త్రమునుండి రక్షించెనన్న వార్త మీరెఱింగియే యుందురు.

సు—అవునవును-అట్టి యౌషధమే నీయొద్ద గలదా!

తె—కలదుగాని నా సంగతి నించుక చెప్పి పిమ్మట నా యౌషధమహిమను చెప్పెదను.

సు—మానవుల మృత్యుబారినుండి తప్పింపఁగల దివ్యౌషధమే నీయొద్దనున్నచో ధనాశచే లైలా మా నగరునుండి పారిపోవుట కొసంగితివి గాని నీ తండ్రినే బ్రతికించుకొనలేకపోతివా?

తె—కాలమాసన్నమై చనిపోవువారియెడ నా మందు గుణము చేయదు. ధనాశాపరురాలనేనైయైనచో నా మందు నితరులకిచ్చి యీపాటికి బంగరు మేడలే కట్టియుందును. అది నా యుద్దేశము కాదు. మరియు నేను దేశదిమ్మరిని. నాయనువారు నా కెవరును లేరు. అట్టియెడ నాకు ధనమేల? నా పొట్ట నెట్లయినఁబోసికొన సమర్థురాలను.

కనుకనే మిగిలిన నా జీవితము పరోపకారమునకై వినియోగించి యిచ్చుటనో యీ భంగుర దేహము విడతును. శైలా దుర్మార్గముగ బానిసవర్తకునిచే జిక్కి యీ యంతఃపురమున బడ నా ప్రాణస్నేహితురాలు కాబట్టి నా దివ్యౌషధము బ్రయోగించి యిందుండి దాటించితిని కాని ధనాశచే గాదు.

సు—అట్లయినచో నేను నా యౌషధమును పరోపకారార్థమై వినియోగింతును. నాకు జెప్పుము.

తె—ఒకషరతుపై జెప్పెదను.

సు—అదియేమి ? స్వేచ్ఛగావలయునా ? నీప్రాణమునుదీయకుండ విడువమంటివా? ఈ రెంటిలో నీకేమిగావలెను?

తె—.........

సు—నీకుప్రాణమే యవసరమైన స్వేచ్ఛగదియగజాలవు.

తె—జగన్నాథుని సృష్టివైచిత్ర్యములగాంచుచు స్వేచ్ఛగదిరుగని ప్రాణమేల? వృథా! శైలాను మీయంతఃపురమునుండి తప్పించినదానను నేనే. శిక్షాపాత్రురాలను, మహారాజ్ఞీ! ఇక జాగుసేయక నాశిరచ్ఛేదనమున కాజ్ఞాపింపుము! ఎప్పుడో యొకనాడీ జీవము పోవలసినదే. ఇప్పుడేసిద్ధముగనున్నాను.

సు—అట్లేగాని నీవు శైలాయెడ నుపయోగించినమందు ప్రయోగము, దానిని విరచుట మొదలగుసంగతులన్నియు మా వైద్యులకుం జెప్పుము.

తె—నిదర్శనములతో దప్ప మాటలతో తెలియబరచుట కష్టము. కాన నేనొక మందిచ్చెదను అదిమీవైద్యులకిచ్చి యుపయోగించి వారియద్భుత మెఱుంగనిండు.

సు—సరే. ఇది పనిచేసి గుణముజూపెనా నిన్ను స్వేచ్ఛగ విడిచి పుత్తును లేదా బోస్పరస్ నదియందు నీ ప్రాణముల గోల్పోవలెను.

తె—చి త్తము.

సు—సరే అని ఆగానురావించి తెల్లానొకగదియందు గౌరవ ఖైదీగానుంచుమనియు ముస్తాపాయూకూబును విడిపించి వానిధన మంతయునిప్పించి పంపివేయుమని యాజ్ఞాపించెను. ఆగాసలాము గావించిపోయెను.

రమ్జానుత్సవంపు కడపటిదినము సమీపించెను. తురుష్క రాజాంతఃపురసౌఖ్యముల నభిలషించుచుండిన యొకసుందరిని సుల్తానునకు భార్యగ బహుమానము చేయఁబడెను. ఆనాడు గొప్పయుత్సవముజరిగెను. రమ్జానుత్సవము పూర్తియాయెను.

లైలా రాజునకు భార్యగాకుండ తప్పింపబడినందులకు తాజ్ఞానా యెంతయు సంతసించెను.

---

## ఇరువదియేడవ ప్రకరణము

## అగాథము

స్కుటారినుండి లైలా క్లోడిస్సాలధివసించిన శకటము వాయువేగమున బోవుచుండెను. ఆవెనుక నల్లాయుద్దీ ననుచరులతో బోవుచుండిరి. లైలా యెట్లో రాజాంతఃపురమునుండి బయటబడితినని సంతోషితస్వాంతయగుచుండెను కాని ముస్తఫాయాకూబునకు తనరహస్యము బ య ట ప డె న ని యెరుఁగదు. లైలా తన యొద్దనేయున్న క్లోడిస్సా యెవరాయని యాలోచించుచుండెను. ఎన్ని విధములాలోచించిన నామెయెవరో యెరుఁగజాలకపోయెను. ఆమెను తానిదివరకెన్నడును గాంచలేదు. పోనిమ్ము తనపరిచారికలలో నొకతెయనుకొందమన్న నట్టివారెవరును లేరాయెను.

అది నిర్మలమగు వెన్నెలరాత్రి. మన బాటసారులిప్పుడన టోలియా దేశభూములగుండ బోవుచుండిరి. అక్కడికిజార్జియను దేశ మేడువందలమైళ్ళ దూరముననున్నది. సాధ్యమయినంత వేగముగ నా దేశమును దాటిపోనియెడల త్రైలా కాతురుష్కభూమియందేమి యాపదసంభవించునోయని దారిమధ్య నెచ్చటనాగక ప్రయాణము సాగించుటే యుత్తమమని యల్లాయుద్దీను నభిప్రాయము.

ఇపుడు వారు పోవుచున్న ప్రదేశ మెత్తుపల్లములుగనుండి కన్గొన కష్టముగనుండెను. మనుష్యావాస మెచ్చటనో గాని లేదు. మరల నా ప్రదేశమున త్రైలా క్లోడిస్సాలు ఎక్కిన బండి కుదుపబడు చుండెను. త్రైలా సుఖవాసియయ్యు నా కుదుపును లక్ష్యపెట్టక, లోనికిబోనిమ్మని బండివానిని హెచ్చరించుచుండెను. అటులా ప్రదేశ మంతయు నొక్కతీరుగనే యుండెను. దారి కానరాకుండుటచేతను నల్లాయుద్దీనును కొంతదూరము దారికై వెదకుచుంబోయి, తానట బండి వచ్చువరకు నాగుచుండెను. అట్లు వారు వెనుక కప్పుడప్పుడు శత్రుసమూహము వచ్చునాయని చూచుచుండిరి. కొంతకాలము వరకట్టిదేమియుం గనరాలేదు. మరింతదూరమరిగి అల్లాయుద్దీను వెనుకకుజూచి, ఇబ్రహీమ్, హాఫీజులతోం దాము వెంటదరుమబడు చున్నాము!—అటుచూడుడు—ఇంతలో రాజసైనికులు వచ్చుచున్న ట్లున్నది. త్రైలామాత్రమపాయమును దప్పించుకొనిపోయెనే గాని చనిపోలేదన్నసంగతి రాజాంతఃపురమునం దెల్సినట్లున్నది" అనెను.

"ఆఁ—చూచితిని—గాని వారెవరో మనము గుర్తింపవలెను" అని యిబ్రహీమనెను.

"అల్లా! మనప్రాణము లుండునంతవరకు త్రైలా శత్రుగతము కాకుండ జూడవలయును" అని హాఫీజనెను.

"అనుచరులారా! గొప్పమాట పల్కితివి!—ఊరకొనుడు. ఈ సంగతి శైలా క్లోడిస్సాలు వినినా భయమందుదురు." అపుడే బండివాఁడు వెనుకజూచి వీరి సంభాషణ నించుక గుర్తించెను. అదిగాంచి అల్లాయుద్దీను బండివాని మరేమియుఁ బ్రశ్నింపక బండిని వేగముగ బోనిమ్మని ఆజ్ఞాపించి వెనుకకుజూచి "హయారూఢులు గానరాలేదు! ఇదంతయు మన యనుమానమే!—కాదు—కాదు—అదుగో వచ్చుచున్నారు. చాలా పెద్దసమూహమే!" అనెను.

"ఇరువదిమందికిఁ దక్కువయుండరు. చూడుడు" వారి ఖడ్గ ప్రభ సూర్యకాంతియం బెట్లు వెలుగొందుచుండునో! అని యిబ్రహీం మనెను.

"నిజమే. వారు సుల్తాను నశ్వబలమైయుండును. అల్లాయుద్దీన్! ఇక నేమిచేయుదము?" అని హాఫీజు ప్రశ్నించెను.

"ఆలస్యముజేసితిమా వారు వచ్చి మీాదపడుదురు. నిక్కము మన హయములపై భారముంచి పరుగిడి వారి దృష్టిపథమునుండి తప్పించుకొనఁ బ్రయత్నింపవలెను! బండి మాత్రము మెల్లగవచ్చు చున్నది" అని ముందుకు నాల్గుగజములుపోయి దూరమున వారి నంటి పోవుచుండెను. ఒక్కత్రుటిలో దృష్టిపథమునుండి వారదృశ్యు లగుట శైలా క్లోడిస్సాలంపుండిన బండివాని కాశ్చర్యముగొల్పెను.

అట్లు పారుచుండిన హయములలో నల్లాయుద్దీను హయమే మేలుచేయియయియున్నది. శైలా గుఱ్ఱపుజీనుపై నధివసించి తన వీరపురుషుని గట్టిగ కౌగలించుకొని 'వేగమున పరుగెత్తించు' మని ప్రోత్సహించుచుండెను, వారిని మోసికొనిపోవుచున్న వారువము గూడ దీనితో చావో బ్రతుకో కల్గితీరునట్లు తుపానువలె ప్రయాణము సాగించుచుండెను. ఒక పావుగంటపిదప నల్లాయుద్దీ ననుచరుల కై వెనుదిరిగి జూచి వారొక్క అరమైలుదూరమున మరియొకదారిబట్టి

వచ్చుచున్నట్లు గుర్తించెను. తన కెరమైలుదూరమున సుల్తాను సైనికులు వచ్చుచుండిరి. వారిని జూచుచుండి గుఱ్ఱమొక పల్లపు ప్రదేశమున బారజొచ్చునట్లుజేసి వారిరాక దెలిసికొనజాలకపోయె నల్లాయుద్దీను.

అచ్చటి దరినొక చిట్టడవి గానవచ్చుటచే నల్లాయుద్దీనయ్యది త్వరలో నతిక్రమించి వేరుమార్గమున రాజసైనికుల దప్పించుకొన వచ్చుచుండెను. అనుకొనుటయే తడవుగ నాయు మాచిట్టడవి వెనుక వేసెను. ఆయా సాతిరేకమున నల్లాయుద్దీనచ్చట కళ్ళెమును బిగియ లాగి మెల్లగ గుఱ్ఱమును నడిపించుకొనుచు పోవంబోవ నడ్డుగ నొక భయంకరాగాధము గోచరించెను. తన గమననిరోధియగు నాయగాధము గాంచి యల్లాయుద్దీను భయంపడిదానిలోగుట కనువగు మార్గమున్నదేమో యని కొంతవరకొడ్డున పరీక్షించెను.

కాని దానికంతమున్నట్లు గోచరించుటలేదు. అదిచూచి లైలా ధైర్యముసడలెను. వెనుక సైనికులు విచ్చుకత్తులతోవచ్చుట ముందిభీకరాగాధమునుగాంచి లైలావడకుచు "ప్రియా! మనము చిక్కులోబడితిమి" అనెను. అల్లాయుద్దీను "ప్రేయసీ! భయంపడకుము. నన్నుగట్టిగబట్టికొనియుండుము. నిర్భయముగ నీయగాధము లంఘింపం బ్రయత్నింతు. ఇంకు జయమందితిమా మనమదృష్టవంతులమే. ఇరువుర మొకరినొకరు, కౌగలించుకొని యీయగాధమునం బడి మరణించిన స్వర్గమున కలిసికొందముగాని యూవచ్చురాజ సైనికులచేం జిక్కవలదు. ఆఖరుకిదియే యుపాయము" అనెను.

రాజసైనికులు పదునేనుగజములదూరమునుండి తుపాకులం బ్రేల్చసాగిరి. వారితుపాకులనుండివచ్చు గుండ్లు చుట్టివేయుచుండెను. లైలా, ధైర్యముదిగజార "అల్లాయుద్దీన్! డానియల్! సరి. — మనకు కాలముచెల్లెను" అనెను,

"ధైర్యము. లైలా!—ధైర్యము కష్టసమయములందవ సరము. మన మీ యగాధము దాటకపూర్వమే వారువచ్చి మీద పడిరా చెండాడితీరరా!" అని యామెను తనవిశాలవక్షమునకు హత్తికొని సైనికుఁడు సమీపించుటగాంచి "లైలా! ప్రేయసీ! నన్ను గట్టిగబట్టికొనియుండుము. ప్రాణములపై నాసవిడియుండుము. మృత్యువెన్నటికైనను వచ్చితీరును. భగవంతుని దయవలనను మన ప్రయత్నమువలనను యీయగాధము దాటితిమా రాజసైనికులు మన నేమియుఁజేయఁజాలరు. లేక యిందుబడితిమా స్వర్గలోకమున మనప్రేమఫలముల ననుభవింతము" అనుచుండ నొకగుండు రింగున వచ్చి యల్లాయుద్దీను చెవిప్రక్కనుండ డాయగాధముదాటెను. దానిఁ బురస్కరించుకొని లైలాయల్లాయుద్దీనుల హయమాయగాధము నతిక్రమించిపోయె. మరిరెండుమైళ్ళదూరమున నిలచెను. అక్కడ లైలా యల్లాయుద్దీనుల క్లోడిస్సా, హాఫీజిబ్రహీములువచ్చి చేరుకొనిరి. వీరందరునుగలసి యచ్చటకుదగ్గరగనుండిన యొక్కపల్లె జేరుకొనిరి.

కొంచముసేపట వారందరునువిశ్రమించి స్వల్పాహారములఁ గుడిచి ప్రయాణమై వేరొకపల్లెఁజేరుకొనిరి. అట నల్లాయుద్దీను లైలా క్లోడిస్సాలకై రెండుగుఱ్ఱముల విలిచితెచ్చెను. పిదపయాయయిదుగురును వేర్వేరు హయములపై జార్జియా దేశమును సమీపించుచుండిరి. ఆజార్జియా దేశపుపట్టణములలో నొకదానియందు మన ప్రయాణికులు రెండుదినములువిడసి మూడవదినమున టిఫిలిసు బయలుదేరిరి.

లైలా, తాఖానాకు తానుగావించిన వాగ్దత్తమును మరువలేదు: గాన తిన్నగ తాఖానాతల్లియగు జార్జియనువితంతు గృహమ్మున నందరితోడను, దిగెను. అట మనప్రయాణీకులందరును జార్జి

యను వితంతుచేఁ గౌరవింపబడెను. త్రైలా, తాఘానాసుఖముగనున్నదని తెల్పినంతనే జార్జియనువితంతు కన్నులనించుకొని "ఇదిదైవప్రేరణ. నాకుమాత్రె అయేషా మరలనన్నుఁజేరుట దుర్లభమయినను నామె సౌఖ్యముగనున్నదను వార్తయే నాకత్యంతామోదదాయక" మనెను.

పిదప మనబాటసారులా ముదుసలివద్ద శలవుగైకొని సూర్యాస్తమయమగుసరికి టిఫిలిస్ సమీపముగకువచ్చిరి. అట టిఫిలిస్ప్రభుత్వ బంధితులనుంచుటకు ప్రత్యేకముగనుంచఁబడిన శిథిలదుర్గోపరిభాగపు కిటికీనుండొక ఖైదీతాడ్రిటిసహాయమున వ్రేలాడుచుంటఁగాంచి యల్లాయుద్దీను "ఓహో! ఏమిసాహసము! ఆచెరనుండి వాడెట్లు తప్పించుకొనుచున్నాడో" అనెను.

ఆ చిత్రము జూచుచు మన బాటసారులట నిలచిరి.

---

## ఇరువది యెనిమిదవ ప్రకరణము.

సూర్యాస్తమయమగు సమయమున జార్జియను ముఖ్యపట్టణ పొలిమేరయందుగల బందిఖానా (వలెనుపయోగింపఁబడుచున్న పెద్ద గోపురములుగల పాతకోట) కిటికీనుండొకఁడు త్రాడుమూలమున నేలకు జారుచుండెను. అదిచూచియే మనబాటసారులు ఖైదీయొకఁడు పారిపోబ్రయత్నించుచున్నట్లు తెలిసికొని చూచుచునిలచిరి.

ఆదృశ్యము దీర్ఘముగజూచుచు హాఫీజు "ఆహా! ఇట్లీఖైదీ వెలుతురుండగనే పారిపోవుచుండ యజమానులున్నఫలమేమి?" అనెను.

"బాగు" అని యిబ్రహీము తలపంకించి యూరకొనె.

"చూడు! పాపమాతఁడాతగోనివ[త్రాడుపొట్టిదగుటచే యింటి పైకప్పుపై దిగనెంత శ్రమ జెందుచున్నాఁడో. అదిగో! ఇప్పు డాతఁడు [త్రాటినుండి జారిపోయి నేలఁబడెను" అని యల్లాయుద్దీనని యించుక యూరకొని లేదు వాఁడు నేలబడలేదు. ఇంటిపై కప్పుపై బడి [ప్రాకిపోవుచున్నాఁడు గాంచు, మనెను.

ఇబ్రహీము యజమానులుకోటలోపలనున్నారు. వాఁడువారి కంటబడకుండ బోవుటచాలకష్టము.—అయినను—రాజా! ఆతఁడెవండై యుండునని మీయుద్దేశము అని అల్లాయుద్దీనునడిగెను.

అల్లాయుద్దీనాసాహసకృత్యమున కచ్చెరువంది చూచుచుండు టచే యి[బహీమునకు జబాబొసంగలేదు. తైలాఆతండు బాకీలవా డేమో అని అబ్లుగాకుండిన నేరస్థుడైయుండు నని క్లోడిస్సాయనెను.

మరియొకనిమిషమున కల్లాయుద్దీను "ఏమో ఆఖైదీకందు జీవనముకష్టమయియుండనోపు లేనిచో అంతయెత్తగు కోటకిటికీనుండి ప్రాణములఁదెగించి—[క్రిందకుజారసాహసింపఁడు" అనెను.

అబ్లుగాకుండినవీఁడు ట్యూనారునివంటి స్వామి[ద్రోహియై యుండును. స్వామి[ద్రోహులకు—హంతకులకును ఖైదులంచూకఠినశిక్ష విధింపబడును. అనియి[బహీముపలికెను.

అల్లాయుద్దీను తదేకదీక్షగ వానిసాహసముదిలకించుచుండెను. ఖైదీ యిండ్లన్నియుదాటి కందకమునసమీపించెను. అదిదాటినవాఁడు నిరపాయముగ బయటపడగలడు. ఇంతలో పశ్చిమాచలమున దూరు చున్న సూర్యునికిరణమొకఁడా ఖైదీముఖముపైఁబడెను.

తక్షణమే హాఫీజు, యి[బహీములు అల్లా! మనస్వామిమరణ కారకుఁడగు ట్యూనారుండు.—జెయిలుఅధికారుల కండ్లమున్నుగొట్టి పారిపోవుచున్నాడని యరచిరి, అందరునుజకితులైరి.

"హాఫీజ్! నీవేగిబందిఖానా యజమానులకు ట్యూనారుఁడు తప్పించుకొని పారిపోవుచున్నాఁడని తెలియింపు" మని యల్లాయుద్దీను హాఫీజున కాజ్ఞాపించిపంపెను.

ఇఁక జైలుకాపరులకంటఁబడకుండ కందకముదాటి ట్యూనారుఁడు బయటఁబడవలసియున్నది. అందులకుఁ దగినప్రయత్నములు ట్యూనారుఁడిదివరకేగావించెను. దినదినము తనకొట్టువద్ద గాచుచుండినవారలకు లంచమిచ్చి మచ్చికజేసుకొనియెను. ట్యూనారుఁడెవరితో లంచమిచ్చుటకు మాటలాడెనో వారు సాయంకాలమే యటఁగాపుందురు. అందువలన సర్వము ననుకూలముగ నున్నవనియే యాతఁడు యిండ్లపై కప్పులనుండి ప్రాంగణమునఁబడెను. ఇఁక తాదాటవలసినది కందకము. కందకమును సమీపించి యిటునటు జూచి ట్యూనారుఁడందుదూకెను. దూకుటతోఁతడవుగ "నరకే! ఖైదీయొవఁడో పారిపోవుచున్నా"డని యొకరవ్యాను సేనానికంఠనాదము ట్యూనారుని వీనులఁబడెను. ఆవెంటనే తుపాకిప్రేలెను. ట్యూనారుఁడు మునిగిపోయి యీదుకొనుచుఁ బోసాగెను. జైలు ఆవరణమున కలవరము జనించెను. మరికొందరుసైనికులువచ్చి ట్యూనారుని బంధింప నీటందుమికిరి.

ఈలోపున ట్యూనారుఁడు కందకమవ్వలిగట్టునుచేర వాని పాదములచటి చెట్టువేళ్ళలో దగుల్కొనెను. వెంటదరుముకొని వచ్చుచుండిన సైనికులు సమీపించుచుండిరి. అదృష్టవశాత్తు ట్యూనారుఁ డావృతముమునుండి తప్పకొని అమానుషబలమున బారిపోవుచుండ వెంటనంటివచ్చుచుండినవాఁడొకఁడు సన్నిహితుఁడై బల్లెమెత్తి ట్యూనారుని చంపనుంకించు సమయమున నదియందికొని వానిని భయంకర కరాఘాతమున కందకమునఁబడఁద్రొబ్బి జైలు

దాటి శరవేగముగ తనకై చిట్టడవిని వేచియుండిన కైరికరమను జెమ్సుజెట్టులఁజేరుకొనెను.

ట్యూనారుని పన్నాగము నెఱిఁగినవారగుటఁజేసి కరమను జెట్టులు మరియొకహయముతో నాయడవిని వేచియుండిరి. ఇంతలో ట్యూనారుఁడుగూడసమీపించి తనకై నాయత్తపరుపఁబడిన హయముపైకెక్కి వారితో పాఱిపోసాగెను.

ఇదియంతయు మిట్టప్రదేశమునుండి పరికించుచుండిన అల్లాయుద్దీను, యిబ్రహీములు రైలాక్లోడిస్నాలవిడచి గుఱ్ఱముల బరుగెత్తించుకొనుచు ట్యూనారుని బట్టికొన బయలుదేరిరి. దారిలో వారికడ్డుగ నొకపెద్ద పణుకడ్డమగుటచే నదిఁసుట్టివెంబడించులోపున ట్యూనారుఁడు స్నేహితులతో చాలాదూరముపోగిరి. అట్లు దూరముపోయినవెనుక తమ్ము వెంబడించుకొని వచ్చుచున్నవారల్లాయుద్దీను యిబ్రహీములని కైరికరమనున కెరుఁగఁజేసి తాఁదడయకపారెను.

కైరికరమనుఁడు గుఱ్ఱమునాపి "జమ్సుజెట్ ! నాకువిచారమాపాదించినవానిపైఁ గసిదీర్చుకొనసమయము తటస్థించెను. — ఆలస్యముఁజేయక వారిపై నాల్గుగుండ్లువదలు" మని తనమొలనున్న తుపాకినిలాగి అల్లాయుద్దీనునంకఁ గురిజూపుచుండ, నల్లాయుద్దీను నాయుధమునుండొకగుండు ఘీంకారముచేయుచువచ్చి కరమనుని యశ్వమును నేలపాలుగావించెను. కరమనుఁడు దానితోగూడ భూమిపైబడి తెల్విదప్పెను. జెమ్సుజెట్టుప్రాణరక్షణార్థమై పలాయనమగుచుండెను. వారికిముందు యిరువదిగజములలో ట్యూనారుఁడు పరుగిడుచుండెను.

అల్లాయుద్దీను, యిబ్రహీములు తమతుపాకిదెబ్బతో బడినవాఁడు ట్యూనారుఁడుగాఁడని కైరికరమనుని గాంచకయే పోవుచుండిరి.

ఇదంతయు మిట్ట ప్రదేశమునుండి గాంచుచుండిన లైలా క్లోడిస్సాలు గాంచి అల్లాయుద్దీను మృతుడయ్యెనేమోయని వాయు వేగమున కరమనుఁడు పడియున్న స్థలమును జేరిరి.

చిరుజీకటులు పడుచుండెను. లైలా అల్లాయుద్దీనే మరణించె నని యేడువనుంకించుచుండ క్లోడిస్సా పడియున్నవాని దగ్గరకుఁబోయి చూచి "లైలా!—బందిపోటుదొంగ!! కైరికరమనుఁ"డని బిగ్గ రగ నరచెను.

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము

మహారాజ్ఞి లైలా యిదివరకెన్నడును జూచి యెరుగదుగాని వాని చైదములనెఱిగినదగుటచే "కైరికరమనుఁ"డనిన దిగులొందు చుండెడిది. అట్టిదిపుడు కన్నులార కరమనుని గాంచినంతనే నఖశిఖ పర్యంతము గంపించెను.

క్లోడిస్సా పడియుండిన కరమనుని పరీక్షించి "చనిపోవుట లేదు ఊపిరియున్నది. గుఱ్ఱముతోగూడ నేలఁబడి స్మృతిదప్పి యున్నా"డని శరీరమంతయుఁ బరిశీలించి "గాయము లెచ్చటను లేవు"అని లైలాతో ననెను.

లైలా పైకి ధైర్యముగనేయున్నదిగాని హృదయమందతీత మగు భయము పీడించుచుండెను. పడియున్న కైరికరమనుఁడు తన్నేమియిడుమల బడయజేయునో యనుకొనుచుండెను. కైరికర మను డనిన సింహస్వప్నముగనుండెను. అబల యొకత్తు చచ్చిపడి యున్న విషోరగమును దారిమధ్యగాంచి యది బ్రతికి వెంబడించు

నేమో యని భయమందునట్లు త్రైలా—సుకుమారి—యూంనుష్టునిజూచి కంపింపసాగెను.

క్లోడిన్సా "రాజ్ఞీ! ఈతని కాలొక్కటి గుఱ్ఱముక్రింద బడి యున్నది. మనము మెల్లగా గుఱ్ఱమును దొలగించి కాలీవలకు లాగి వేయుదమా. ఈతఁడెంతదుష్టుడయినను కష్టదశయందున్నవాఁడు. పరోపకారము జేయవలెనని పురాణములు వచించుచున్నవిగదా! కనుక నాకీయుద్యమమున సహాయముఁ జేయగలవా?" అని యడిగెను.

"తప్పక ట్లే సేయుదును. అపకారికైన నుపకారమే జేయవలె" నని త్రైలా క్లోడిన్సాతోఁగూడి కరమనునికా లాచచ్చినగుఱ్ఱము క్రిందనుండి తప్పించెను. అప్పుడే కరమనుఁడొకపరి మూల్గెను గాని తెల్వి వచ్చుటలేదు. క్లోడిన్సా వానికాలు పరీక్షించి చెక్కుకొని పోయినట్లు గుర్తించెను.

అట్టి సమయమున హాకీజు హాయూ హూంషుఁడ్డే యుటకు వచ్చుచుండుట త్రైలా క్లోడిన్సాలు చూచిరి.

క్లోడిన్సా "రాజ్ఞీమణీ! హాకీజీతఁడెవఁడో యెఱుఁగడు. వాడుకరమనునిగూర్చివినె నేగాని యెఱుగడు. కాన నీతని నామధేయము వానియెదుట వాకొనకుమా——" అనె.

"లేదు—— నేనాతనికి హానిదలచను. కరమనున కపకారము జేయనని మీరావద్ద ప్రమాణముఁజేసితిని" అని త్రైలాచెప్పెను.

మరియొక లిప్తలో హాకీజుసమీపించి త్రైలాకుసలాము జేసి "రాజ్ఞీ! ఈపడినవాఁడెవఁడు?" అని ప్రశ్నించెను.

"ఎవఁడయిన నేమి? ——— అల్లాయుద్దీను, ఇబ్రహీములు ట్యూనారుని వెంబడించుకొని యిట్లుపోయిరి. నీవువాయు వేగమున వారికి సహాయముఁజేయఁబొమ్ము. ట్యూనారుఁడు దుర్మార్గుడు-వాని కేమయిన నపకృతిఁజేతునేమో" అనెను.

"చిత్తము" అని హాకీ గుఱ్ఱమునుపడిపి చెను.

"పొమ్ము. నీయజమాని నీభుజబలము పేక్షించుచుండు" నని లైలావానినంపి వేసెను.

క్లోడిస్సా "లైలాహాకీజీతని జోల్చుకొన లేకపోయెను. లేకున్న యిటనొక యుద్ధమే జరిగియుండును. నీవలెనేనేఁగూడ తనభర్త కాపదలసహాయముఁ జేయుదునని మీరావద్ద ఘోరప్రమాణము గావించితి" ననెను.

"ఇఁక నేమి చేయుదము? ఇంకను తెల్వివచ్చుటలేదు. ఈ లోపున ట్యూనారుని వెంబడించుచున్న రష్యనుసైనికులు వచ్చిన నేమి కీడుమూడునో?— ట్యూనార్! నీవెంతవాఁడవు" అనెలైలా.

"మహారాజ్ఞీ! మనమిక మాటల గాలముబుచ్చిన లాభము లేదు.—రాజ్ఞీ. నీవొక యుపకారముఁ జేయువలెను. అది నియోగింప నాకుసాహసము లేకున్నది——"

"క్లోడిస్సా! ఎంతమాటాడితివి. నీవు నారక్షణార్థమై యెంత కష్టపడితివి. అట్టితఱి నీమాట నేవిననా"

"అమ్మా! ఈదుర్మార్గునకు మనము శీతలోపచారములు చేయునిచో తెల్వివచ్చునట్లు గానరాదు. కనుక నీవాగానవచ్చు వాయుయంత్రము సమీపించి సారాయమును, ద్రాక్షరసమును గొనిరావలయును"

"తప్పక, అయిదునిమిషములలో వచ్చెద" నని లైలా గుఱ్ఱ మెక్కి బయలు దేరెను.

సాయంకాలమయ్యెను. చంద్రుం డాకాశమున నుదయించి భూప్రపంచమంతయు వెన్నెల మయమొనర్చెను.

లైలా మరియొక నిమిషమునకావాయు యంత్రమును సమీపించి తలుపుదట్టనొక వృద్ధుడు తలుపు దెరచెను. లైలా రావచ్చిన

కార్యమాతనికి జెప్పెను. వాఁడు వేయిప్రశ్న లడిగినగాని యుత్తరము వచ్చిన కార్యము నెరవేర్చి పంపుమనుష్యుఁడు గాకపోవుటచే “సారాయెందుకు?” అనిప్రశ్నించెను.

లైలా—త్రాగుటకు

కృ—ఎవరికి?

లైలా—నాకే.

కృ—నీవు త్రాగెదవా?

లైలా—నన్ను ప్రశ్నలతో బాధింపకుము. ఇటదడయజనదు. త్వరలో నొకసీసా సారాయమును, మరియొక దానితో ద్రాక్ష రసము నిచ్చిసన్నంపుము. ఇదిగో సొమ్ము. (అనివాని చేత నాణెముల నిడును)

వాఁడానాణెములఁగాంచి యమందానంద భరితుఁడై లోని కేగి యామెకోరినవి తెచ్చియిచ్చెను. లైలా వానినందికొని కైరి కరమను క్లోడిస్సాలున్న తావు సమీపించి చూడ నటనొకగుఱ్ఱము తప్ప మరియెవరును గానరాకుండుటచే భయాశ్చర్యములు ముప్పిరిగొన నిటు నటు బరికించుచుండ నటనొకవ్యక్తి చేష్టలు దక్కిపడి యుండెను. ఆతఁడెవఁడు? ఆగుఱ్ఱమెవరిది? అని వితర్కించుకొనుచు లైలా యావ్యక్తిని సమీపించి యిటునటు కదిపి “అల్లాయుద్దీన్ మరణించితివా? యని యరచి విలపింపఁదొడంగెను.

---

# ముప్పదియవ ప్రకరణము

## సెలయేటిప్రక్క

క్లోడిస్సా సారాయమును తెమ్మని శైలానంపిన వెనుకస్మృతి దప్పియున్న కరమనుని తన గుఱ్ఱముపై నెత్తి పడవైచికొని పోయి యొకసెలయేటిప్రాంతఁ బచ్చిక బయలునడించి, తన చేఱుమాలు నా యేటముంచి వానిముఖముపై వైచి తెల్విదెప్పించుటకై ప్రయత్నించుచుండెను.

అట్లామె యుపచారము జేయుచుండ కరమనుఁడు "అది ట్యూనారుని తప్పుకాదు! వాఁడు మంచివాఁడు! అయ్యో ముదుసలీ! చంపఁబడితివా! మన్సూర్! ట్యూనారుఁడుగాని నేనుగాని వానిని జంపలేదు! జమ్మజెట్టి...!...అట్టిసమయమున వాఁడేల తోటలోకి రావలసివచ్చెను? పాపము శైలాను రక్షింపవలెనని గాబోలును! ట్యూనారుఁడేపాప మెఱుఁగఁడు. వాఁడు భయమంది చెట్లచాటున దాగి పట్టువడి శిక్షాపాత్రుఁడాయెను! అయ్యో! నాతలతిరుగుచున్నదేల? నాకేమి సంభవించెను? నేనెటనుంటిని? కరచరణంబులు నాస్వాధీనమునలేవేమి? ఇది చెరసాలయా" అని కరమనుఁడు పలవించి యొత్తిగిలెను.

క్లోడిస్సా వానితలనెత్తి తనతొడపై నుంచుకొని "ఇదిచెరసాలకాదు. నీవు బంధింపఁబడలేదు" అని పలికెను.

కరమనుఁడు కొంచెము తెలివొంది "హా! ఈవాక్యమెవరిది? ఎరిగినట్లున్నదే—మీరా?" అని కన్నులు విప్పఁజాలక అడిగెను.

"మీరా యెక్కడ? ఆమె మరల నీకగుపడునా?" అని క్లోడిస్సా పలికెను.

“అవును. ఇంకెక్కడిమీరా! నాబంగారుకొండయీ నాకై యస్తమించెను” అని కరమనుఁడు గొణఁగెను.

మరికొన్ని నిమిషములైనపిదప మరల కరమనుఁడు “మీరాను గూర్చి నాతో మాటలాడుచున్నవా రెవరు? హా! మీరా! మీరా! అప్పుడే నీకాయువు చెల్లెనే” యనెను.

క్లో—ఇంకను మీరాను మరువ జాలవా? ఆమె పవిత్రమూర్తి నీహృదయకుహరమున బ్రతిబింబించుచున్నను కష్టములు కాలవాల మగు నీదొంగవృత్తి నేలమానవు? పరలోకమునసున్న నీమీరా నీ కష్టజీవనమును దలచుకొని యెంతదుఃఖించుచున్నదో గదా? నీనీచ వృత్తివలన నామెకు పరలోకమున సహితము శాంతిలేదాయె.

క—ఇట్లు నాతో సంభాషించుచున్న యీ కలకంఠియెవరు? లేక నేకలఁగాంచుచుంటినా? అదియునుగానిచో నామనోవికారమై యుండును.

క్లో—నీవు కలగాంచనూలేదు. నీమనోవిభ్రమణమును గాదు. నీమీరాప్రాణ స్నేహితురా లొకతె నీపాటుఁజూచి యిటకుగొని వచ్చి యుపచార మాచరించుచున్నది.

క—(కన్నులువిప్పి చెట్లనీడ క్లోడిస్సాముఖముపై బడుటచే గుర్తింపఁజాలక) అట్లైన నీవెవరు?

క్లో—చెప్పెదను. కొన్నినిమిషములు మాటలాడక విశ్రమింపుము.

క—నీవెవరయిననేమి? మీరాస్నేహము నాకుపచారము జేయ నిన్నుఁ బురికొల్పినది. అహా! నాముద్దుగుమ్మా! మీరా...అమ్మా! నీపేరేమి? నాకర్ణపుటముల దయాస్వరూపురాలవగు నీనామధేయ మిడి యానందము గల్గింపుము.

క్లో—కరమన్! నాపేరుతో నీకేమియుఁ బ్రయోజనము లేదు. పోనీ చెప్పితిననుకొనుము. నీకేమి తెలియును? నన్నెప్పుడును నీవెరుఁ

గవు. నేనును కాకసియను ప్రాంతవాసినేయయ్యు దూర దేశమున నివసించుచుంటిని. నేను బాల్యమున జార్జియాయందు వసించితిని. అప్పుడే నీభార్యకును నాకును స్నేహము గల్గెను. నేనెవరో, అంత మాత్రమున నీవెఱుఁగ జాలవు.

క—పోనిమ్ము. నేను నీపేరు విసగూడదా? (అని యతికష్టముపై లేచి, చెట్లనీడలమఱుగుబడియున్న క్లోడిస్సాముఖమును పరిశీలించుచు) దయార్ద్రరూపిణీ! ఒక్కపర్యాయము నీముఖకమలమును వీక్షింపనిమ్ము. ఎపుడయిన నీకీతావుల నేదుష్టులవలన నపకారము గల్గునని యున్న నాకెఱింగింపుము. వాని శిక్షించి నీఋణము దీర్చికొందును. (అని యామెముఖమును జేర్చుచుండెను.)

క్లోడిస్సా చివాలునలేచి మరింత వృక్షచ్ఛాయలనిలచెను. కరమనున కిప్పుడవయవములు స్వాధీనములగాఁజేసి లేచి నిలచి యామెనుపరికించుచుండెనుగా నిపోల్చుకొనలేకుండెను—తుదకాతఁడు సాహసించి యామె చేయిబట్టుకొని వెన్నెలలోనికి లాగి వికసితహృదయుఁడై యేమో యనెను.

క్లోడిస్సా, యచ్చోటు వాసివాయు వేగముగ దూరముగనున్న చెట్లలో మాయమైనది. కరమనుడాశ్చర్యహృదయుఁడై చూచుచు నిలచి బాహ్యప్రపంచమును మరచెను.

కరమనుడు తెలివినొంది ప్రక్కనున్నహయమును గాంచెను. మరియొకచోట మైదానముపై నొక చేతిరుమాలుగూడ వానికంట బడెను. తక్షణమే యాతడున్మాదునివలె, చేతిరుమాలు నందికొని హయారూఢుడై క్లోడిస్సాపోయిన మార్గమున బడెను. క్లోడిస్సా యేవంక బోయెనోవానికి గుర్తింప నశక్యమాయెను.

అట్లు మూర్ఛాగతుడైయున్న తన మనోహరునిఁగాంచి లైలా కన్నీరు మున్నీరుగ విలపించుచుండ నొకింతసేపున కాతఁడు

కన్నులువిప్పి యేమియో యనెను. ఆవాక్యముల పూర్ణభావములు. శైలాయందలి యర్థమును గ్రహింపజాలక తాఁదెచ్చిన సారాయమును సింత వానినోటఁబోసెను. మరియొకపావుగంటలో నల్లాయుద్దీను తెలివినొందెను.

అట్లొండొరుల గౌగలించుకొనినపిదప నల్లాయుద్దీను తాను టుర్కోమానునివెంట దరుముకొనిపోయి పట్టుకొని చెరసాల కప్పగించితిననియు, నింతలో హాఫీజువచ్చి కలియుటచే తాను శైలా క్లోడిస్సాలకై వచ్చుచుండ దారిలో నేదియో నల్లటిదానినిగాంచి బెదరి తన్ను నేలబడద్రోసి పరుగెత్తెననియు నట్లుపడుటలో స్మృతి తప్పెననియుఁ జెప్పి "క్లోడిస్సా యెచ్చట?" నని ప్రశ్నించెను. దానికి శైలా జరిగినవృత్తాంతమంతయు నెఱింగించెను. అల్లాయుద్దీను క్లోడిస్సా కరమునుని హస్తగతమైనదని విచారించసాగెను.

తమకు సర్వవిధముల సహాయకారియగు క్లోడిస్సా యొక దుష్టుని హస్తగతమగుటఁదెలిసి యొప్పరికింపఁదగదని యల్లాయుద్దీనామెను వెదుఁకఁబోనెంచెను. కానామెకొరకై యాతఁడేట్లోవఁబోవలెను? అదియేమియు నెఱుఁగక తర్వాత నాప్రయత్నముఁజేయవచ్చునని శైలా, యల్లాయుద్దీనులు హయాసీనులై టిఫిలిసునగలమన్నారుని గృహమునకుఁబోయిరి. అచ్చటకేగినంతనే "మరి శైలానుగాంచుట కలలోనివార్త" యనుకొనినయామెపరిచారికలగు జైదాయమీనాలు కెవ్వునకేకవేసి శైలానుగట్టిగ కౌఁగలించుకొని యేడువసాగిరి.

అప్పుడు శైలా వారినోదార్చి జరిగినసంగతినంతయుఁజెప్పి "పిల్లలారా! మిగిలినవృత్తాంతము సావకాశముగ జేపుచెప్పెదను. పొండు. రాత్రియతిక్రమించుచున్న" దని పంపివేసెను.

పిదప లైలా, యల్లాయుద్దీనులు వారివారి శయ్యలపైని శ్రమించి మాటలాడుకొనుచుండ నాగదితలుపు కటికి త్రెరువఁబడి క్లోడిస్సా వారియెదుట ప్రత్యక్షమాయెను!!

---

## ముప్పదియొకటవ ప్రకరణము

## క్లోడిస్సా రాక

క్లోడిస్సా తామున్నగదిలో ప్రవేశించినంతనే లైలాయల్లాయుద్దీనులమందానందభరితులైరి. లైలాతటాలున లేచి చేయిజారి నది దొరకినట్లుగ క్లోడిస్సాను గాఢాలింగనము జేసికొనెను. పిదప లైలాక్లోడిస్సాలొకేయాసనమునందాసీనులై అల్లాయుద్దీను జరిగిన వృత్తాంతము క్లోడిస్సాలవలనవినఁ గుతూహలుఁడై యుండెను.

క్లో—లైలామహారాజ్ఞి! నీవు సారాయముననుగొనిరా వాయుయంత్రమునకు పోయిన వెనుక నల్వురశ్వారూఢు లరుదెంచి మూర్ఛంబడియున్న కరమనునొక యశ్వముపై నెక్కించుకొని పోనుద్యమించుచుండ నేగూడ వెంటవచ్చెదనని ప్రార్థించి వేరొక గుఱ్ఱముపై బయలుదేరితిని. అట్లుపోయిపోయి వారొక సెలయేటి ప్రాంత కరమనునిడించి శీతలోపచారములు సేయుఁగడంగిరి. —— అట్టితఱి ట్యూనారుఁడు కొన్నిమాటలఁబలవించెను. వాటియర్థమే మన ట్యూనారుఁడు మస్సూరుని హత్యావిషయమునన్నిర్దోషియనియు జమ్సుజెట్టియనువాడు దోషియనియు జెప్పెను.

అల్లా—(ఆశ్చర్యముతో) ట్యూనారుఁడు మస్సూరుని హత్యావిషయమున నేరస్థుఁడు గాదా!

క్లో—కాదు.

అల్లా—పాపము నిరపరాధి కారాగార బద్ధుఁడాయెను.

క్లో—మనవారలీ సందర్భమున శ్రమపడి చెరనుండి విముక్తునిఁ జేయవలెను.

అ—అట్లేచేయుదము. ఇదినిజమా. కరమనుఁడనెనా—

క్లో—కైరికరమనుఁడును జమ్స్రెట్టియు మన్సూరుని గృహమున బ్రవేశించి శైలా నెత్తుకపోయి ముస్తఫా యాకూబునకు తామామె యన్నదమ్ములమని చెప్పి యమ్మిరట,

శై—ఓరీ. మర్త్యాధమా. కరమనా. ఎంతపని జేసితివి!

అ—కైరికరమనుఁడు. శిక్షాపాత్రుఁడు.

క్లో—కైరికరమనుఁడును జెమ్స్రెట్టియు శైలాను ముస్తఫా యాకూబున కమ్మించుటకు ముఖ్యకారకుఁడు ట్యూర్నారుఁడేగాని మన్సూరుని హత్యావిషయమున నాతఁడు నిర్దోషి. కైరికరమనునకు మన్సూరుని వధించుట యిష్టములేదు గాని జమ్స్రెట్టివాఁడు శైలా నెత్తుకొనిపోవు సమయమున మన్సూరుఁడు తోటలోకి వచ్చినంతనే తటాలున జంపెనట.

అ—అప్పుడు ట్యూర్నారుఁడేల యూరకొనెను?

క్లో—ప్రాణభీతిచేత. జార్జియను దేశమున హత్యకుఁ బలె పరనారీహరణమునకు గూడ మరణ దండన—

అ—తరువాత...

క్లో పై యభిప్రాయముగల మాటలు కరమనుఁడు స్మృతిఁ దప్పిగొనగుచుండ నాతని యనుచరు లాతనికి దెల్విదెప్పింప బ్రయత్నించుచు నేనాసంగతులన్నియు వినుచున్నట్లు గుర్తించలేదు. పిదప వారు వెనుదిరిగి నన్నుచూచి యీరహస్యముల నేనెటజెప్పుదునో యని, కత్తులు ఝళిపించుచు నన్నంత మొందింప జూచుచుండ గర

మనుము తెల్పికొంది వారిని వారించి, జరిగినవృత్తాంతము వని తననోట నుండి వచ్చిన యావాక్యముల నితరులకు దెలియ జేయనని నాచే బ్రమాణము గావించుకొని విడచిపుచ్చెను.

అ—కావి యిపుడు మన మాట్యూనారునకు ప్రాణాపాయము గలుగకుండ రక్షింపవలసియున్నది. —ప్రియసీ! లైలా! ట్యూనారుడు మన్నారుని హత్యావిషయమున నిర్దోషియని తేలినది. కాని నిన్న ముస్తఫాయాకుంబున కెఱ్ఱుమటయం దాతడు పాల్గొనుటం జేసి జార్జియను రాజశాసనప్రకారము మరణదండన ననుభవింపవలసి యున్నది.

క్లో—మహారాజ్ఞీ! నీవాతని దుష్టచేదముల సరకుగొనక క్షమించితినంటివా, మరణశిక్షనుండి విముక్తుడు కాగలడు.

లై—ట్యూనారుడు మరణదండన ననుభవించుట నేసహింపజాలను. కారణాంతరములచే నాకపకారముం జేసినను, వానికుపకారముం జేయుటయే నావిధి. తప్పక నాకుపిలై నచో ట్యూనారుని రక్షింతును.

అ—లైలా! ఏమి! ఇంతదయార్ద్రహృదయవు!

లై—పాపము. ట్యూనారుడు — యువకుడు — నెల దినములనుండి మాన్నారుని మరణకారకుడనునెపమున కారాగారకష్టములననుభవించుచున్నాడు. అతడు నిర్దోషియని తెలిసినపిదప చెరనుండి విడిపింపకుండ నొప్పరికించుట నావంటివారికి చిన్నతనము.

అ—పోనిమ్ము. వాడు మన్నారిని హత్యావిషయమున నిర్దోషియసి మనముపోయి జార్జియను రాజ్యాధికారులకడకుపోయి విడిపింపవేడవచ్చునుగాని మరిరొక నేరము వానిపై గలదు. అదియేమన జైలునుండి దొంగతనముగ పారిపోవుచు, కందకము దాటునపుడు వెంబడించిన యొకసైనికుని గాయపరచుట,

క్లో—అక్కర లేదు. టుస్యానాదుని మనము తలచుకొనిన రక్షింపఁగలము. వానిచే సపక్షమునందిన లైలా స్వయముగపోయి టుస్యానాదుని రక్షింపుఁడని జాగ్రియను పరిభవ్యులనడిగిన వారుతప్పక విడచిపుత్తురు.

అని యనేకవిధములుగ టుస్యానాదుని రక్షణోపాయములు పన్ని లేయువరకాలోచించి యామున్సూరుఁడును వేర్వేరుగదులలో శయనించిరి.

మన్సూరుని యాస్తి వానికుమారీకుమారులకు న్యాయాధిపతులచే పంచి వేయఁబడెను. టిఫిలిసునందలి సౌధమున కొంత యాస్తి పెద్దకుమారుని వంతయ్యెను. వాఁడుమన్సూరుఁడు బ్రతికి యున్నప్పటినుండియు దూరదేశమగు టిబ్రిజాండు (Tribizonde) నందుండుటచే నటనే వ్యాపారియై యుండిపోవలసివచ్చుటచే తండ్రి చనిపోయిన వెనుక తనవంతునకువచ్చిన యాసౌధము వెలకిచ్చి వేయవలెననియు నండి సేవకులతో కొనువారెవరువచ్చినను తనకు దెలియఁ బరుపమని చెప్పిపోయెను. ఇవన్నియు మన్సూరుఁడు మరణించిన నెలలోపునజరిగెను.

నాటిరాత్రి అల్లాయుద్దీను నిద్రించుటకు పూర్వమాయింటిలో నుండు ముదుసలి జేరంజీరి మన్సూరుఁడు రహస్యపత్రము లుంచు తావేదని యడుగ నామె తనకేమియు దెలియదనియు సర్వము న్యాయాధికారులు పరిశోధించిరనియు వారినడిగిన విశదమగునని యుఁ దెల్పెను.

మరునాఁ డుదయమున లేచి యల్లాయుద్దీను న్యాయాధిపతిని దర్శించి మన్సూరుని గృహమును పరిశోధించినపుడు "లైలా, యల్లాయుద్దీనుల" కని వ్రాయఁబడిన రహస్యపత్రము లేవయిన దొరకెనసనా? యని యడిగి లేవని తెలిసికొనెను. అదివినినంతనే అల్లాయుద్దీ

నవి యేరికి దొరకెనో యనుకొని తమకా కాకసియను పర్వతాంత స్థిత స్వర్గదర్శనభాగ్యము దూరమయ్యెనని తనలో విచారించి ట్యూ నారుని విడిపింప మాటలకు గడంగి ట్యూనారుఁడు మన్సూరుని జంపలేదనియు, దుష్టుఁడగు జెష్మజెట్టి యనువానిచే బొలియింపఁబడి నాఁడని సాక్షులు గలరనియు జెప్పసాగెను.

## ముప్పదిరెండవ ప్రకరణము

## పరిశోధన

తత్క్షణమే న్యాయవాదిని అల్లాయుద్దీను వెంటనిడికొని న్యాయాధిపతి (Magistrate) ని సమీపించి, మన్సూరుని హత్యా విషయమున ట్యూనారుఁడు నిరపరాధియని చెప్ప నాతఁడు నగర మునగల రక్షను న్యాయాధిపతి కీయుదంత మొకసేవకునిచే దెలియ పంపెను. ఆసేవకుఁడు మరలివచ్చి మధ్యాహ్నము వంటిగంటకు ట్యూనారుఁడు విచారింపఁ బడును గాన అపుడు సాక్షులను రమ్మని నారని తెలియఁజేసెను.

అచ్చుటఁగ్లోడిస్సా మన్సూరుని మందిరమును వీడి యితరుల కంటఁబడకుండ మేలిమునుగు వేసికొని ట్యూనారుఁడు బంధింపఁ బడిన చెరసాలకుఁ బయనమాయెను. పోయి యచ్చటనిదివరకు ట్యూనారునిచేఁ గందకమునందు త్రోయఁబడిన పహరావానినే ట్యూనారుఁ డారోగ్యముగ నుండెనా యని యడిగి సుఖముగనున్న ట్లెరిఁగి "యాతనిఁ జూడవీలగునా?" యని యడిగి వాఁడించుక సంశయించుచుండ కొన్నినాణెములతో సంతృప్తునిఁ జేసెను. తత్క్ష ణమే వాఁడొక సేవకుని బిలిచి చెవిలో "ఓరీ! ఈమెను రహస్య

ముగ ట్యూనారుఁడున్న ఖైదుకొట్టువద్దకు గొంపొమ్ము. నీ కేమైన ధన మిచ్చెద" నన వాఁడును సంతసించి తాళము చెవుల గొనివచ్చి ఒక ద్వారమును దెఱచి క్లోడిస్సాను మెట్లపైనుండి మీఁదియంతస్థులో నికిఁ గొంపోయి యటమరియొకగది తెఱచి యామెనులోనికి వెళ్ళ మని చెప్పి తానచ్చటనే నిలచెను.

క్లోడిస్సా యాగదిలో ప్రవేశించి, సరంబీవలెనున్న మరియొక ద్వారమును దాటినవెంటనే బలమగు యినుపగజములతో గూడి యున్న యొకచిన్నగదియందు ట్యూనారుఁడు శృంఖలా బద్ధుఁడై యుంటగాంచెను.

ఈపర్యాయము తాను చెరనుండి తప్పుకొనుట కెవ్విధమైన యవకాశమును లేదని ట్యూనారుఁడు నిరాశఁజెంది విషణ్ణహృద యుఁడై యుండెను. క్లోడిస్సా వానిముఖలక్షణము లవలోకించి "ట్యూనార్! నీవు నిరాశఁజెంది కృశియింపకుము. నీకొక వార్త నెఱిఁగింపవచ్చితిని." నీవు నే జెప్పినట్లు నడచితివా త్వరలో బయట బడగల" వనెను.

ట్యూ—(సంతోషితస్వాంతుఁడై లేచి యినుపగజములు పట్టు కొని) నిజమా! నీవెవరవు?

క్లో—నేనెవరయిన నేమి? నీమేలు గోరుదానను. నే జెప్పఁబోవున దంతయు నిజమని నమ్ముము.—నీవుమన్నారుని జంపలేదు. కర మనునితో వచ్చిన జెమ్మజెట్టియే వాని మారణ కారకుఁడు. నిజ మేనా.

ట్యూ—నిజముపల్కితివి. దేవునిసాక్షిగ నిజము! దానికి కారణము—

క్లో—నాకు తెలియును. లైలామహారాజ్ఞి నానాఁడు కరమను జెమ్మజెట్టు లెత్తుకొనిపోవుటకు ముఖ్యకారకుఁడ వీవేనా? అబద్ధ మాడకుము.

టామ్యా—అవును. నేనే కారకుఁడను.

క్లో—అయిననో నేనిప్పు డడుగు ప్రశ్నకు నీవబద్ధమాడక జవాబీయుము. అబద్ధమాడితివా నీవీ చెరయం దుండవలసిన దే.

టామ్యా—నాలుక గోసిన నబద్ధమాడను. అడుగుము.

క్లో—కైరికరమనుఁడు శైలానెత్తికొనిపోవుటకుఁ గారణమేమి? ధనమునకా? లేక వేరొండు అభిప్రాయముగలదా?

టామ్యా—అమ్మా! ఒకప్పుడు కైరికరమనుఁడు ధనవంతుఁడు. ఇప్పుడో కారణాంతరముచే సర్వమును గోల్పోయి ముస్తఫాయాకూబు ధనము నపేక్షించెను.

క్లో—ఏమి? కైరికరమనుఁడు కాకసియను ప్రాంతవాసులనోచుకొని యింతింతనరాని ధనమార్జించె నే? ఆధనమంతయు నెట్లు పోయినది?

టామ్యా—అది తమ రిప్పుడేల? గతించెను. ఆతఁడేగతించెను.

క్లో—లేదు, లేదు, ఆతఁడునిన్ను చెరనుండి రక్షించుసమయమున నల్లా ముద్దీను సిపాకిచే గాల్పఁబడిన తన గుఱ్ఱముపైనుండి నేలఁబడి తెల్విదప్పి తరువాత చేతస్కుఁడై బ్రతికెను. ఆతనిధనమెట్లుపోయెను?

టామ్యా—ఆతని యనుచరులలో దుర్మార్గుఁడగు ఖాజీ మిగిలిన వారిని ప్రోత్సహించి కరమనునిపై తిరుగఁబడి ధనమంతయు నపహరించుకొనిపోయెను. జెమ్మజెట్టిమాత్రము కరమనునియెడ విశ్వాసము గలిగియున్నాడు.

క్లో—అలాగునా? ఇప్పుడు నీవు మనుష్యుని హత్యావిషయమున నిర్దోషివని యెఱిఁగి, చెరవిముక్తునిగఁ జేయ మేము యత్నించుచున్నాము: గాన నేఁడు న్యాయాధిపతి సముఖమున శైలానెత్తుకొని పోవుట యందు ముఖ్యకారకుఁడ నేనని వాక్రువ్వుము—నావద్ద శైలా మహారాజ్ఞిని "శైలా" యనుముగాని "శైలామహారాజ్ఞి" యనకుము.

టూన్యా—చిత్రము.

క్లో—టూన్యానార్! తరువాత నీయదృష్టము. లైలామహారాజ్ఞి కరుణామయి — ఆమె నీపాటుగాంచి నిన్ను రక్షింప సమకట్టి నీవు నిర్దోషివని సాక్ష్యమీయవచ్చినది.

టూన్యా—ఆమె కనిష్టాంటునోపిలునుండెట్లువచ్చినది?

క్లో—మా ప్రయత్నములనుండి తప్పింపఁబడెను. ఇపుడు టిఫిలిసునందేగలదు. నీచే నపకృతినొందిన లైలాయేవచ్చి నిన్ను రక్షింపమనెంచినదిగాన నీయదృష్టముబాగున్నచో నీకుమరణ శిక్షతప్పగలదు.

టూన్యా—లైలామహారాజ్ఞిదయవల్లనే నీభూమిపైగొన్నాళ్ళు బ్రతుకుదునా? — అమ్మా! నీపేరేమి?

క్లో—అదియే అడుగవలదు. ఇకముందెన్నడు లైలామహారాజ్ఞికపకారముఁజేయ కలనైన దలఁపనని ప్రమాణముఁ జేయుము.

టూన్యా—ఇఁకముందు నేను లైలామహారాజ్ఞికపకారముఁ జేయఁదలచినచో నాదైవము నాతలవేయిశకలములగునట్లు చేయుగాక! పిడుగులుపడి నే మడియుగాక. ఇదె నా ప్రమాణము. నమ్మితివా.

క్లో—నీవుదుర్మార్గుఁడవు. ఐనను నీప్రమాణములఁబట్టి యిక ముందు దుర్మార్గములకొడిగట్టుకొనవని విశ్వసించుచున్నాను. — అంతియేగాదు నీవు మరియొకదానిగూర్చి ప్రమాణముఁజేయవలెను. అదియేదన— నికమీఁద కైరికరమునునితో నెవ్విధమైనసంబంధముఁ గల్గియుండననియు, వానిరహస్యములన్నియు బయటబెట్టి న్యాయాధికారులచే శిక్షింపఁజేయుదననియు నొట్టుపెట్టుకొనుము.

టూన్యానారుఁడందులకొప్పుకొని ప్రమాణముజేసెను. క్లోడిస్సా సంతృప్తినొంది, టూన్యానార్! ఇఁకకొంత కాలముదాకా నీవు న్యాయాధి

పతిసమ్ముఖంబునకు గొనిపోఁబడుదువు. అట కరమనుని విషయమై యేమియు వాకొనకుము. ధైర్యముగ జెమ్మజెట్టిగా మన్సూరునిజంపి నాఁడని యదార్థముఁజెప్పుము. — రెండవవాఁడెవఁడని యడిగిన కర మనుని పేరుమార్చి చెప్పుము. నీవుగాని యలవాటుప్రకారము కర మనుఁడంటివా, వానిసమూహములో జేరినవాఁడవని న్యాయాధిపతి నిన్నుదప్పక శిక్షించును. జాగ్రత్త'' అనెను.

ట్యూ—చిత్తము.

క్లో—నేజెప్పినట్లు చేసితివా సుఖపడుదువు.

అని యామె మేలిముసుఁగు సరుదుకొని మఱలిపోయెను. ట్యూనారుఁడీమె యెవరాయని యాలోచింపసాగెను. క్లోడిన్సా యీావలకువచ్చి తన్నుట్యూనారుని చెఱసాలకడకుగొంపోయిన ఆసేవకుని ధనమిచ్చి సంతసింపజేసెను.

మధ్యాహ్నము న్యాయస్థానమున న్యాయాధిపతి న్యాయవా దులు మొదలగువారు ట్యూనారుని నేరము విచారించుటకుగూడిరి. అపుడు ట్యూనారుఁడు శృంఖలాబద్ధుఁడై రష్యనుసైనికులు లిరు పార్శ్వములరా, వచ్చి బోనులోనిలచెను. అల్లాయుద్దీను, నతనితో మాటలాడిన న్యాయవాదియుఁగూడవచ్చి యుచితాసనముల నధివ సించిరి. అపుడు న్యాయాధిపతి ట్యూనారునిఁ జూచి "ఖైదీ! మన్సూ రుని హత్యావిషయమున నీవేమి చెప్పఁగోరెదవు?'' అని యడిగెను.

ట్యూ—మన్సూరుని హత్యావిషయమున నేను నిర్దోషినని మనవిజేసికొనుచుంటిని.

న్యా—నెలదినములనుండి చెఱయందుండి 'నేను నిర్దోషినని' యేల చెప్పవు?

ట్యూ—నన్ను రక్షకభటులు పట్టుకొనినపుడే నేను నిర్దోషి నని మొఱపెట్టితిని. చెఱలోనున్న నాకేమిశిక్ష విధింతురో యను

భయమున గృహీతుఁడనగుచుఁ జెప్పసాహసింపలేను. తరువాత నాయజమాని మసూ్నారుని మరణమునుగూర్చి యేలినవారికి చాల చెప్పవలసియున్నది.

న్యా—చెప్పుము.

టూ్యా—శైలా యను నొక సుందరాంగి మసూ్నారునింట కతిథిగ వచ్చినది. అప్పుడే టిప్లిసునకొక జానిసవర్తకుఁడుగుండరా వానిఁజేరబోయి శైలానమ్మ బేరమాడితిని. అదినెర వేర్చుకొనుటకు నాకు సహాయకారులుగ గ్రిగరన్, జెమ్మజెట్టి యను వాండ్రిరువురు తోడైరి. వారి నర్ధరాత్రిసమయమున పెరటిదారిని మసూ్నారునింట ప్రవేశింపఁజేసి శైలానెత్తుకవచ్చి జానిసవర్తకున కమ్ముమని చెప్పి యారాత్రితోటలో జెట్లమాటున దాగియుంటిని. ఈ యుదంతము నెటులఁ గని మసూ్నారుఁడా రాత్రి నిద్రరప్పక తోటలో పికారువచ్చి శైలానెత్తుకొనిపోవుచున్నవారి కెదురుచ్చెను. అంతలో నొకఁడగు జెమ్మజెట్టి తటాలున ముందువెనుక లాలోచింపక నాయజమానినిజంపెను. శైలానెత్తుకొని వారుపారిపోయిరి. యజమాని నేలఁబడినంతనే నే చెట్లచాటునుండా తావునమీాపించి మీాదబడి యేడ్చుచుండ నాతని గాయమునుండి గారుచున్న రక్తము నావస్త్రములకంటుకొనెను. అట్టితటి నేఁబట్టువడితిని. నిష్కపటముగ నిజస్థితి యేలినవారికి విన్నవించుకొంటి. నేనెంతమాత్రము మసూ్నారుని జంపలేను.

అదివిని న్యాయాధిపతి టూ్యానారుని గొనిపొండని సేవకుల కాజ్ఞాపించెను. టూ్యానారుఁడు గదిలోనికి గొనిపోబడెను. పిదప నొక గుమస్తా న్యాయవాది శలవుగైకొని క్లోడిస్సాను న్యాయస్థానమునకు తీసికొనివచ్చెను.

న్యాయవాది—అమ్మా! టూనారుని నేరమువిషయమై నీకు దెలిసినయట్టులు నేలినవారికి నివేదింపుము.

క్లో—గడచిన సాయంసమయమున నేనును కొందరు స్నేహితులును గలసి టిఫ్లిస్ వచ్చుచుండ, చెఱసాలనుండొకఁడు తాడుమూలమున జారిపోవ సుద్యమము గాంచి ఆసంగతి జైలు యధికారులకు దెలియఁజేయుమని మాలో నొక మగవానిని బంపితిమి. ఈలోపున నాకైదీ నేలకుఁ దిగి పరుగునను నొక చిట్టడవిఁజేరి యట తన రాకకై వేచియున్న నిరువు రశ్వారూఢులఁ గూడి పాఱిపోవుచుండెను. అప్పుడు మాలో మరి యొకపురుషుఁడు వారిని వెంట నంటిపోయి, తుపాకితో నొకనిగుఱ్ఱమును చంపి నాపైనున్నవాడు నేలఁబడి మూర్ఛిల్లెను. అట్లు పడి పోయినవాఁ డెవఁడో అని నేనును నా చెలియోర్తునుబోయి యుపచారములు చేసితిమిగాని తెలివి రాలేదు. అపుడు నా స్నేహితురాలి వచ్చుటకు గురంగటనున్న నొక వాయుయంత్రమున కింతసాధనము గొనిరాఁ బంచితిని. ఆమె తిరిగి వచ్చులోపున పడియున్న వాని స్నేహితులు కొందరు వచ్చి తెలివి దప్పిన వాని గుఱ్ఱములపై బడుకొనబెట్టి కొనిపోసాగిరి. మరియొకఁడు నన్ను బంధించి యా వెనుక దీసుకొని పోవుచుండ, నా తెల్వి దప్పినవాఁడు మన్సూరుని హత్యావిషయమున నేమేమియో గొణగెను. అది నేజాగ్రత్తగా వింటిని.

న్యా—మన్సూరుని జంపినవాని పేరొకనెనా?

క్లో—ఆఁ —— జెమ్స్ జెట్టియనువాఁడు చంపెను.

న్యా—తరువాత?

క్లో—మరికొంచ మేలినవారికి చెప్పవలసియున్నది. ఆ తెల్వి దప్పినవాడు మన్సూరుని హత్యావిషయమై ప్రలాపించుచుండ నొకఁడు నావలన నామాటలితరకర్ణములఁ బడునని నన్నుగట్టిగ బట్టికొని చంపివేదునని కత్తినెత్తెను. ఇంతలో నా భాగ్యవశమున నామూర్ఛాగతుఁడు తెలివొంది వారి నాకృూరకార్యమును వారించి నేనట నుండుటకుఁ గారణమడిగి — విని పొమ్మనెను.

న్యా—(సేవకునిజూచి) ఓరీ! ఈమెను పంపివేసి ఆ శైలాయను రెండవస్త్రీనిటకుఁగొనిరమ్ము.

శైలాను త్వరలో నటకుఁగొనివచ్చెను. ఆమెను చూచి న్యాయాధిపతి సర్వము నెఱిఁగింపుమన నామె మన్సూరు నింటకతిథిగ బోయినది మొదలు సుల్తాను రాజాంతఃపురమునుండి దాటివచ్చు వరకు జరిగినదంతయు బూసగ్రుచ్చినట్లెఱింగించెను.

న్యా—శైలా! నీవదృష్టవశాత్తు మొసల్మాను రాజాంతఃపురమునుండి తప్పివచ్చుటకెంతయు సంతసించితిని. ఈ కాకసియను జిల్లాలు మారష్యనుజారు పరిపాలనకు లోనయియున్నవని యెఱిఁగియు యించుకేనియు జంకుగొనక దుర్మార్గులగు బానిసవర్తకులు స్త్రీల నపహరించుకొనిపోయి కరక తురకలకమ్మ సాహసించుచున్నారా! ఈపర్యాయము వారిపసబట్టితిని. ముస్తఫా యూసూబునుబంధించి శిక్షించెదను. ట్యూనారుడొక స్త్రీని బానిసవర్తకునకమ్ముటయందు బాల్గొనెను. కాన జార్జియాచట్టప్రకారము దండనార్హుఁడు.

శై—ఆర్యా! నిశ్చయముగ, ట్యూనారుఁడు మన్సూరుని హత్యావిషయమున నిర్దోషియని నొక్కిచెప్పఁగలను. — కాని నన్ను బానిసవర్తకునకమ్ముటయందు నేరస్థుఁడె. ఐనను నాకాతని యెడఁగల దయవలన క్షమించి విడిచివేయం బ్రార్థించుచున్నాను.

న్యా—సుందరీ! నీవాతనివలన నపకృతినొందియు గరుణింపుమని వేఁడుచున్నావు. ఇట్టితఱి నేగరినహృదయుఁడనగుట తప్పు కాన నీవే వాని కేశిక్షవిధింపమందువో చెప్పుము. తానుచేసినది దుర్మార్గమని వానికి తెలియుటకు కొంచమైనను శిక్షింపవలెను. నీయిష్టమెఱిఁగింపుము.

శైలా మందస్మితరోచురుదంచిత సుందర వదనారవిందయై "ధర్మదాత మీచిత్తం" మని న్యాయస్థానమునువిడచెను. పిమ్మట

అల్లాయుద్దీను తా జెప్పవలసినది చెప్పెను. అటుపిమ్మటవురల ట్యూనా రుఁడు న్యాయాధిపతిసమ్ముఖంబునకుఁ గొనిరాఁబడెను.

న్యా—ట్యూనార్ ! నీ నేరమును గూర్చి సర్వమును విచారించితిని. స్వామిహత్యావిషయమున నీవునిర్దోషివని గౌరవనీయుల వలనవింటివి: గనుక నీవునిర్దోషివి. రెండవది నీవుము స్తఫాయాకూబునకమ్మ నొరులకప్పగించినకాంతయే నీమెడకరుణించి రక్షించు మనుటచే మరణదండననుండి విముక్తుఁడవై జారిమానానిచ్చుకొనుటకు బాధ్యుఁడవు. పోనిమ్ము నీ వేకాంతకపకృతిచేసితివో ఆమెయే రక్షింపవేఁడుటచే వదలివేయుదమనుకొన్న నీవు చెరసాలయాజ్ఞల నుల్లంఘించుట యొకగొప్పతప్పు.

ట్యూ—ఏలినవారు నే స్వామిహత్యయందునిర్దోషినని యెఱింగి క్షమియించిరి. నేను ద్రోహముచేసినస్త్రీయే నన్ను రక్షింపమన్న రక్షించిరి. ఇఁక మూఁడవ నేరము ——— నాకు తెలియక చేసితిని. రక్షింపుడు. మరియు నేనుక్రిస్టియనురయితుల కుమారుఁడను. ఆర్మీనియను దేవాలయమునకుఁజెందినవాఁడను. గడచినరాత్రి —— నేనీనేరములన్నిటినుండియు దాటి యొద్దునబడితినా రసో —— గ్రీకు దేవాలయమునకు జెందెదనని దైవమును ప్రార్థించితిని.

న్యా—పవిత్రమగు మారప్పను దేవాలయమునకు జెందెద ననినందుల కెంతయు నానందము మాకు ఘటిల్లెను. తక్షణమే నీవు మా దేవాలయ ప్రదేశము జేసినచో ప్రాణముగాపాడుకొందువు.

ట్యూనారుఁ డమందానంద భరితుఁడై న్యాయాధిపతి పాదములఁబడి సలాముగావించెను. న్యాయాధిపతి ట్యూనారుని శృంఖలలనుండి విడిచి వేయుఁడని సేవకులకాజ్ఞాపించి రసోగ్రీకు దేవాలయమునకుఁ జెందువరకు గాచియుండుఁడని సైనికులతో జెప్పెను.

ఆసమయమునకే అల్లాయుద్దీను, శైలా, క్లోడిస్సా లటకు గొనిరాం బడిరి. ట్యూనారుడు వారినిసిగ్గున చూడజాలక తలవంచికొనెను.

అపుడు న్యాయాధిపతి "మీరందరును ట్యూనారుడు నిర్దోషి యని సాక్ష్యమిచ్చుటవలనను: అతనిచే నపకృతినొందిన కాంతయే వానిని క్షమింప వేడుటవలనను ట్యూనారుడు జీవములతో విడువ బడెను. అంతియేగాక ట్యూనారుడు రస్సో-గ్రీకు దేవాలయము నకు జెందనభిలషించుటచే మరి యేశిక్షకుకూడ పాత్రుడు గాడు. అతడిపుడు దేవాలయప్రవేశము జేయును గాన మీరెల్లరునటకు రావలయును. పిదప అల్లాయుద్దీన్——" అని న్యాయాధిపతియూర కొన నల్లాయుద్దీను ముందంజవేసి "యేలినవారియాజ్ఞ శిరసావ హించి ఆకార్యము జూడవచ్చుటయే గాక రస్సో-గ్రీకు దేవాలయ పవిత్రమతమును స్వీకరించెదను. నేను కారణాంతములచే మహమ్మ దీయునిచే పెంపబడినను నా తలిదండ్రులు క్రిస్టియనులే! గాన నావం శముమరల స్వీకరింపవలెనని యున్నది" అనెను.

ఆవాక్కులకు న్యాయాధిపతి మరింత సంతసించి ట్యూనారు, అల్లాయుద్దీనుల తమ మతస్థులుగ జేయుటకు తగు సన్నాహముల జేయుమని దేవాలయాధికారికి గబురంపి తానువారిని వెనుకనుంచు కొని రస్సో-గ్రీకు దేవాలయమును చేరెను.

అచ్చటనొక ముసలిమతగురువు అల్లా యుద్దీనును ట్యూనా రుడును మతస్వీకారము జేయువరకు నొక మఠములోనికి గొంపో యెను. ట్యూనారుడు దైవపీఠముకడ మోకాళ్ళం బడియుండెను. మతాధికారి మంత్రముల జదువుచుండెను: న్యాయాధిపతి, శైలా, క్లోడిస్సాలతో దూరముగ నిలచియామత కార్యమును దిలకించు చుం డెను. ట్యూనారునితో వచ్చిన సైనికులును, నల్లాయుద్దీను సను చరులగు హాఫీజు, యిబ్రహీములును ఆవలనిలచిరి. హాఫీజు, ఇబ్రి

హీములు, అల్లాయుద్దీను జన్మవృత్తాంతము నెఱిఁగిన వారగుటచే నిపుడాతఁడు క్రిస్టియను మతమును స్వీకరించుట యందేమాత్రము నడ్డగింపలేదు. హాఫీజు, యిబ్రహీములు మహమ్మదీయులగుటంజేసి క్రిస్టియను దేవాలయమును ప్రవేశించలేదు.

మంత్రపఠనము ముగించి, మతగురువు ట్యూనారునకు జ్ఞాన స్నానము గావించెను. తరువాత నాతనినొక మఠములోనికంపి అల్లాయుద్దీనును లోనఁబ్రవేశపెట్టిరి.

ట్యూనారునికివలె నల్లాయుద్దీనునకు గూడ జ్ఞానస్నానము గావించి "నీకేమి పేరు పెట్టమనెద" వని మతగురువు ప్రశ్నజేసెను.

"డానియల్" అని అల్లాయుద్దీను భక్తిపురస్సరముగ బలికెను.

అంత నాతనిపై మతగురువు పవిత్రమగు నీటిని జల్లి నామ కరణము జేసెను. చదువరులారా! ఇఁకమీఁద నల్లాయుద్దీను డానియలని పిలువఁబడును.

---

## ముప్పదిమూడవ ప్రకరణము

## ట్యూనార్! నిన్నుఁ బోల్చితినిలే!

అల్లాయుద్దీను క్రిస్టియను మతస్వీకారము జేయుటవలన లైలా మొదలగువారమందానందము బొందిరి. పిమ్మట వారందరును గలసి తమ యావాసములఁ జేరఁబోలేవ డానియలు "మీరు నడచు చుండుడు. నేనించుక ట్యూనారుతో సంభాషించివచ్చి మిమ్ముగలసి కొందు" ననెను.

డానియలు తనవంక వచ్చుచుంటగని ట్యూనారుఁడు సవినయముగ సలాము గావించి "ఆర్యా! మీరందరును నాయందుజూపిన దయకేనెంతయు బద్ధుఁడ" ననెను.

"ట్యూనార్! నీవావాక్యములు మనస్ఫూర్తిగ నంటివేని నే నెంతయు సంతసించితిని. నీవెన్నిజన్మము లెత్తినను శైలాఋణము దీర్పఁజాలవని నమ్మము. ఇపుడు నీవు సకల స్వతంత్రుఁడవు. మంచి మార్గమున నడచితివా బాగుపడెదవు. లేదా ఘోరశిక్షల ననుభవింతువు. నీవు చేసికొనిన పుణ్యమువలన శైలా మహారాజ్ఞి హృదయము కఱఁగి మృత్యువక్త్రమునుండి నిన్ను రక్షించెను. ఇదిగో యీ ధన మందికొని గౌరవజీవనము జేయు" మని డానియలతనిచేత ధనపుమూటనుంచి పోయెను.

ఆసాయంకాలము డానియలును, శైలాయును నీక్రిందివిధముగ సంభాషణకు గడంగిరి.

డా—నేను మింగ్రేలియా రాజకుమారుఁడననుసంగతి మనము క్యుటాయిను జేరువరకు రహస్యముగనుంచవలయును. అచ్చట తగిన నిదర్శనములను సేకరించుకొని నేను మింగ్రేలియా రాకుమారుఁడ ననవలెనుగాని లేనిచో నేరును నమ్మరు.

శై—...మింగ్రేలియా పౌరులు నామాటల బాటిచేయరా?

డా—నీమాటల నమ్మకేమి? నేను మింగ్రేలియా రాకుమారుఁడనని నీవనిన లాభమేమి? నేఁడుమింగ్రేలియా రష్యనుల యధీనమందున్నది: గాన బలవత్తరములగు నిదర్శనములు లేకయే నేను మింగ్రేలియా రాకుమారుఁడననిన యాపదవాటిల్లుట దథ్యము... నాకొక యుద్దేశము తట్టినది......

శై—అది యేమి?

జా—ప్రియసీ! నను బెంచిన తండ్రి మహమ్మదు పాషాయని నీవెఱుఁగుదువుగదా, ఆతనికి దెలియఁజేయకుండ నేమింగ్రేలియా ప్రవేశించి నా కాలమెట్లు పుచ్చఁగలను? శైశవమాదిగ నేఁటివరకు నన్నాతఁడు పెంపఁబెరిగితి. నేను కాఫ్సవిడచి వచ్చినప్పటినుండియు నాసంగతి నేమియు నెఱుఁగక యాతఁ డెంత చింతిల్లుచున్నాఁడో. ఇపుడు నేగ్రీష్టియనుఁడనైతిని. ఆతనికీవార్త నెఱిఁగింపకుండుట భావ్యము కాదు. కాన ముందు మహమ్మదుపాషా—నా పెంపుడు తండ్రి—ని జేరి మన్సూరుని వలన వినినవృత్తాంతమంతయు జెప్పి యాతనివలన యోగ్యతాపత్రములబడసి, మగిడి క్యుటాయిసు జేరి నేను మింగ్రేలియారాకుమారుఁడనని మరినేయడ్డంకియునుండదు. ఏమి?

కై—అవును. నేగూడ కాఫ్స వత్తునా?

జా—ముద్దుగుమ్మా! వలదు. ఏలనన నీవునాలుగైదు దినముల క్రిందటనే మహమ్మదీయ రాజాంతఃపురమునుండి దాటివచ్చితివి. నేబోవునది మహమ్మదీయ రాజ్యభాగము. అచ్చట మరల నీవు పట్టుపడితివా సర్వమును మొదటికివచ్చును. కాన నేవచ్చువరకు నీవు క్యుటాయిసునందే యుండుము.

కై—జానితుల్! మనమిరువురము గలసియే క్యుటాయిసు పోవుదముగాని నేనొంటిగ బోఁజాలను. నీవు నీపెంపుడు తండ్రివద్ద నుండి వచ్చువరకు నేను నాస్నేహితురాలగు తాఝావా తల్లివద్ద నుందును.

జా—అట్లే గానిమ్ము. నిన్నచ్చటకు దిగబెట్టియే నేకాఫ్స పోదును, మన్సూరుఁడు మనకొఱకై కాకసియను స్వర్గభూముల జేరు మార్గమును వ్రాసియుంచిన కాగితము లేమాయెనో గదా.

అని దాసియులనుచుండ నాగదితలుపు తెరువఁబడి క్లోడిస్సా యందుప్రవేశించెను. ఆమెను సగౌరవముగ దాసియులు లైలా లాహ్వానించి యుచితాసనమునందధివసింపఁజేసి తమయుద్దేశముల నెఱింగించిరి. క్లోడిస్సా కొంచమాలోచించి తానింకను కొంత కాలము టిఫిలిసునందుండి పిదప ఱ్యుటాయిసు మిమ్ము జూడవచ్చెద ననెను.

ఆమరునాఁడే దానియులు, లైలాలు తమయనుచరులతో గూడి, క్లోడిస్సాతక్కుంగలవారి శెలవుగై కొని టిఫిలిసువదలి సూర్యాస్తమయమగుసరికి జార్జియనువితంతు — తాఖానాతల్లి — గృహమునుచేరిరి. జార్జియనువితంతు తనకుమార్తెలతోగూడి లైలా మహారాజ్ఞికెదురేగి సగౌరవముగ సత్కరించి లోనికిగొంపోయెను. పిదప దానియులుగూడ లోనికిప్రవేశింప నుద్యుక్తుఁడగుచుండనించుక దూరమునుండి యెదురుగ గొందరశ్వారూఢులై వచ్చుచుంటదీక్షగ బరికించి "అదిగో! నాపెంపుడుతండ్రి మహమ్మదుపాషా వచ్చుచున్నాఁ"డని సంతోషాతిరేకమున నరచి యెదురేగెను.

ఆమరుచటిదినమున క్లోడిస్సా మన్సూరునిగృహమును కాచుకొనియున్న ముదుసలినిచూచి "అమ్మా! నేనుగూడ నిఁకశెలవు దీసికొనిపోవుటయే మంచిదనుకొందు" ననెను.

ము—నీవు మన్సూరుసింట నతిథిగనుండిన లైలాకెన్నియో విధముల సహకారివైతివి. ఆకారణమున నిన్ను నేను బాగుగా నెఱిఁగితిని. నీకిచ్చట కొంతకాలముండవలెననియున్నచో నుండుము. నాయభ్యంతరమేమియును లేదు.

క్లో—అట్లయినచో నేనిట గొంతకాలముండవలయుననియే యభిలషించుచున్నాను.

ము—మంచిది. ఈయిల్లు నీయదివలె నేభావించి నీయిష్టమువచ్చినచోటెల్ల చరించుము. ఇట నేనుండునంతకాలము నిన్నడ్డగించువారుండరు.

క్లో—ఆహా! పాపము, మనూర్వాడు మరణించినంతనే యీ మందిరము శోభాహీనమాయెను. ఆతడు సజీవుడై యున్నపుడు నేనిందలి కొన్నిగదులనేచూచి యానందించితిని. అవిగాక మిగిలిన గదులెంత యానందదాయకములై యుండునో!

అమ్మాయీ! ఈయిల్లు నీయది. నీయిష్టమువచ్చినచోటదిరిగి యానందింపుము. నీకేరు నడ్డురారు.

క్లోడిన్సా మామదునలి తనకాయింట యథేచ్ఛగ దిరుగ నిచ్చిన స్వేచ్ఛకామెను పలువిధములగొనియాడెను. మనూర్వాడుని గృహమందామె తిరుగనితావులేదు. క్లోడిన్సా తనయిష్టానుసార మామందిరమందన్నితావుల నారాత్రిశోధింపసాగెను. ఆమెపరిశీలించని గదిలేదు, కిటికీలేదు. పుస్తకములు తిరుగవేసెను; బీరువాలన్నియు బరీక్షించెను. తివాసీలు త్రిప్పివేసెను. కాని ఆమెమనోభీష్ట సిద్ధి కాలేదు. ఆమె దేనికై యట్లాయంతయు బరిశీలించుచున్నది? కొన్ని పెట్టెలు పరిశీలించినది. అందున్నవన్నియు దిరుగవేసిచూచెను. కొన్నిగదులు తాళములువేసియున్నవి. అవియెంతప్రయత్నించినను దెఱచుటకామె కనుపెట్టినవిగావు. ఇంతలో కోడికూసెను. వీధులలో జనసంచారము వినవచ్చెను. అప్పుడు క్లోడిన్సా యొకపరుపుపై దెల్లవారువరకుబండుకొనిలేచి యుదయముననే టిఫిలిసునగరమున బజారునకు బయల మాయెను.

అచ్చట నామె దుకాణమునకొక తాళముచెవిచొప్పున కొనెను. కొని వాటినన్నిటినిబట్టికొని మనూర్వాడుని మందిరమును జేరు

కొనియెను. ఆదినమున రాత్రి యెల్లరు నిద్రావస్థయందుండగా నామె గడచిన రాత్రిబలె నామందిరమంతయు బరిశీలింపఁగడంగెను.

కనబడిన పెట్టెలన్నియుఁ దనవద్దనున్న తాళముచెవుల సహాయమున దెరచుచుండెను. ఆమెకు కొన్ని పెట్టెలయందు రత్నములు కెంపులు, జవాహర్, వజ్రములు మొదలగునవి గోచరించినవి. కాని క్లోడీస్సా వాటిలో నేవస్తువుగూడ ముట్టుకొనక మిగిలిన పెట్టెల దెఱచి పరిశీలించుచుండెను కాని యామె దేనికొరకై యవియన్నియుం దెఱచుచున్నదో యదిలభింపలేదు. తుదకు విసిగి వేసారి యాలోచనా సాగరమున బడి దగ్గరనున్న యొకసోఫాలో మేనువాల్చి నిద్రించెను.

మఱునాఁ డుదయముననే లేచి కాలోచిత కృత్యముల నిర్వర్తించుకొని, ఆయింటిని కాచుకొనియున్న ముసలిది తెచ్చిన యాహారపదార్థముల గుడిచి క్లోడీస్సా యొక్క పర్యాయము తోటలో సంచరింపనెంచి మెట్లదిగి క్రిందికివచ్చి తోటలోనికున్న ద్వారము కడనిలచెను. అపుడామె కండ్లకొక యువకుఁడు జీర్ణవస్త్ర ధారుఁడై తన కాతిథ్య మొసగిన ముదుసలితో నీక్రింది విధముగ మాటలాడుచుండుటగాంచెను.

ముదుసలి— బాగున్నది. నీవుసాయంకాలము గనపడిన బరిణామము నెఱిఁగింతును!! అని యాయువకు నంపివేసి వెనుదిరుగు సరికి క్లోడీస్సా యెదురాయెను.

క్లో— ఈతఁడేనా నీవుక్రొత్తగా మన్సూరుని మందిరము కాచుటకు నియోగింపనెంచిన సేవకుఁడు?

ము— ఔను. మన్సూరుని పెద్దకుమారుఁడు వచ్చి యీగృహము సమానమగు ధనమున కమ్ముంబడువరకు యెక్కువమంది సేవకుల నియోగించి కాపాడుచుండమని యాజ్ఞాపించిపోయెను.

క్లో— అలాగునా? నమ్మకమగు సేవకుల జూడుము,

ము—నేకూడ నాయజమాని కుమారుని యాజ్ఞనిర్వర్తింప నెంచి యుంటిని.

క్లో—మంచిది.

ము—నేఁటివరకు నొకముసలివాఁడు తోటమాలిగ నుండెను. కానివాఁడుముసలివాడగుటచే రాత్రిలు మేల్కొనియుండి పగలు మేల్కొని యేపనియు జేయఁజాలకున్నాఁడు.—నిన్నను వాఁడునన్నుసమీపించి "అమ్మా! నేనుముసలివాఁడనైతిని.ఇదివరకువలె రాత్రింబవళులు మేల్కొని పనులు చేయఁజాలను గనుక వేరొక సేవకుని మాటలాడి నాభారమించుక తగ్గించుమని వేడుకొన నే నాతని సీయూరిలో వర్తకులవద్దకంపి నమ్మకమగు సేవకుడొండు కావలయును గాన తక్షణము బంపుమంటిని. వెంటనే వారివచ్చిన ఆఫ్రికాదేశీయునంపిరి. అతఁడు నైలునదీ ప్రాంతవాసియఁట. అచ్చట వారికి జీవనము కష్టతరమగుటచే నిటువచ్చెనట.

క్లో—మంచిది. వానికి జీతమునిర్ణయించితివా?

ము—లేదు. వాని నడవడినిగూర్చి మరికొంత యావర్తకుని మూలమున నెఱిఁగిన గాని నిర్ణయించను. అందువల్లనే 'నీవుసాయంకాలము వచ్చినచో నాయుద్దేశ మెఱిఁగింతు" నంటిని. వాఁడు నమ్మదగినవాడని తెలిసినచో జీతము నిర్ణయించెదను.

క్లో— వానిగూర్చి బాగుగ నెఱుఁగని దే మాత్రిము మన్మారుని మందిరమున జొరనీకుము.

"చిత్తము" ముదుసలి లోనికరిగెను. క్లోడిస్సా యాదిన మంతయు పుస్తకపఠనమందును, తోటలో సంచరించుట యందును గడపెను.

సాయంకాలము క్లోడిస్సా తోటలోనికున్న యొకకిటికీ వద్ద కూర్చొని, పుష్పగంధముతోగూడి వచ్చుచున్న చల్లగాలుల నాస్వా

దించుచుండెను. అప్పుడుదయమున వచ్చిన ఆఫ్రికాయువకుడే మరలవచ్చి యాగృహమును కాచుచున్న ముదుసలిని సమీపించి సలాముగావించెను. ఆమె వానితో "ఓరీ, నీగురించి విని సంతసించితిని. కాన వెంటనే పనిలోప్రవేశింపుము. నీవురాత్రులందప్రమత్తుడవై తోటలోనుండవలయును. అవ్వలిద్వారమునుండి తోటలో కెవ్వరును ప్రవేశించకుండునట్లు నీవు కాచుకొని యుండవలెను. ఒకవేళ నట్టిసమయమున నీకేమయిన నాపద సంభవించునెడ నీ యాయుధముతో ప్రాణరక్షణము గావించుకొనుము" అని యొక పిస్తోలు వాని కందించెను.

ఆయువకుడు వంగి సాలాముచేయుచు నాపిస్తోలునందికొని తోటలోనికరిగెను. ముసలిది గృహాంతర్భాగమున కేగెను.

క్లోడిస్సా వానియందే కారణముచేతనో అనుమానపడి తానున్నస్థలమునుండి యీవలకువచ్చి వానివెనుకనే రహస్యముగ దోటలోప్రవేశించెను. అప్పుడే సూర్యాస్తమయమగుచున్నది. ఆ యువకుడు తిన్నగపోయి తోటకవ్వలితట్టునున్న ద్వారమును బంధించి యుటునటు పరిశీలించసాగెను. క్లోడిస్సా చడిచప్పుడు లేకుండ నొకదట్టమైన పొదమాటునదాగి వానిప్రయత్నమేమో యని చూచుచుండెను.

ఆయువకుడట్లిటునటు పరికించి యాపరిసరప్రాంతముల నెవరును లేరని దృఢసంకల్పముచేసికొని, మెల్లగ క్లోడిస్సాదాగియున్న తుప్పకారుగజములదూరములోనిలచి యించుకసేపాలోచించి మరల నిటునటుజూచి, క్లోడిస్సాదాగియున్నతుప్పకు నాప్రక్కగలచెట్లకు మధ్యభాగమునగలనేలఁ దవ్వఁదొడగెనెను. క్లోడిస్సాయెందుకైన మంచిదని మొలనున్నకఠారి చేఁబూని మెల్లగా నాకులసందులలో నుండి ఘాఁడెందులకాస్థలముఁ ద్రవ్వుచున్నాఁడో చూచుచుండెను.

అట్లాతఁడు కొంతవరకుఁ ద్రవ్వి తానన్వేషించుచున్నది దొరికినంతనే సంతోషవికసితాననుఁడై లేవనుంకించుచుండ క్లోడిస్సా కఠారి, ఘుళిపించుచు, మృగరాజువలె వానిపైఁబడి చేయిబట్టుకొని "ఓరీ ! ఆగుము. మాటలాడితివా యీచురికకు నిన్నెఱఁజేతును !" అని బెదరించెను.

వాఁడు భయకంపితగాత్రుఁడై, తనవద్ద పిస్తోలున్నదన్న సంగతినేమరచి యామెమోకాళ్ళంబడి క్షమింపవేడుకొనెను.

"దుర్మార్గా ! మాఱాడకుము ! నీవుట్యూనారుఁడవుగావా ! మోసగాడా !" అని కఠారి ఘుళిపించెను.

ట్యూనారుఁడు తనమాయ బయటఁబడెనని క్లోడిస్సావంక చూచుచు నిశ్చేష్టుడయ్యెను.

---

# ముప్పదినాల్గవ ప్రకరణము

## రహస్యపు కాగితములు

రౌద్రమూర్తియై యట్లు క్లోడిస్సా కత్తిని ఘుళిపించుచు సమీపించినంతనే ట్యూనారుఁడు నోట మాటరాక నిలచిపోయెను. ప్రాణములను తెగించి రష్యను ఖైదునుండి పాఱివచ్చు సమయమునయిన, వెంటాడివచ్చుచున్న రష్యను సైనికులకు భీతిల్లని ట్యూనారుఁడిప్పుడు క్లోడిస్సా యెదుటభీరుఁడై నిలచిపోయెను. కారణమేమి?...ఆమె వానికెట్టి మహోపకారము గావించినది? ఆమె యెదుట నాతడెట్టి ఘోరమగు ప్రమాణము జేసినాఁడు? ఇప్పుడేమి చేయఁబూనినాఁడు?... తత్క్షణమే ట్యూనారుని హృదయమునం

దాసంగతులన్నియు మెఱపువలె చలించి గాయపరచినవి. . . ట్యూనా రుఁడు క్లోడిస్సా తన్ను పోల్చుకొనఁజాలదనుకొని వెఱ్ఱిపడినాఁడు. ఎట్లనా? తానట్లుముసలిరూపమున వచ్చినప్పుడు, చిన్ననాటనుండియు మనుష్యారునింట గాపున్న ముసలియే పోల్చుకొనజాలకపోయెను గదా యీామె యెట్లు పోల్చుననుకొనెను. కాని తనతలంపునకు సర్వమును వ్యతిరేకమాయెను. క్లోడిస్సా యెదుట ట్యూనారుఁడు గడగడ లాడుచు నిలువగనే, ఆమె "ట్యూనార్" అని గర్జించి వాని హృదయముపై కత్తినానియుంచి రెండవచేతితో వాఁడు ధరించిన చింకి దుస్తులచించి వేయుచు "రవంత కదలితివా యీాకత్తితో నినుపొడిచి చంపివేయుదు" ననె.

ట్యూనారుఁడామె సాహసమునకు మా్రిన్పడి ప్రతిమవలె నిలచిపోయెను!

క్లోడిస్సా వాని దుస్తులను చించి లోపలిజేబులలో నిమిడి యున్న రెండు పిస్తోలులను లాగికొని, నిరాయుధునిగ జేసెను.

పిదప, కత్తి మొలనిరికించుకొని రెండుచేతులతో పిస్తోలులను బట్టికొని ట్యూనారునివంక గురిచూపుచు, ప్రక్కనే ట్యూనారుఁడు తీసినగోతివంక దృష్టిసారించి "ఓరీ! అందున్న కాగితములదీసి నాకిచ్చివేయు" మని యాజ్ఞాపించెను.

తక్షణమే ట్యూనారుఁడా కాగితములను దీసి క్లోడిస్సాహస్తగతము చేసెను. తరువాత నిక తనకు మృత్యువామె చేతిలో తప్ప దని ట్యూనారుఁడు నిశ్చయించుకొని గడగడ లాడుచు మోకాళ్ళం బడెను.

క్లో—ఓరీ! మోకాళ్ళనుండి లేచి నేఁజెప్పినది చేయుము. పోయి ఆగోయి పూడ్చివేయుము.

ట్యూనారుడామె యాజ్ఞ నిర్వర్తించెను.

క్లో—ట్యూనార్! నీవేమని ప్రమాణము గావించితివి? దుర్మార్గా! నిన్ను చెరసాలనుండి విడిపించుట మాదితప్పు. ఇప్పుడయినను మించిపోలేదు. నేను తలచుకొంటినా యీక్షణమే నీవు బంధింపఁబడెదవు. మూర్ఖా! ద్రోహీ! తొందరపడకుము. మన్నారునిరహస్యములుగల కాగితములు తస్కరించినవాఁడవు నీవని నేనిదెపోయి చెప్పితినా ప్రభుత్వము నిన్నురితీయును.

ట్యూ—(భయమంది) అమ్మా! రక్షించుము. రక్షించుము. ఈ పర్యాయము చూడుము. ఇఁక నేను టిప్లీనువదలి పోయెదను. నా ప్రాణముగాపాడుము.

క్లో—కుక్కా! ఈకాగితములు నీకెట్లువచ్చెనో నాకాలసింప కెఱింగింపుము. అబద్ధమాడితివా (అని పిస్తోలుచూపి) నీకన్న టక్కరిని నేను...

ట్యూ—అమ్మా! నిక్కము వచించుచున్నాను వినుము. లైలా యెత్తుకొనిపోఁబడిన నాటిరాత్రి నాయజమానిచచ్చిపడియున్న తావున నే నున్నాను. అపుడాతని శవపువస్తులలోనుండిన తాళముచెవుల సంగ్రహించి, యిదివరకు చూచినవాఁడవగుటచే యీకాగితములు దొంగిలించి యిట పాతికొంటిని. అట్లు పాతినవెనుకనే బంధింపఁబడితిని. ఇప్పుడు...

దట్టముగనున్న చెట్లవలన చంద్రకాంతి యడ్డగింపఁబడుటచే ట్యూనారుని ముఖలక్షణములు గమనింప క్లోడిస్సాకువీలులేకుండెను. క్లోడిస్సా యాతఁడా కాగితములు తెచ్చి దాచినవెంటనే బంధితుఁడగుటచే, వాటియందు గులిస్తానులోయకు బోవుమార్గమునుగూర్చి చదివి యుండడని యూహించెను.

క్లో—నీవు నిజమే పల్కితివి. ఇపుడు నీయాజ్ఞ నెరవేర్చితివా కరుణించి వదలివేయుదును. లేదా...

టూ్యా—తప్పక నెఱవేర్చెదను.

క్లో—నీవు తక్షణమే గుఱ్ఱపుసాలకుపోయి యొక గుఱ్ఱమును చేకొని టిప్లిసు వదలి పంబయినఁబొమ్ము.

టూ్యా—ఎవరికిని తెలియకుండ నేను గుఱ్ఱమును తీసుకొని పోయినచో నన్ను దొంగగ భావింపరా?

ఆ వాక్యము లాలించి క్లోడీన్సా వికటహాసము చేయుచు "ఇప్పుడు నీవు దొంగవుగ ననుకొను చుంటివా? — నీ యజమాని రహస్యపు కాగితములు దొంగిలించుటవలన నీవు దొంగవుగావా? అంతపని చేయఁగా లేనిది యిప్పుడు గుఱ్ఱమును తీసుకొనిపోయినచో దొంగ వగుదువా యేమి? పొమ్ము! మరల ఆఫ్రికను వేషమును విడిచి టిప్లిసు ప్రవేశించితివా నిన్ను పట్టుకొని అధికారుల కప్పగింతును. పో" అని మరలనవ్వి "నీవు ద్రోహివయ్యు క్షమింపబడితివి. మరల నీవీనగరమున గనపడితివా శిక్షింపఁబడుదువు" అనెను.

టూ్యా—అమ్మా! అట్లేపోయెదను.

క్లో—పద. గుఱ్ఱపుసాల జేరుదము. ఇదిగో విషసహిత కుఠారము నన్ను మోసగించి పారిపో నెంచితివా యీపిస్తోలులతో నీప్రాణముల దీయుదును.

ఆమె వాక్యములకు భయపడి టూ్యాసారుఁడడుగు దీసి యడుగు వేయఁజాలకుండెను. అట్లే భయపడుచు నాతడు గుఱ్ఱపుసాలఁ బ్రవేశించి నిలచెను. క్లోడీన్సా యచ్చటనున్న యొక హయమును జూపి "నీవీహయారూఢుఁడవై పొమ్ము" అనెను.

టూ్యా—అమ్మా! మరణించిన నా యజమాని కీహయమన్న ప్రాణము. అతడు దీని నెల్లప్పుడును స్వారి చేయుచుండెడివాఁడు. కాన నదితప్ప మరి దేనినయినఁ జేకొనిపొమ్మనిన—

క్లో— అదియునుగాక నీకేట్టి యొక ... ము యొక్క—
చుకొని పారిపోవుటకు వీలుండదు. దానినే యధివసించి పొజేరినచో

ట్యూనాథుడు ... సాహాయ్యమునిచ్చును.
తోడను జేసుతోడ నలంకరింపబడుచుండె, క్లోడిస్సా, అచ్చటనున్న రాళ్ళతో నమర్పబడిన స్థలమునుబట్టి దానిపై గుఱ్ఱము నడచిన చప్పుడై యింటిలోని వారికేమైన తెలియునేమోయని "ట్యూనాథ! ఆస్థలముపై గర్జింపకను" యని ప్రోత్సాహించెను.

పిదప ట్యూనాథుడు తాహయమును పట్టికొని నడచి తోట యవ్వలిద్వారమును తెరచి యదిదాటెను. అచ్చటనిక నాతడశ్వారూఢుడై పోవుననగా క్లోడిస్సా "ఇక వేగముపొమ్ము, ఇంతవరకు నిను రక్షించితిని. రేపుదయము నిరిల నీవీపట్టణమున నాకంటబడితివా సాయంకాలమగునరికి చెరయుంచుండునట్లు చేతును. పొమ్ము! ఎందయిన దుష్ప్రవర్తనమాని సుఖజీవనము జేయు"మని యాద్వారమునుమూసి, తానటకు దెచ్చిన పారనెథాస్థానమునుంచి తన గదిలోని కేగెను.

ఏగి తలుపు గడియవేసికొని పక్కపై చేరబడి తానందికొనిన కాగితములయందేమున్నదో చదువుచుండెను. అందొక కాగితమునందు మన్సూరు డాసంగతి నెఱింగించలైలాయుల్లాయుద్దీనుల కుంగరము లంపిరన్న యిన సంగతియుండెను. రెండవదాని యందు సౌందర్యమయమగు గులిస్తాను లోయకు బోవుమార్గము వర్ణింపబడియుండెను.

అవిచూచి యామెయానంద బాష్పముల రాల్చినది— తావెతికి వేసారినవి దొరకినవని యుప్పొంగినది. పిదప దల్పముపై నుండి లేచి యిటునటు పచారు చేయుచు తానునిజముగ నప్పుడా గులిస్తాను లోయలో విహరించుచుంటినేమోయని భ్రమింపసాగెను,

ట్లు
గ్నాటి నా మెకు లైలా దాసియలు బాహాసభమునఁబడ
చేకొని గ్గట్టనుకొనెను——

వారికీ వృత్తాంత మెఱింగింపనలెను. అందులకు నేబద్ధులను.—— ఇవినావద్ద నుంచుకొనుటతప్పు. వారలకీసంగతి నెఱింగించితినా మనూర్నరుఁడు మరణించినను నాకో సిరహస్యము దెలిసినవారు ముగ్గురమగుదుము. గులిస్తానులోయ రహస్యము నెఱిగినవారినలంకరించుట కాలోయయందే గులాబి వృక్షములు గూడనున్నవి. అచ్చట గలధనము యీభూవలయమునగల చక్రివర్తుల సింహాసనముల గొనుటకు సరిపోవును. అందలి వజ్రవైడూర్యాదులు సౌందర్యరాశియగు లైలా కానందముఁ జేకూర్చును. లైలా! నిన్ను నేనెంత ప్రేమించితిని. సహాయము గావించితివి. అట్టినీకీ గులిస్తానులోయకుఁ బోవుమార్గమును త్వరలో తెలియఁజేతును. డానియల్! ప్రాణస్నేహితుఁడా! భూలోకసుందరియు, కరుణామయియు నగు లైలా ప్రియుఁడవగు నీ కా కాకసియను పర్వతాంతర్గత గులిస్తానులోయం జేరబోవురహస్యమును చెప్పెదను. ఆహా! ఏమీ అద్భుతము. గులిస్తాను లోయకుఁ బోవుమార్గము వ్రాయబడియున్న కాగితములు చదివి నంతనే నాహృదయ మిట్లుప్పొంగుచున్నది. నాకారహస్యలిఖితములు దొరకినివి. మానవులెఱుగనిది తెలిసినది గనుకనే నాయానంద మద్వితీయము!!

మనము క్లోడిస్సాహృదయము నించుక పరిశీలించినచో స్వలాభమంకంటె నెక్కుడుగ నేదియో యామెను బాధించుచుండుట గాంచగలము. అదియేమి? పిరికితనము. తనవద్దనుండి యాకాగితములెవరయిన బలవంతముగ లాగికొందురేమో యని భయపడుచుండెను. ఆరహస్యస్థలమును జేరుమార్గమామె యామూలాగ్రముగ జదివెను; కాని యనేకకష్టముల కోర్వవలయును, దాని

యందు భయంకరుఁడగు దొంగయొకఁడు గలఁడు. కాన నామె యొక్కతెయు నటకెట్లుపోగలుగును? తానొక్కతెయే బయలు దేరినచో యేగోతిలోనో, దొంగచేతిలోనో పడి ప్రాణముల విడవలసివచ్చును. మనోహరములగు పుష్పవనములతోడను, అమూల్యములగు వజ్రపు గనులతోడను, అమృతప్రాయములగు సెలయేళ్ళతోడనుగూడిన గులిస్తానులోయ జేరుట కెన్నికష్టములనుభవింపవలయును! క్లోడిస్సా సాహసించి బయలుదేరి యాలోయ జేరకపూర్వమే మరణింప నిష్టములేదు! తానెట్లేగగలదు? తనకు సహాయులై యెవరటకు వత్తురు? అందుకు తగినవాడువీరుఁడును, సాహసికుఁడునునగు డానియులుతప్ప వేరొకఁడులేడని యామె నిశ్చయించుకొనెను.

పైవిధముగ నాలోచించుకొనుచు క్లోడిస్సా యారాత్రంతయు గడిపి యుదయమున లేచుసరికాయిల్లుకాచుకొనియున్న ముసలి వచ్చి "అమ్మా! నిన్ననే పనిలోప్రవేశించిన ఆఫ్రికనుయువకుఁడు మున్నారని హాయముతో నదృశ్యుఁడయ్యె" నన క్లోడిస్సాయాశ్చర్యమునభినయించెను.

తరువాత క్లోడిస్సా యాహారమునుగుడిచి, తాను టిఫిలిసు నందుండినకార్యము నెరవేరినదిగనుక నికపోయెదనని యాముసలితోజెప్పి యామెయొసంగినస్వేచ్ఛకు బహుమానమొసగి క్లోడిస్సా హయారూఢయై యాయింటిలోనివారందరికడ శలవుపుచ్చుకొని ప్రయాణమాయెను.

---

# ముప్పదియేడవ ప్రకరణము

## కష్టము

క్లోడిస్సా యటనుండి బయలుదేరి తిన్నగ జార్జియనువితంతు గృహమును చేరంబోయెను. ఏలనన డానియలు కార్సునుండి వచ్చువరకు లైలామహారాజ్ఞి యచటనుండునని తెలియుటవలన. సాయంకాలమాయె యాజార్జియను వితంతుగృహమును సమీపించునసరికి యిబ్రహీమ్, హాఫీజులు బయటవిశ్రమించి హుక్కా కాల్చుచుండిరి. పిమ్మట లోపలికేగి లైలామహారాణిచేతను, డానియలువలనను గౌరవింపబడెను.

అచ్చటనే జార్జియనువితంతుకుమార్తెలతో నుండుటవలన గులిస్తానులోయకు బోవుమార్గము వ్రాయబడియున్న కాగితములు తనకు దొరికినవని చెప్పక యూరకొనెను. పిదప లైలా క్లోడిస్సా వృత్తాంతమంతయును, తన కామెయొనర్చిన మహోపకారమును జార్జియను వితంతువుతో చెప్పి క్లోడిస్సా నామెకు పరిచయముచేసెను.

మా చదువరులకు లైలాడానియలు మొదలయినవారా వితంతు గృహమును చేరగనే కార్సుపాషాకూడ నటకేవచ్చుచుండెనని యిదివరకే తెలియబరచితిమి. ఆపాషాకు, డానియలు (అల్లాయుద్దీను కార్సు వదలి వెళ్ళినప్పటినుండియు నాతనిసంగతి నేమఱుగరాకుండుట సముచితపరివారముతో టిప్లిసు బయలుదేరెను. అతఁడు దగ్గర దారి తప్పి చుట్టివచ్చుటచే జార్జియను వితంతు కళ్ళము సమీపించవలసివచ్చి యటనే తన పెంపుడు కుమారుఁడగు నల్లాయుద్దీనును (డానియలు) కలిసికొనియెను.

చదువరుల కిచ్చట, రష్యనులు మహమ్మదీయ రాజ్యాక్రమణము యుద్ధకారణము దెలియజేయవలసియున్నది. 1853 సం॥ శర

దృతుపుసం డీయుద్ధకారణము సంప్రాప్తించెను. కాని సుల్తాను, రష్యనువారుపై యుద్ధమింకను జాటలేదు. రష్యనులు డాన్యూబు నదీతీరమునకున్న మహమ్మదీయ రాజ్యభాగము నాక్రమించిరి. వారినుండి దేశమును కాపాడుటకై ఓమర్ పాషా నాయకత్వము క్రింద సుల్తాను పెద్దసైన్యమును తయారుచేసి యుంచెను. కాని యింకను యుద్ధము జాట బంపలేదు. సుల్తాను సైన్యములు యుద్ధ సన్నద్ధములై యున్నవిగాని యింకను విషయమ్మునందు రాజకీయ వేత్తలమధ్య నీసంగతులు వాదనలలో నుండెను. రాబోవుయుద్ధ పరిస్థితు లెంతచీకాకు గలుగజేయునోయని యూరపు, ఆసియాఖండ ములు తల్లడిల్లుచుండెను. అట్టి క్లిష్టపరిస్థితియందు దేశమునువిడచి రష్యనుల యధీనమందున్న జార్జియాలో నడుగిడుట శ్రేయస్కరము కాదని ఓమర్ పాషా యెఱిగియున్న పుత్రవాత్సల్యమున డానియలు (అల్లాయుద్దీను) సేనవారయ సముచిత పరివారుడై బయలుదేరి వచ్చెను. ఆహా! పెంచినప్రేమ యెట్టిదో చూడుడు!

బయలుదేరి, దారిమధ్యనే జార్జియను వితంతుగృహమున తన పెంపుడు కుమారునిగాంచి యమందానంద భరితుడాయెను. కాజ్న పాషా ముసలివాడేయయ్యు కాయశరీరుడగుటచే బలవంతుడై యుండెను. గొప్ప తెలివయినవాడు. యుద్ధభూమియందు దసమానుడని పేరుపొందెను. పెద్దదేశమున కిప్పుడు రాజప్రతినిధి. డానియలాతని జూచి ఒక్కమారు కౌగలించుకొనెను. పాషాయును కుమారుని యాలింగనముచేసి సంతసించెను.

పిమ్మట డానియలు తానును లైలాయును, దాటివచ్చిన కష్టములనాతనికి నివేదించెను. తరువాత డానియలు తనపూర్వవృత్తాంతము నాతని కెఱింగించి తాను మరల క్రిస్టియను మతమును స్వీకరించి అల్లాయుద్దీనను నామమునకు మారుగ డానియలను పేరొంది

నట్లు చెప్పు, పాపాకంటఁదడి పెట్టెను. కాని దగ్గర బంధువులగు లైలా, డానియలు మరల కలసికొనినందుల కానందించెను. పాపా, డానియలునకు తన పదవినిప్పించ నెంచెనుగాని యిట్లాతడు క్రిష్టి యనుమతస్థుడగుటచే, యాయాశ నిరాశ చేసికొనియెను.

ఆమరునాటి వరకు పాపా పెంపుడు కుమారునితో నటసౌఖ్య ముగఁగడపి, డానియలు కోరినప్రకారము తాను మింగ్రేలియారాజ కుమారుఁడని నిదర్శనములు త్వరలో బంపెదనని చెప్పి గార్బు మరలి పోయెను.

తత్కారణమున కార్బుపాపావద్దనుండి తన జన్మవృత్తాంత మును దెలియజేయు కాగితములు వచ్చువరకు డానియలు, లైలా మొదలగువారితో నటనుండ నిశ్చయించుకొనుట వలన క్లోడిస్సా వచ్చి చేరుకొనగలిగెను.

తరువాత, జార్జియను పితంతు కుమార్తెలతో నటనుండి లోనికేగెను.

అప్పుడు క్లోడిస్సా తనకు దొరికిన కాగితముల గురించి లైలా డానియలులకు వేరువిధముగ వర్ణించి చెప్పెను గాని టూర్యావారుఁడు దాచెనని మొదలగు సంగతులు చెప్పలేదు. ఆసంగతి వినినంతనే లైలాడానియలుల యానందమున కంతము లేకుండెను. అంతియే కాక, యాకాగితములలో నొకదానియందు తనజన్మ వృత్తాంతము కూడ వ్రాయఁబడి యుండుటచే మరింత యానందించి డానియలు క్లోడిస్సా, తమకు చేయుచున్న యుపకారముల కామెను పొగడెను.

మరియు నాగులిస్తానులోయ రహస్యమెప్పుడును ముగ్గురికి తెలిసియుండ వలెనని డానియలు, లైలాలు వినియుండుటచే నిప్పుడు క్లోడిస్సా, డానియలు, లైలాలు కలసి యాలోయకుబోయి యా రహస్యభూములను చూచిన వెనుక మింగ్రేలియ జేరుటకును; క్లోడి

స్నా యిష్టమయిన వారివద్ద నుండుటకును లేనిపక్షమున తనయిష్టము వచ్చినచోటికి పోవుటకును నిశ్చయించుకొనిరి.

ఆసాయంకాలమే లైలా, హైదాయమీరాలతో, తాను తొందరపనిమీద డానియలు క్లోడిస్నాలతో నొకచోటికిపోయి రావలెననియు, నటనుండి వచ్చినవెనుక మింగ్రేలియా బోవుదమనియుఁ జెప్పెను. డానియలు, తన జన్మవృత్తాంతమును గూర్చి కాగితములు కార్సునుండి వచ్చువరకటనుండి పిమ్మట హైదా యమీరాల దోడ్కొని మింగ్రేలియా చేరుఁడని అల్లాయుద్దీను హాఫీజునకు జెప్పెను.

ట్యూనారుని యాశలన్నియు నిరాశలాయెను. క్లోడిస్నావలన యాజ్ఞాపింపఁబడి మన్సూని ముసలిగుఱ్ఱము పై టిఫిలిస్ వదలి పయనమాయెనే గాని యెటు పోవలయునో వానికే తెలియదు. మతి చలించిపోయెను. అందువలన గుఱ్ఱమెటుగొనిపోయిన నచటికే పోసంకల్పించుకొని యాలోచించుచు గూర్చొనెను.

చంద్రోదయమాయెను ఆముసలిగుఱ్ఱము ట్యూనారుని కాకసస పర్వత పంక్తులలోనికి గొంపోవుచుండెను. కొండలలో చాలవరకు బోయెను. ట్యూనారుఁడు మతిచెడి కూర్చొని యుండుటచే గుఱ్ఱము తన్నట్లు కాకససుపర్వత ప్రాంతములలోనికి గుఱ్ఱము తీసికొని పోవుచున్నదని యెఱుగడాయెను.

మరియొకగంటపోయినవెనుక మెలకువనంది తాను కాకసస పర్వతాంతర్భాగమునకు గొనిరాబడుచుంటినని యెఱిగి యచ్చట మరలఁ గ్లోడిస్నా ప్రత్యక్ష్యమై చంపునేమో యను భయమున గుఱ్ఱమును త్రిప్పనెంచెను గాని యదితిరుగక తిన్నగపోవుచుండెను. ఆలోభాగములలోనే గులిస్తానులోయకలదు. అటకామాయమెన్నియో పర్యాయములు మన్సూరునిగొనిపోయినదగుటచే నిప్పుడు ట్యూనా

రుఁడు దానిని త్రిప్పివేయ నెంచినను తిరుగక తిన్నగ గొంపోవు చుండెను. ట్యూనారుఁడ కచ్చట (లోయలో) క్లోడిస్సాచే మరణమేమో యని భయముపీడించుచుండెను. వెంటనే, కత్తికొని గుఱ్ఱమును బాదివచ్చినదారిపైపు త్రిప్పియుక్కెనుగాని గుఱ్ఱము వానిదెబ్బలను సరకుగొనక తిరిగి గులిస్తానులోయపైపే గొనిపోవుచుండెను. అప్పుడు ట్యూనారుఁడు "హా! దైవమా! ప్రాణభీతిచే గులిస్తానులోయఁ జూచుభాగ్యము నాకువలదనుచున్నను యీగుఱ్ఱముచే పోవు చున్నది. కానిమ్ము. నీకృపయెట్లున్నదో ఒక్కపర్యాయ మాలోయయందలి దృశ్యమునుచూచిచో మరణింతు"నని గట్టిగనర చెను. ఆయరపు పర్వతశ్రేణులందు మాఱుమ్రోగెను.

---

## ముప్పదియారవ ప్రకరణము

## కాకసు పర్వతములలో ప్రయాణము

టిఫ్లిసునగరము పూర్వ కాకసియను పర్వతములకు దగ్గరనే యున్నను, గులిస్తానులోయను కలిగియున్న కాకసియను పర్వత పంక్తులు చాలాదూరమునగలవు. ట్యూనారుడట్లరుగుకొని పోవు చుండ పెద్దపెద్దలోయలొకదానివెనుక నొకటాతనికి గానవచ్చు చుండెను.

వాటినిదాటి పోవంబోవ నాప్రదేశమంతయు నెటుచూచినను మహాభయంకరములగు లోయలతోడను, అగాధములతోడను నెత్తయిన పర్వతశ్రేణులతోడను, చీమచిటుక్కుమన్న నాప్రదేశమంతయు మాఱ్ఱ్మోగునట్లుచేయు గహ్వరములతోడను నిండియుండెను. అట్టి

ప్రదేశమునందు పచ్చపూపొదలలోనికి ట్యూనారుడు విడిపించిన హయము మేయుచున్నది. ఎడనెడనాగి యిటునటుజూచి మరల ప్రయాణము చేయుచుండెను.

చంద్రుడాకాశమున సహవాసులగు నక్షత్ర సంఘముతో ప్రయాణము సాగించుచుండెను. ఇచ్చట ట్యూనారుని గుఱ్ఱము కొండ భాగమును కొంత యతిక్రమించెను గాని గులిస్తాను లోయగల తావు చాల దవ్వు గలదు.

కొన్ని గంటలు గడచెను. హయమొక మెట్టప్రదేశమును జేరెను. ఆభూమియంతయు బచ్చికతోడను విశాలమగు వృక్షముల తోడను నిండెను. ప్రక్కనే ఒక సెలయేరు వెన్నెలలో వెండిబాట వలె గానవచ్చుచుండెను. అచ్చట హయమాగినది. ట్యూనారుడు క్రిందకు దిగి తానెంత బాధించినను సహించిన యావాహనమును ముద్దాడి దప్పిగొనిన వాడగుటజేసి కొంచము నీరమును గ్రోలి యావంకనే ఫలసముదాయముతో వంగియున్న చెట్లను సమీపించి వచ్చి, పచ్చికపై విశ్రమించి గులిస్తాను లోయనుగూర్చి తలంచుకొనుచుండెను. హయమచ్చట పచ్చిక మేయుచు దిరుగాడుచుండెను. ట్యూనారు డెట్లయిన నాసౌందర్య వంతమగులోయను ప్రవేశించి మిగిలిన కాలమంతయు నటగడుపుటయో లేక యందలి యమూల్యవస్తువులతో యూరవుపోయి యట ధనవంతుడై యుండుటయో యుత్తమ మనుకొనుచుండెను. హయమెట్లయిన తన్నా లోయసమీపమున నైన దించుననియు నటనుండి లోనికిబోవుట తన వంతనియు ట్యూనారుడనుకొనెను. పాపభీతిలేని యాయువకుడు తన దౌష్ట్యమునకు దగినశిక్షజేయ దైవము తన్నాతావునకు గొని పోవుచున్నాడను జ్ఞానములేక — తాననుకొనినట్లు దైవముతన మేలెంచియే తలవని తలంపుగా గులిస్తాను లోయకుగొనిపోవు బుద్ధి

సాహాయమునకు గర్జించె ననుకొనుచుండెను. పిదప సంతోషాతిరేక మున పచ్చికబయలునుండి లేచి "ఆహా! ఇదినాభాగ్యము కాక యిట్లనుకొననిదే కాకసియును పర్వతాంతర్భాగముగల గులిస్తాను లోయ నన్నప్రయత్నముగ నాకర్షించుచున్నదే యని హాయారోహ ణముచేసి బయలుదేరెను.

కతికామే యు యూ్యజనేయు మానెలయేటి యొడ్డున నొక మైలుపడచి పిడుగుపడుటచే నాకులులేని చెట్టువద్ద నిలచి, పిదప నాయేటి యావలితీరమున మైదానమునుదాటి, ప్రక్కనున్న యగాధమునుండి పోవునొక బాటవెంట బడెను. అది కడుభయంకర మగుదారి. దారిలో ట్యూనారున కేమాత్రము హానికలుగకుండ నతి జాగరూకతతో బోవుచుండెను. ట్యూనారుం డా ప్రదేశమంతయు గలయ బరికించి, యీప్రదేశములయందు మన్యారున కేమాత్రము నపాయము కలుగకుండ నాహాయము గులిస్తాను లోయలోనికి గొంపోవుచుండెడిదని యూహించెను. ఇంతలో సూర్యోదయ మాయెను. హాయమాదారి వదలి యెత్తయిన రెండుపణుకుల మధ్యనుండి పోవుదారిలో ట్యూనారుని తీసుకొనిపోవుచుండెను. ఆపణుకులమధ్య దారి యిరుకై యుండుటచే ట్యూనారుని కాళ్ళు చెక్కుకు పోవుచుండెను. దారివెంబడి బోయి హాయమొక పెద్దగుహవద్ద నాగెను.

ట్యూనారుం డదియేగులిస్తాను లోయను చేరుమార్గమయి యుండుననీ, గుఱ్ఱము దిగెను. అంత నాహాయము సాలలోనికేగు నట్లా గుహలోనికిం బోయెను. దానివెనుకనే ట్యూనారుండు పడెను. కాని యంతయు గాఢాంధకార బంధురము. ట్యూనారుండు మరి ముందున కడుగిడజాలక నిల్చెను. ఆతనిచెవులకు గలగలశబ్దము విన నయ్యె. దానింబట్టి లోన నొక సెలయేరు పారుచుండవచ్చు నను

కొనుచుండ లోనుండి హయము వెలుపలకువచ్చి పచ్చికమేయుచుండెను. మనుష్యుని గులిస్తానులోయకు గొనిపోవుచు మార్గమధ్యమున దప్పి గొన్న యెడల నీగుహావద్దనాగి లోని సెలయేటినీరముల ద్రాగివచ్చుట యాహయమున కలవాటైయుండునని ట్యూనారుఁడనుకొనెను.

పిదప తానుకూడ నంధకారమయమగు గుహ ప్రవేశించి యిటునటుతడవుకొనుచు లోనికరుగుచుండ యాతనిచేయి యొకగూటి లోపెట్టెను. అందాతనిచేతి కేదియో చల్లనివస్తువు తగిలి భయమొంది గడగడవడకుచు ముందునకడుగిడజాలక కొంతవడినిలచి మరల ధైర్యమూని, యావస్తువు నీవలకులాగి తడవి యది లోహము ప్రమిదగా నెఱింగెను. పిదప నచ్చట నే దీపమును వెలిగించుమార్గమును గొంతచమురునుంటగాంచి బయటకుదీసి దీపమును వెలిగించెను.

ఆదీపపుకాంతియం దాగుహ రమారమి యిరువదిగజముల దూరముండుననియు నాకొస నొకసెలయేరు పారుచున్నట్లును గుర్తించెను. తరువాత నాగూటియందున్న సామగ్రిని వీక్షించి ట్యూనారుఁడు దాహమేమరచెను. ద్రాక్షరసాయనముతో నిండిన మూడు సీసాలు తినుబడిపదార్థములు నందుగలిగియుంటచే ట్యూనారుడవి యించుకభుజించి యాద్రాక్షరసము నించుకత్రాగి యచ్చట బరుపబడియున్నగడ్డిపై విశ్రమించి నిద్రావశుడాయె.

కొంతవడి యొళ్లునిమరించి లేచి సూర్యునిగమనమునుజూచి రెండుగంటలకాలమే తానుపండుకొని నట్లెరింగి యాకలిగొనిన వాఁడగుటఁజేసి ట్యూనారుఁడచ్చటిగూటిలోని ద్రాక్షరసము నించుక గ్రోలినపిమ్మట నొకపెద్దసీసానిండ ద్రాక్షరసమునునింపుకొని యీవలకువచ్చి హయారూఢుఁడై బయలుదేరెను.

హయమాతని తనయిష్టానుసారము గొంపోవుచుండెను. దానికి తెలిసినట్లు తన కాదారి తెలియకపోవుటచే ట్యూనారుఁడు

దాని నేమియు బాధించక యచ్చట ప్రకృతిసౌందర్యమును తిల కించుచు నానందపరవశుడగుచుండెను. సౌందర్యమున కాకరములగు లోయలు — సింగినొరసికొనిపోవుచున్న మహాభూజములు — అవ్యక్తమధురగానము చేయుచువొరలిపోవుచుండిన సెలయేళ్ళు నాతని కన్నుల కానందదాయకములాయెను. ఒకయెడ పండ్లభారమునకు వంగినవృక్షములు సొంపునింపుచుండెను. ఎదురుగ మహోన్నతము లగు పర్వతరాజములు పై మేఘమాలికలు విహరించుచుండెను. అంతియేగాక పోవంబోవ మహాభయంకరములగు లోయలుగాన వచ్చి యాప్రదేశమంతయు నిశ్శబ్దముగనుండి వానికిభీతిగొల్పు చుండెను.

మూడుజాముల ప్రొద్దెక్కెను. హాయము ట్యూనాదునొక పచ్చికమైదానముకడచేర్చెను. అచ్చటికి కొన్నిగజములదూరముగ నొకరాళ్ళకుప్ప మనుష్యులచే పేర్చబడినట్లుండెను. ఆయటవీప్రదేశ మున కేమనుజుడువచ్చి యాకుప్పపేర్చెనాయని ట్యూనాదుడను కొని యెవ్వరో విలాసార్థమాస్థలములబోవుచు మరలివచ్చుటకు దారి తప్పకుండ గుర్తుగ నాకుప్పవోసియుండనోపునని నిశ్చయించుకొనెను.

అట నాహయమొకగంటసేపాగి మరలప్రయాణమాయెను. అచ్చటిదృశ్యములు మరింత భయంకరముగను సుందరముగను నొప్పారుచుండెను. సాయంకాలమగువరకాప్రదేశము వెంబడి గుఱ్ఱ మాతనినిగొనిపోవుచుండెను. చీకటిపడుచుండ నొకగుహనుచేరెను. అట ట్యూనాదుడు గుఱ్ఱమునుండిదిగి క్రీస్తుదేవుని విగ్రహమును గాంచి ఇది క్రిష్టియనుల దేవాలయమనియు ప్రయాణికులకై నిర్మింపబడియుండునవియు అనుకొనెను. ఆవిగ్రహముముందు భక్తులు ప్రార్థనమునకై యొకచాతిపలక యమరుపబడియున్నది. అదంతయు తిలకించి మరల ట్యూనాదుడు హయారూఢుడాయెను. అంత

నావాఱువము ధరాధరగహ్వరములు మాఱుచెలంగునట్లు గట్టిగ సకిలించి బయలుదేఱిపోయి యొకచో నాగెను. అచ్చటనే యొక గుహగలదు. ట్యూనారుఁడటదిగి యిటునటుచూచుచుండ గుఱ్ఱము గుహలోనికిపోయెను. గుహాంతర్భాగము చీకటిమయమయి యుండు టచే ట్యూనారుఁడు తనవద్దనున్న ప్రమిదతీసి చముఱుపోసి వెలి గించి దాని వెనుకనే లోనికిపోయి గుఱ్ఱమొక సెలయేట నీరుత్రాగు చుండుటఁ గాంచెను. ఆసెలయేరెల్లంతదూరముననున్న పెద్దకొలను నుండివచ్చుచు నెటుపోవుచుండెనో తెలియదు.

ట్యూనారుఁడుగూడ నించుకనీరముల గ్రోలి, గుహను బరికించెను. అది తానిదివరకు ప్రవేశించినగుహలకంటె నతివిశాల మైనది. అందుగూడ నొకగూడును నిదివరకుగూడులోవలె సామ గ్రియు గల్గియుండెను. అందొకసీసాతో రుచికరమగు సారాయ మమరుపఁడియున్నది. దానినిబట్టి మనుష్యుఁడిక్కడనెడ నాహార పదార్థములను పానీయములనుంచుకొని గులిస్తానులోయకు బోవు నపుడు క్షుత్పిపాసాబాధితుఁడు కాకుండ బోవుచుండెడివాఁడని ట్యూ నారుఁడనుకొనెను. అంతియేగాక నచ్చటిసీసాలోని సారాయము వంటిదానినే తాను మనుష్యునింట త్రాగియుండుటవలన తానను కొనినది వాస్తవమని వానియూహ. అక్కడనే యొకతావున లావుగ యొందుగద్దెకూడ వానికిగోచరింప, నప్పటికే యలసియుండిన వాఁడగుటచే గుఱ్ఱపుకళ్ళెమును జీనునుతీసి యొకవారపదిలంబుగ బొందుపరచి తానాగద్దెపై మేనువాల్చి నిద్రావశుఁడాయెను.

సూర్యుఁడు తూర్పుదిక్కున లేచుసరికి లేచి ట్యూనారుఁడు కాలకృత్యముల నిర్వర్తించుకొని గూటిలోని తినుబడిపదార్థముల స్వీకరించి, కొంతసారాయమును గ్రోలి, హయమును కళ్లెముతోడను జీనుతోడను అలంకరించి దానితోనందుండి యీవలకరుదెంచి యధి

వసించెను. అంతనాహయమాతని నిదివరకు గుహవంకకే గాని పోవుచుండ ట్యూనాదుండ్గాకి గులిస్తానులోయకు బోవుమార్గము తెలియదని నిశ్చయించికొని తానురాత్రిపడిసిన గుహవద్దకే దానిని మరల్చి యాగుహనుండి పోయినయెడల తాను తప్పక గులిస్తాను లోయం జేరనగునేమోయని యందుప్రవేశించెను గాని తనకేవిధ మైనమార్గమును గానరాకుండుటచే నీవలకువచ్చి దారికొరకై వెదకివేసారెను. పిమ్మట నాతఁడట శోకకఠినోపలముపై నధివశించి చేతులలో తలనిడి మన్సూరునింట తాజదివినకాగితములసంగతులు జ్ఞప్తికిదెచ్చికొన "నలువలంతులను దుర్భేద్యములగు పర్వతరాజ ములమధ్య నాస్వర్గమున్నది!" యనువాక్యములాతనికి స్ఫురించి "నిజమే యాప్రదేశముజేరుట కఠినకష్టమయినను పురుష కార్యమున వెనుకంజవేయరాదు. ఆభూలోకస్వర్గమును జేరుటకు గుహలలోనుండియే బోవలసియుండును గాన నీగుహ శుభ్రముగ బరికించెదను! గుహల వెంబడిబోవుటకు మార్గము లేనిచో నిదివరకు వలె కొన్నిరాళ్ళుకుప్పలు తిరుగ వేసినమార్గ మగపడునేమో! లేకున్న నిచ్చటగోచరించు పెద్దజాతిపలక లాలోయజేరుమార్గమున కడ్డుగ తలుపువలె పరులకుగోచరింపకుండనుంచిరో! — కాముందు వలయాకారముగనుండిన యాపర్వతపంక్తికై వెదుకవలెను" అని కొని ట్యూనాదుఁడులేచి యాపరిసరప్రాంతమంతయు గుమ్మరు చుండెను, ఏవంకజూచినను మహోన్నతపర్వతరాజము లే—ఏచాయ గనుకొన్నను కఠినోపలపంక్తులే — ఎటుచూచినను బోరుమనిప్రవ హించు సెలయేళ్ళే — ఏజాడబోయినను విశాలవృక్షములేతప్ప యాతనికి కాలిబాటగాని మరేమియు గానరాలేదు. అక్కడక్కడ నుండి కొండప్రదేశమునుండిచూచిన నన్నియు వలయాకారముగ నున్నట్లుపర్వతములు చూపట్టుచుండెను. తరువాతనాతఁడు కనబడిన

రాళ్ళకుప్పలన్నియు దిగువేసి యెటనయిన నాలోయకుం బోవు మార్గమున్నదాయని పరిశోధించెను. ఇది యడియనదేల యా పర్వతప్రాంతమంతయు బరీక్షించి విసికితాను బయలుదేరినగుహా సమీపించి ఖిన్నుఁడై యొకచోఁ గూలఁబడెను. ఇప్పటిరోజంతయు నాతఁడా గులిస్తానులోయఁ జేరు రహస్యమార్గమునకై యత్నించెను గాని లాభములేకపోవుటచే యించుకయోచించి ధైర్యచేతస్కుఁడై "వారము కానిమ్ము — నెల కానిమ్ము — యేడు కానిమ్ము యెన్నాళ్ళకయిన కష్టపడి యాభూలోకస్వర్గమును చేరుటకై ప్రయత్నింతును" అని లోనికేగి గడ్డిపైఁ బండుకొని "క్లోడిస్సా యాలోయను చేరు విధము వ్రాయబడియున్న కాగితములదీసికొన్నది. అవి చదువుకొని యామె యిటువచ్చెనా నాకు మరింత పరాభవము జరుగును!—గాని యామె యొక్కర్తెయు నిటువచ్చునా? ఎవరినయిన సాయము తీసికొని వచ్చునను కొందును! — అట్లైవని సహాయమున నయిన వచ్చి యీ లోయనే ప్రవేశించెనా నాకు మరణము తథ్యము! — నేను గులిస్తానులోయఁ జేరగా నిటురా లేదన్నను ఆమె నమ్మునట్టిది కాదు. ఇప్పుడిచ్చట వారికితిరా నాప్రాణములు దీయును. అని భయమంది యీవలకరుదెంచి ఎవరయిన వచ్చుచున్నారేమోయని చూచెను. చంద్రుఁడాకాశగోళమున సంపూర్ణకళలతో ప్రకాశించుచుండెను. ఇక నాగుహ విడచి వేరొకతావునకు పోనిచో క్లోడిస్సా కత్తికెరకాక తప్పదని హాయారూఢుఁడై యొకయామడదూర మేగి, యటనొక పచ్చిక మైదానముపై విడిసెను.

## ముప్పదియేడవ ప్రకరణము

## గులిస్తానులోఁ జేరుట

ట్ర్యూనారుఁ డాగుహా విడచిపోయిన మూడవదినమున లైలా, జానియులు, క్లోడిన్సా లశ్వారూఢులై వచ్చి యాగుహఁ జేరిరి. అచ్చట ముప్వురును గుఱ్ఱములనుండి దిగిరి. జానియు లొకవత్తి నిదటీసి దీపమును వెలిగించి లైలాక్లోడిన్సాలతో నాగుహాలోనికి గొంతవర కేగి యట నొక గూడు తడవి "ఆహా! యిందుగూడ నొకప్రమిదయు మొదలగునవి గలవనెను.

క్లో—(చూచి) నూనె లేదు. — పోనిమ్ము మన మన్సూరుని కాగితములో వ్రాసినవానిలో కొన్ని వస్తువులున్నవి.

లై—మొదటి గుహయందు ప్రమిద లేదు. ఇందున్నదిగాని నూనె లేదు, కారణమేమో?

జా—మన్సూరుఁ దెచ్చుట మఱచియున్నవో వ్రాసెనే. ఇందుకొన్ని లేకుంటకు గారణమేమైయుండునో.

లై—ఏమోగాని అతడు వ్రాసినవాటి ననుసరించిపోయినచో మన మాగులిస్తానులోఁ జేరుట సులభము.

క్లో—నిజము.

జా—పడతులారా! మనమీదినము చాలదూరము వచ్చితిమి. రేపొకయరగంట నడిచినచో నాభూలోకస్వర్గము చేరగలము!

అని మాటలాడుకొనుచు వారాగుహ చివరభాగమున గల సెలయేటిని సమీపించిరి. అట నశ్వములు దప్పిగొని నీరము ద్రాగుచుండ జానియులు వాటి జీనులను కళ్లెములను దీసి స్వేచ్ఛగ వదలెను. పిదప తమతో దెచ్చిన యులవలలో గొన్నిటిని వాటిముందిడి తాము

తెచ్చుకొనిన యుపాహారపదార్థములఁ దిని సుఖస్వప్నముల వే కృపుగ బండుకొనిరి.

మరునా డుదయమునసే లేచి యా మువ్వురును కాలకృత్యముల నిర్వర్తించుకొని యచ్చట ప్రకృతిని దిలకించి యానందించుచుండ డానియలు వాయువ్య దిశకు జూచి "అల్లదె యా పర్వత మధ్యభాగమున నా భూలోక స్వర్గము గల"దని! వారితో ననియెను.

లై...ఆహా! మన మెంత వేగ మా గులిస్తాను లోయఁ జేర గలమా యని యున్నది.

క్లో—అవును.

డా—త్వరలో చూడఁగలము. అది మన కానంద మొన గూర్చును. మనము తొందర పడుటకంటె మన్సూరుని చే వ్రాయఁ బడిన దారి ప్రకారము పోయిన చో మనమతి సులభముగ నట చేర గలము.

లై—డానియలో! గులిస్తానులోయ వజ్రపు గనులతోను-పుష్పారామములు-మొదలగు చిత్రవిచిత్రములతోడను గూడియుండు నట. అంతియేగాక యది పవిత్రస్థలము కూడ నయియున్నదట. అచ్చట మన పితామహుడు సమాధినొందినట్లు కూడ విన్నాను.

డా—లైలా! ఇటకు వచ్చినపుడే నా కా సంగతులన్నియు జ్ఞప్తికి వచ్చినవి. అపుడు నేను మన్సూరు నట్టి మహాత్తరమును పవిత్రమును నగు లోయకు బోవుటకు దారిచూపినందుల కెంతయు గృతజ్ఞుడ నగుచున్నాను. అంతియె కాక మన్సూరుఁడు వ్రాసియుంచిన కాగితముల సహాయము లేనియెడల "నల్లదె వలయాకారమగు కొండల మధ్యమునగు లిస్తానులోయ యున్నదని!" తెలిసికొనగలమా!

లై—మనమాలోయ రహస్యము మనుష్యులని కాగితముల జూచి తెలిసికొంటిమి గాని—సాధారణముగ నెంత తెలివయిన బాటసారి యయినను నాలోయ యీ స్థలమున గలదని తెలియఁజాలఁడు!

డా—నిజము. లైలా! ఎంత సాహసికుఁడయిన నా లోయ గస్తాన బయలు దేరి ఫలాన చోటనున్నదని యెఱింగినప్పటికిని దాని నీ పర్వతముల మధ్యమున్నదని మనమనుకొనుచున్న యీ లోయను గూర్చి చెప్పిన లోకులు పరిహాస మాడుదురు.

నేఁడు మనవారు చేయుచున్న ఘనకార్యములు పూర్వ కాలీకులచే చేయఁబడిన వాటితో సరిపోల్చినచో సూర్యునిముందు దివిటీలు—సోలమన్ దేవాలయము, బాబిలన్—నూరు ద్వారములుగల థేబిస్ జ్ఞప్తికి దెచ్చికొనుము. అవి పూర్వుల నేర్పరితనము నిప్పటికిని వేనోళ్ళ జాటుచున్నవి. వానిని శాశ్వతముగ నుండునట్లు నిర్మించిన మహాపురుషులు మనకనాగరికులైరి గదా! కాన మనము నాగరికతా అనాగరికతల నెంచుటకు తగము. కాబట్టి వారు కనిపెట్టిన మార్గమును బట్టియే మనమిప్పు డాగులిస్తాలోయ జేరవలసియున్నది.

లై—అవును.

పిదప నా మువ్వురును కొంచ మాహారమును భుజించిరి. అప్పుడు జానియులు, క్లోడిస్సాల నిడుకొని గులిస్తాను లోయకు బయలు దేరెను. లైలా యొక డీదారి వెంట వచ్చినట్లు తోచుచున్న" దనెను.

క్లో—చెలీ! నీ వెట్లు గుర్తించితివి?

డా—ఇదిగో యీ ప్రదేశమునగల పచ్చిక పీకబడియున్నది. మానవుడే కానిచో నిట్లీ స్థలముండ రాదు. (అని మరికొంత ముందు కరిగి) ఇక్కడ నొక రాళ్ళకుప్ప యున్నది! దీనినిగూర్చి మనుష్యు డేమయిన వ్రాసెనా?" అని గులాబీ పుష్పముల లోయకు మార్గము

వ్రాయఁబడియున్న కాగితమునువిప్పి చూచి "లేదు! దీనిని జెప్పక్కన లేదు. ఇందేమి వ్రాయఁబడెననగా" గుహనుండి బయలుదేరిన వెనుక వాయువ్యదిక్కుననున్న మహాపర్వత శిఖరమొక్కటి పగిలినట్లు రెండు శిఖరములు గానవచ్చును. ఆ పర్వతముపై మంచు గడ్డకట్టి యుండును. దాని వంకకే పొమ్ము. అచ్చట దారులుగాని మరేమియును ఉండవు. అటుపోయినచో నెదురుగ నిటారునిలచి యేటవాలుగనున్న మెట్టను సమీపింతువు.

శై—ప్రయాణీకులెవరో యిటు వచ్చియుందురుగాని వారు మనవలె నా గులిస్తానులోయకు బయలుదేరినట్లు పొడగట్టదు.

క్లోడిస్సా మాటలాడలేదు. ట్యూనారుఁడు యిటు వచ్చెనా యని యామె అనుకొనుచుండెను. మన్సూరుఁ డాలోయకు బోవు మార్గమును వ్రాసిన కాగితములు, తనచేఁ జిక్కకపూర్వమే వాఁడు చదివిన వాఁడగుటచే గులిస్తాను లోయకుపోయి మరలివచ్చునపుడు దారి తప్పకుండుటకీరాళ్ళగుప్పలు హద్దులుగ నుంచుకొని యుండు నని యామె యూహ. "ఇపుడాతఁడు గులిస్తానులోయలో విహరించుచుండునేమో? అటవాఁడు నాకంట బడెనా, నా కఠారి వాని వేఁడి రక్తము ద్రాగును. మరి నాకు వానిపై కనికరముదయించదు" అని మనమునందు క్లోడిస్సా యనుకొన సాగెను.

డా—రండు. ఆలస్యము జేయకుఁడు.

అని శైలాక్లోడిస్సాలతో కాలిబాటను పోవంబోవ నా మిట్ట శిఖరమును చేరుకొనెను. అక్కడితో నాదారియు నంతమాయెను. ఎదుట నల్లిబిల్లిగ నల్లుకొనియున్న తుప్పలును లతలును తప్ప మరేమియు వారికి గనరాలేదు.

శైలా తాము గులిస్తానులోయఁ జేరఁబోవు చుండుట యెవ్వరైన గుర్తించుచుండెనేమో యనుకొనుచుండెను- అక్లే - వారిని

ట్యూనాడుఁడు కనిపెట్టుచున్నాడు. వాడొక పెద్దపాషాణము ననుక వారికంటఁబడకుండ డాఁగొని వారిని చూచుచున్నాడు. మూడు రోజులనుండి గులిస్తానులోయఁ జేరు నిజమగు మార్గమునకై వెదకి వేసారిన ట్యూనాడుఁడు వారుపోవుచున్న మార్గమును గుర్తింపడా? ఇప్పుడు గుర్తించిన వారా లోయను సందర్శించి మరలిపోయిన వెనుక తాను వెళ్ళగలడు.

శైలా, డానియలు, క్లోడిస్సా లంతట దారిగానరాక యాగిరి. ఎదుట తుప్పలు చెట్లు నొక లోతయిన గోయ్యియు వంగియుండెను. అందొక సెలయేరు పారుచుండెను. డానియ లేమియుఁ దోచక మన్సూరునిచే వ్రాయఁబడిన కాగితముల విప్పి చూడసాగెను. ఇక వారే దానినుండి పోగలరో యని ట్యూనాడుఁ డే కొంత స్థలమునుండి పరిశీలించుచుండెను. ఇంతలో నా మువ్వురును ఆ తుప్పలలోనుండి పారిపోవుచుండుట ట్యూనాడుని కంటబడెను.

వారు దృష్టిపథమునుండి తప్పినంతనే ట్యూనాడుడు డాఁగొనిన స్థలమునుండివచ్చి యా తుప్పలను సమీపించి, సందులనుండి చూడ డానియలు క్లోడిస్సా శైలాలాలోతయిన గొయ్యి అంచునుండి పోవు చున్నట్లును, వారికిటునటు తుప్పలున్నట్లును యెఱిఁగెను. అదిచూచి ట్యూనాడుఁడు తనలో “నేను సుమారొక సంవత్సరము వెదకినను ఆ లోయ జేరుమార్గమును గన్గొనలేక యుండను. ఇట్టి స్థలమును చేరిన వెనుక నెవ్వడయిన నింక దారియున్నదని యనుకొనజాలడు. ఇపుడు నేనా పోవుచున్నవారి జాడబోయిన మంచిది” అనుకొని వారివెంటనే బయలుదేరెను.

అట్లు కొంతదూరము పోయినవెనుక ట్యూనాడున కల్లంత దూరమున క్లోడిస్సా చీర గానవచ్చెను. అంత నాతఁడు కొంచమాగి మరల పయన మగుచు నా దారిలో లోతగు గోతిలోని సెలయేటిని

చేరుచున్నట్లయ్యెను, అట నా సెలయేటిని దాటుటకు వంతెనగ రెండు వృక్షములుకొట్టి పడవేయఁబడి యుండెను. దాని యవ్వలి గట్టున మహారణ్య మొకటిగలదు. ఆయరణ్య మధ్యభాగమునుండి క్లోడిస్సా, లైలా డానియలు వంతెనదాటి పోవుచుండిరి. అట్లు వారు పోవుచుండుట ట్యూనారుఁడు కొంతవరకే చూడగల్గెను. మఱియొక ఘడియకు వారు దృష్టిపథమునుండి మాటుపడిరి.

వారు వెనుకనే ట్యూనారుఁడుగూడ సెలయేరుదాటి "గులిస్తానులోయుం జేరుట కడుంగడు దుస్తరము. నే నిదివరకువలె నొక శతాబ్దము వెదకినను జాడగన్గొనలేకుందును!" అనుకొనుచు పోవుచుండ మరల క్లోడిస్సా చీరచెంగాతని కండ్లబడెను. మరిరెండడుగులు వేసి చూడ నా ముువ్వురు నొక కొండ గుహాలోనికి పోవుచుండిరి. ట్యూనారుఁడు మరల నటనొక పొదకు వారదాగి చూచుచుండెను.

---

# ముప్పదియెనిమిదవ ప్రకరణము

## గుహాంతర్భాగమున

ట్యూనారుఁ డాగుహానుండిపోయిన గులిస్తానులోయుఁ జేర వచ్చుననుకొనెను. దైవమే తనకు ఆలోయకీవిధమున దారిజూపుచున్నాడని యాతఁడమందానందభరితుఁడగుచుండెను గాని వారివెనుకనే పోయినచో క్లోడిస్సావలన నాపదసంభవించునని దిగులొందెను.

అందువలన ట్యూనారుఁడు పదినిమిషములాగి వారు మరలి వత్తురేమోయని నిరీక్షించెను గాని యట్టిజాడ గానవచ్చుటలేదు.

పిదప నొకపర్యాయముదాగిన తావునుండిటువచ్చి గుహలోనికి చూచెను. గుహాంతర్భాగమంతయు చీకటిమయమై యుండెను. అది చూచి ట్యూనారుఁడు తనలో "వారిపాటికా సౌందర్యవంతమగు లోయలో విహరించుచుందు"రనుకొని ధైర్యచేతస్కుఁడై యా గుహను సమీపించి లోనికిబోయెను. గాఢాంధకారము, నిశ్శబ్దము నాగుహాయందలమికొనియుండెను. "ఇప్పుడు నేనీగుహయందు ప్రవేశించితినా యీచీకటి నన్ను వారికంటఁబడకుండ గాపాడగలదు. ఏమాత్రము వారు మరలివచ్చుచున్నట్లుకూడయిన వారకొదిగి తప్పించుకొనగలను. — ఏలనాకిట్టి యాలోచనలు పుట్టుచున్నవి ? (అనికొంతవడి చింతించి) భయములేదు. వారికి నేజిక్కు"నని కృతనిశ్చయుఁడై, యాగుహలో చాలవరకేగెను.

రమారమి రెండువందలగజములదూరము పోయినవెనుకా తనికిరుప్రక్కలనున్న గుహామధ్యములు తాకినవి. దానినిబట్టిచూడ రానురానాగుహ సన్నమగుచున్నదని ట్యూనారుఁడనుకొనియెను. యిక చివరకు కొలదికాలములో చత్తుననుకొనియెను. అతడందు పోవుచుండెనేగాని చీకటిమయమగుటచే గ్రుడ్డివానివలె తడుముకొనవలసివచ్చెను. అట్లుతడుముకొనుచు బోవుచుండ వానిచేతికేదియో మంచుకంటె చల్లగతగిలెను. దాననాతఁడు గజగజవణకి గట్టిగనరచి వెనుకకు పారిపోప్రయత్నించెను. శరీరమునుండి చెమ్మటకాలువలు పారసాగెను. అతఁడుతాకినదొక విషసర్పము ! నిజమే !! — అందనుమాన మావంతయును లేదు. దానినాతడు చేతులారతడవెను. తడవినవెంటనే సహజమగు భయమాతనికరము వెనుకకులాగివైచెను. లేకున్న నదియెంతపలమున్నదో చూచునేమో !!

ఆవిషసర్పమును స్పృశించి కంపితాంగుడై ట్యూనారుఁడెట్లీవలకు పారివచ్చెనో వానికే తెలియును. ఈవలబడి, చెమ్మట చలమ

లూర గడగడలాడుచు నొకచోఁగూలఁబడెనేగాని యింక నాపన్నగ మాతని వెంటనే వచ్చుచున్నదేమో యనుకొనుచుండెను.

మరికొంత కాలమునకాభయమంతయుఁబోఁగా నాతఁడులేచి పరుగునఁబోయి యిదివరకు దాటివచ్చిన సెలయేటిపైనున్న మ్రాఁకులపై నిలచి "నేనేమి చేయుచుంటిని? ! —— ఎంతభీరువును. సిరిరామో కాళ్ళొడ్డువానివలె గులిస్తానులోయ రెండడుగులలోనుండ నచ్చటి చల్లనిపాముకు వెఱగంది పారివచ్చితినే!" యని తానిందించుకొని "లైలా, డానియులు, క్లోడిస్సా లాపామును మంత్రముచే గట్టియుంచియుందురు. లేకున్న నేస్పృశించిన కదలకుండుటకు గారణమేమి?" యని విచారించి మరల నాగుహ జేరసాహసములేక యాయేరుదాటి, తుప్పలుదాటి మొదటి మిట్టప్రదేశమును చేరెను.

ఇక ట్యూనారుఁడేమి చేయును? గులిస్తానులోయ జేరవలయునను నభిలాషవిడచునా? — లేదు ! విడువజాలడు !! అతఁడు తన వద్దనున్న ఆయుధముల (పిస్తోలు, కత్తి) సహాయమున నాభుజంగమునంతమొందించి లోయఁజేర నూహించెను గాని యెప్పుడట్లుచేయును? అటనుండి యాతఁడు రాళ్ళకుప్పలు వెట్టినస్థలమును చేరెను. అచ్చట లైలా, డానియులు, క్లోడిస్సాల, వాహనములు కట్టఁబడి యుంట చూచెను. అచ్చటనే వారు తెచ్చుకొనిన తినుబండారములమూటయు గుఱ్ఱములకొరకై తెచ్చిన యులవలసంచియును చూచెను. ట్యూనారుఁడవిముట్టుకొనక "నేననుకొనినట్లు వారిట నేయాగిరి! — ఇచ్చటనున్నవాటినిబట్టిచూడ వారాలోయదర్శించి మరలవత్తురని తోఁచెడిని! రేపోయెల్లుండో మసిఁడి వారిటనుండి పోవుదురు. వారుపోయిన వెనుక నేనాలోయ జేరుట కెవ్విధమయిన యాటంకములునుండవు గాని యాదుష్టపన్నగమడ్డువచ్చునేమో? — ఆఁ ! దానిని సంహ

రించుట యేమున్నది! — పిదప గులిస్తానులోయ జేరుదును !" అనుకొని యాచోటువాసి యొక యామడదూరమున తావిడసినస్థలమును జేరెను. చేరి యంతవరకు తన్ను మోసికొనివచ్చిన మన్నారుని ముసలిగుఱ్ఱమునుముద్దాడి దగ్గరనేయున్న గుహను బ్రవేశించి యాలోచనాసాగరమున మునిగెను. అంత నాకటిబాధ పెల్లగుటచే గొన్ని కాళ్ళను పోయ్యిగసమర్చి, యెండుపుల్లలకు నిప్పంటించి, గడచిన దినమున చంపినదుప్పిమాంసమును కాల్చుకొనితిని, మొదటబ్రవేశించిన లోయనుండిగొనివచ్చిన సారాయమునుద్రావి తృప్తినొందు నరికి రెండుఝాములాయెను. అలసినవాడై యచ్చటనిలయేటి యొడ్డునవిశ్రమింప నెవ్వరో యశ్వారూఢులై వచ్చుచుండినట్లు డెక్కలనాదము వినవచ్చెను. ఆనాదమువిని తటాలునలేచి చూడ నిద్దరశ్వారూఢులై తనవంకనే వచ్చుచుండిరి. వారినిగాంచి యాపంతధరితుండై ట్యూనారుఁడు గట్టిగ నవ్వెను. వారు కైరి కరయును, జెమ్మజెట్లు. క్రమముగ వారు ట్యూనారుని సమీపించి కరయుమొదు "ట్యూనార్ ! నీవీ కాకసియనుపర్వతప్రాంతములం దేల తిరుగుచుంటివి?" అనెను. జెమ్మజెట్టి "నీవు శిక్షాపాత్రుడవుగాక నేరములతప్పినట్లువింటిమిగాని యిట కేలవస్తి"వని ప్రశ్నించెను.

ట్యూ—నేను దేశద్రిమ్మరినని మీరెరుగరా ? నేనెట యుండినయేమి ?

కైరి—టెఫిలిసేలవిడచితివి?

అట్లువారుప్రశ్నించుటకు కారణమేమయియుండునని ట్యూనారుఁడనుకొనుచుండెను. వీరలతో స్నేహముగలిగి కాకసియను పర్వతములనివసించుటా? లేక వీరిసహాయ మపేక్షించి గులిస్తాను లోయను చేరుటమంచిదా? యని యాతడనుకొనసాగెను. గులిస్తాను లోయనుచేర వారిసహాయమపేక్షించుట తనకు హానికరముగ

భావించి యాతఁడు "ఆఁ! నేను. నేరముతప్పించుకొనుట నీకు తెలిసెను? — నేను టిఫిలిస్‌నందుండరాదని ప్రభుత్వము శాసించెను" అనెను.

కరము—అలాగా! అట్లయిన మాయగాఁడివై రష్యను దేవాలయమునకు చెందినను వారియాజ్ఞాబద్ధుఁడవై శివా!

ట్యూ—అట్లయిన నీవు మహాబలవంతుఁడవయ్యు రష్యనులలో తిరుగక యీపర్వతారణ్యముల దిరుగాడనేల!

క—ట్యూనార్! ఆగుము. మనము సావకాశముగ మాటలాడుకొందము. జెమ్మజెట్టీ! నీవు విలుకాడవని ప్రఖ్యాతినొంది యుంటివిగాన త్వరగబోయి యాహారమునకై దేనినయిన జంపి కొనిరమ్ము.

ట్యూ—కరమన్, దీనికై ప్రయాసయేల. ఇచ్చటకుసమీపమున నొకగుహయందు మాంసమును వంటచెరకు నేసమకూర్చి యుంచితిని. పద మీకొరకయ్యది కాల్చిపెట్టెదను.

క—అట్లుకాదు. ఇటనుండి జెమ్మజెట్టి కాతావ్రజావుము. అతఁడిటకే తేగలడు (అని యేదియో సౌంజ్ఞ చేసెను.)

అతనియుద్దేశములనెఱిఁగి ట్యూనారుఁడు జెమ్మజెట్టికాగుహ జేరుటకు దారిజూపి పంపివేసెను.

## ముప్పదితొమ్మిదవ ప్రకరణము

## సంభాషణమున కాటంకము కలిగెను

జెమ్స్‌జెట్టి యాహారమునుగొని రానేగెను. ట్యూనాదుకర మనులిద్దరు రహస్యముగ సంభాషించుటకు తరుణములభించెను. ట్యూనాదుండు, కరమనుడు తన్నేమడుగునోయని యాలోచించుచుండ కరమనుండు పచ్చికబయలున విశ్రమించి "ట్యూనార్! నీవారహస్యము నెఱింగితివా?" యని యాతనిముఖము నేజూచుచు "నీ నేర మెట్లుతిప్పెనో చెప్పు" మనెను.

ట్యూ—అంతయు నద్భుతముగజరిగెను. నీవు క్లోడిస్సా యను పేరువింటివా? ఆమె శైలామహారాజ్ఞితో కనిష్టాంటునోపిలు వచ్చెను.

కరమను—ఔను. టిఫ్లిసునందామె పేరు వ్యాపించినది. తరువాత—

ట్యూ—ఆనల్లనియువతి నే చెరయందుండ నేవిధముగనో సమీపించి నారహస్యములన్నిటిని తానెఱుగుదునని చెప్పెను. శైలామహారాజ్ఞి నెత్తుకొనిపోయినసందర్భమున నీపేరు జమ్స్‌జెట్టి పేరును చెప్పినది. అంతియేగాక మన్సూరుని జంపినవాడు జెమ్స్‌జెట్టిఅనెను.

కరమను—అలాగునా?

ట్యూ—ముస్తఫాయాకూబునకు శైలానమ్ముటకు కారణమేమని నన్నామెయడిగినది.

కరమను—కారణము చెప్పితివా యేమి?

ట్యూ—నారహస్యములన్నియు నెఱిగితినని చెప్పిన క్లోడిస్సాకియ్యదిచెప్పినంత మనకపాయము జరుగదనుకొంటిని.

కర—నీప్రాణముల రక్షింతునని యామె చెప్పినందులకా రహస్యమును బయల్పరచితిని. అట్లే యామె నిన్నురక్షించెను.

ట్యూ—అవును. నేక్లోడిస్సాకు చెప్పిన దేమన — నీవుకరిద్రుడ వెట్లయితివో — ఖాజీనిన్నెట్లుమోసగించెనో — నీవు ముస్తఫా యాకూబు ధనమునాశించుటకు కారణమేమో — చెప్పితిని.

కర—అదివిని యామెయేమన్నది ?

ట్యూ—"అదంతయు నేనిదివరకేవింటి" అని యామె యద్భుతమంది యికమీాద లైలామహారాజ్ఞి కాపదగల్గించననివ నిన్నురక్షింతుననెను.

కర—తరువాత?

ట్యూ—మరెన్నడును నేను నీతో కలియనని ప్రమాణము చేయుమనె.

కర—ఈసంగతి నిజమా? నావద్దనుండిపోవుటకై పన్నిన పన్నాగమా?

ట్యూ—నిజము — అపుడామె యేలప్రమాణముచేయు మనెనో ఆమాటలింకను నాకర్ణములం దేగలవు.

కర—చెప్పుము.

ట్యూ—క్లోడిస్సా! నీవు కైరికరమనునితో నేవిధమయిన సంబంధమును గల్గియుండరాదు. అంతియేగాక వానికి హానినయిన దలుపరాదు. నీకిక ముందువానికి దుర్మార్గములందు సహాయము జేయనని, వానిని న్యాయస్థానమున కీడ్పించనని యు ప్రమాణము జేయుమనెను.

కర—ఇదివరకే క్లోడిస్సానెపుడైన గాంచితివా? ఆమెఎవరో తెలుసా?

ట్యూ—ఆమెఎవరోనాకు తెలియదు. క్లోడిస్సాయని తెలుసు.

కర—మీారిద్దరింకేమేమి మాటలాడిరి?

ట్యూ— చెప్పమరచితి. రష్యను న్యాయవాదియెదుట జెమ్మ జెట్టియే మన్సూరుని జంపినవాడనియు, వానితో వచ్చినవాఁడు కర మనుఁడని చెప్పక గ్రిగరస్ అనమనెను. నేనట్లే చెప్పితిని.

క— అలాగే నేనూవింటిని. ఇపుడుమన్సూరునిజంపిన జెమ్మ జెట్టి గ్రిగరసులబట్టువారికి బహుమానమిత్తుమని టిఫ్లిసునందు జాట బంచిరి. గాని ట్యూనార్! ఆక్లోడిస్సాయిపుడెక్కడనున్నది?

ట్యూ— అట్లడుగుటకు కారణమేమి? (అని తనలో తనిప్రశ్నించి యామె యున్నచోటుచెప్పిన నటకేగిచంపునో లేకతనరహస్య మంతయు వెలిబుచ్చునో యనుకొనెను.)

కర— ట్యూనార్! మరేమనుకొనకుము. నీవుప్రాణముల రక్షించిన క్లోడిస్సా చెప్పినట్లు ప్రమాణముచేసితివి. అట్లేయామెకుతల వెంట్రుకవాసియయిన హానిగోరనని నేప్రమాణముజేసెదను! ఆమె యెటనున్నదో చెప్పుము.

ట్యూ— నిజముచెప్పుచున్నాను వినుము. ఆమెటిఫ్లిసునందే యుండవచ్చును.

కర— ఉండవచ్చుననెద వేల? స్థిరముగ చెప్పక.

ట్యూ— నీవామెకుహపగవాఁడవగుదు వేమోనని——

కర— ఓరీ! నాకేమియునాపద వాటిల్లకుండ న్యాయస్థానమున వర్తించినయామెకు నేబగవాడనా?

ట్యూ— కైరికరమనునిసంగతి నేవిశదముగ నెఱింగినవాడను.

క— కాని ఇట్టియుపకారస్థురాలగుక్లోడిస్సాయెడ నాకు విరోధ మేల? ట్యూనార్! ఇఁకమీఁదటనాతో నీకేవిధమయిన సంపర్కమును లేదని నీవాక్లోడిస్సాయెదుట ప్రమాణముజేసితివి లేకున్న నిన్నునా యనుచరులతో జేర్చుకొనియుందును.

ట్యూ— మరల యనుచరుల జేకూర్చితివా?

క— ట్యూనార్! అల్లదెయాగుట్టలవెనుక నాయనుచరులయిన వారు పండ్రెండుగురుగలరు.

ట్యూ— నాయకుఁడా! నీవాక్కులు నాకానంద దాయకము లయ్యెను. అయినను నేనునీయనుచరుఁడనగుటకు వీలుపడనందుల కెంతయు విలపించుచున్నాడను. అట్లునీకిసుమంతయు హానిదలపను.

క—

ట్యూ— కరమనుఁడా! సమూహమును వెనుకనుంచి జెమ్మ జెట్టినొక్కనినే వెంటనిడికొని యిటేలతిరుగుచుంటివి?

క— దుర్మార్గుండగు ఖాజీని శిక్షింపవలసియున్నది.

ట్యూ— అట్లనా,

క— వినుము. నామాటలాలించినంతమాత్రమున నీప్రమాణ భంగముకానేరదు. నాసమూహమని చెప్పిన పండ్రెండుగురును ఖాజీని వదలివచ్చినవారు. వారునన్నువదలి మోసగాడయిన ఖాజీతో వెళ్ళి నందులకు పశ్చాత్తప్తులై వచ్చినన్నుశరణు వేడక్షమించితిని. ఇపుడు వారునాపాలిణమయినారు. మరియు ఖాజీసమూహములో మిగిలిన వారు రష్యనులచేహతులైరి. పిదప ఖాజీమరియొకనితో గూడి యీ యరణ్యములందు బ్రతుకపారివచ్చెను. గనుక నేవానిని బంధించి శిక్షింపవచ్చితిని. తెలిసినదా—నీవుటిప్లిసు వదలవలసివచ్చిన నెందు యినటోక యీకాకసియను పర్వతారణ్యముల కాభూలోక స్వర్గ ను జేరవచ్చితివాయేమి?

ట్యూనారుఁడు కరమనుఁడు తనఅభిప్రాయమును బయటికి దీయబ్రయత్నించుచుండుట నెరిగి తానట్టియభిలాషలో లేనట్లునటించు చుండ కొందరశ్వారూఢులచ్చటకు వచ్చునట్లయి ట్యూనారుఁడు లేచినిలచెను. ఇంతలోసమీపమున మాంసముగాల్చుచున్న జెమ్మ జెట్టికూడవచ్చుచుండ నావచ్చుచున్నవారిలో నొకఁడువానినడ్డగిం చెను. అంతజెమ్మజెట్టివానిని పిస్తోలుతో కాల్చిచంపెను.

కరమనుఁడాశ్చర్యపడి లేచిచూచెను. "ఠంగు" మని కొన్ని గుళ్ళు ఆయోధులతుపాకులనుండివచ్చెను. ట్యూనారుఁడొక చెట్టువార దాగెను. జెమ్మజెట్టిపరుగున కరమనుసమీపించి "శత్రులువచ్చుచున్నా"రని కరమనుని హెచ్చరించెను. తక్షణమే యిరువురును హయారూఢులై శత్రులచేజిక్కకుండ ఆయరణ్యములలో పారిపోయిరి. వారినిచంపవెంబడించుచున్న యోధులువచ్చి, ట్యూనారుని పట్టుకొని బంధించిరి.

---

## న లు బ ది య వ ప్ర క ర ణ ము

## ఆ యు ధ పా ణు లు

ట్యూ—అయ్యలారా! నాకును కరమనునకును నెవ్విధమయిన సంబంధమును లేదు. నన్ను క్షమించి వదలివేయుడు.

"ఓహో! నీవు వానితో కలసియుండుట మాకన్నులతో మేముచూడలేదె" యని యాతనినిపట్టుకొనిన యశ్వారూఢులలో నొకఁడనెను.

ట్యూ—అయ్యా! వానిని నేగలిసి యొకగంటయయిన గాలేదు ——.

"అట్లయిన నీవీయరణ్యములనేలయుంటివి?" యని వారిలో పెద్దవాడడిగెను.

ట్యూనారుఁడు నిజముదాకొననెంచెను; తానుగులిస్తానులోయ కొరకై వెదకుచున్నట్లు చెప్పవలెను. అదిచెప్పనిష్టములేక యూరకొనెను.

అంత నాతని బంధించినవారితో నాయకుఁడు "ఓరీ! మాటలాడవేమి? ఎందులకీయరణ్యముల నుంటివన నుత్తరమీయవేమి? అందువలన నీవాదొంగలస్నేహితుఁడవని తోచెడిని." అనెను.

ట్యూ— అయ్యా! చెప్పుచున్నాను వినుము. నేనీయడవులందిరుగాడుటకొక కారణమున్నది. నేను పట్టణములందు నివసించి విసిగి యడవుల చేరితినిగాని వాడు దొంగయని నాకింతవరకు తెలియదు.

నాయకుఁడు— ఔరా! ఒకటికి రెండబద్ధము లాడుచున్నావు. మమ్ములను చూచి పారిపోనుంకించి చెట్టుచాటునకక్కి దొంకితివి గావా. నిక్కముగ నీవాదొంగలలోనివాఁడవే.

ట్యూ—అయ్యా! నేదొంగనుగాను. అల్లక్కడ నొకగుహయందు నాసామానును, గుఱ్ఱమునునున్నవి చూడుము. నేనమాయకుఁడను.

నా—ఓరీ! వీడిమాటలు నాకసత్యములవలె దోచుచున్నవి. రండు వీనిని మనయుచచూని సమక్షమునకుంతము.

అని యాతఁడు తక్కినవారి కాజ్ఞాపింప ట్యూనారుఁడిక వానితో మొరబెట్టుకొనిన లాభము లేదనియు, వారియజమాని నే ప్రతిమాలుకొనిన విముక్తి కలుగుననియు ననుకొనెను.

పిదప నాయశ్వారూఢులలోనొకడు దరింగల గుహను సమీపించి, యచ్చటిగుఱ్ఱమును సామానులను గొనివచ్చి ట్యూనారుని హయారూఢుని గమ్మనెను. ట్యూనారుఁడట్లుచేయ వారతని మధ్య నడపించుచు గులిస్తానులోయగల వలయాకారమగు పర్వతము వంక బోవుచుండిరి. ఒకయరగంటపిమ్మట వారొక సుందరతరమగు స్థలమునకుచేరిరి. అట బచ్చికమైదానముపై బలముగుహయములు మేయుచుండెను. అచ్చట కొందరు మనుష్యులీసరివారము వచ్చినంతనే యామేయుచున్న గుఱ్ఱములనెక్కి బయలుదేరిరి.

వారందరును ట్యూనారుని మధ్యనడిపించుచు గులిస్తాను లోయగల కొండలకుత్తరభాగమున పోసాగిరి. అదిచూచి ట్యూనారుఁడు తనలో "యిప్పటికయిన నేనాగులిస్తానులోయకు బోగలను. ఇపుడు వీరు తమయజమానివద్దకు నన్నుగొనిపోదురుగదా. అతని పాదములుబట్టిన నన్నుక్షమించి విడువకపోడు. అపుడు నేమరలి వచ్చినవు డాలోయఁ జేరుదును. దానిని సమీపింప ననేకకష్టముల బడవలసియున్నది. పడిననేమీ యెనటచేరిన యానందమెట్లువచ్చును! ఈదారి నాగుఱ్ఱమునకుక్రొత్త. ఆఁ ఇఁకెంతదూరము వీరునన్నుగొని పోదురు. అటకుపోయి మరలివచ్చునపుడు నేచాలశ్రమపడవలెను. కానిమ్ము" అనుకొనుచుండెను.

క్రమముగ వారొకకోటను సమీపించుచుండ నెదురుగ మరి కొందరశ్వారూఢులాయుధపాణులై వచ్చుట ట్యూనారుఁడుచూచెను. వారు వీరికింక నూరుగజములదూరముండుండగనే ట్యూనారుని బంధించిన వారినాయకుఁడావచ్చువారిలో మొదటివానికి టోపీతీసి సలాముచేసెను. అతనితో బాటందరును సలాముచేసిరి. ట్యూనారుఁడుకూడనట్లేచేసెను. ఆవచ్చుచున్నయోధుల యజమానిప్రాయము రమారమి యేబదియయిదువత్సరములుండును. ఆజానుబాహుఁడు. బలిష్ఠుడు. మరికొన్నినిమిషములలో వారును వీరును కలిసికొనిరి. అపుడు ట్యూనారునిబంధించినవారిలో పెద్ద ట్యూనారునితో "ముందుకుపొమ్ము. ఆతఁడు మాసుల్తాన్ స్కామిల్. నీమొరజెప్పికొను"మని ట్యూనారుని స్కామిలునకించుకదూరమున నిలిపి యిటు నటు నిరువురు కత్తులపట్టికొని నిలచునట్లుచేసెను. సుల్తాన్ స్కామిల్ ట్యూనారుని బంధించిన యోధులనాయకునిజూచి "హామెట్! ఈబంధితుఁడెవఁడు? వీఁడు అందమగు యువకుఁడు. వీఁడు మావద్ద

నుద్యోగమునకై వచ్చెనా లేక బంధితుఁడై దొంగలగుంపులో చేరినవాఁడగునా? ” యని ప్రశ్నించెను.

హా—ప్రభువరా ! ఈయువకుఁ డొకతైదీ. కారణాంతరములచే బందిపోటుదొంగగ బంధింపఁబడెను. ఈతఁడు తనవృత్తాంతము చెప్పుకొనునట. అందలి నిజానిజములు దేవరవారే తెలిసికొన వలెను.

సుల్తాన్—బందిపోటుదొంగ !—ఇంత చిన్నతనమునందే !— ఈతఁడావృత్తి జేకొనుటను హేతు వేమయియుండునో !— హామెట్, ఈతఁడే కారణమున బందిపోటుదొంగగగుర్తింపఁబడి పట్టువడెనో, మాకది చెప్పుము.

హా—ప్రభూ ! ఈసమీపప్రాంతముల రష్యనుసమూహము తిరుగుచున్నదని మీరువినియుంటిరిగదా. అదినిజమేయయినవారితో తలపడి శిక్షించుటకై పదిదినములనుండి సేనాప్రాంతములందు తిరిగి తిరిగాని వారిజాడ లేదు.

సుల్తాన్—పిమ్మట ?

హా—నిన్నమధ్యాహ్నమున గరన్ రాగ్ దుర్గమునకు తిరిగి వచ్చుచు దారిమధ్యమున నొకచోనాగితిమి. (అన టుబ్యానాఁడు డాకనవచ్చు దుర్గము గరన్ రాగని తెలిసికొనెను) ఆగి అలసియున్న గుఱ్ఱములనొకచో కట్టి కాలినడకను రష్యనులకై చాలదూరము వెదకితిమి.

సుల్తాన్—నీవెల్లప్పుడును మాయాజ్ఞల నెరవేర్చువాఁడవు.

హా—ప్రభూ ! అట్లువెదకి వెదకి రష్యనులు లేరని నిశ్చయించు కొని మరలివచ్చుచుండ నొకఁడు మాకెదురయ్యెను. అతఁడు జార్జి యను దేశీయునివలెనుండెను. పొడగరి. మిక్కిలిబలవంతుఁడు. జీర్ణ వస్త్రములధరించియుండెను. వానిమోము విచారగ్రస్తమైయుండుట

బట్టి యేదుష్టునివలననో హింసింపఁబడినవాఁడనుకొనుచుండ నాతఁడే "మీరెవ"రని మమ్ముప్రశ్నించెను. ఆతఁడు రష్యనుగూఢచారుఁడేమో యనుకొంటిమిగాని యట్లుగాక తానే వారిచేహింసింపఁబడినవాఁడై నిరాధారుఁడై యడవుల గుమ్మరుచుండినట్లు తెలిసికొంటిమి.

ట్యూనారుఁడాతఁడు ఖాజీయనుకొనెను.

హా—వానివృత్తాంతమెరిగి కనికరమూని కొంచమాహారమిచ్చి మేమువచ్చినపని నెఱింగింప నాతఁడు రష్యనుసైనికులు సమీపమున లేరనెను. కాని ప్రభువతంసా! మనకు ప్రక్కలో బల్లెమువలె మరియొకశత్రుడు దగ్గరనున్నట్లెఱిఁగితిమి.

సుల్తాన్—రష్యనులుగాక——?

హా—చిత్తము. దేవరా! వానిని బంధించినచో గొప్ప ధనమును బహుమానముగ నిత్తుమని రష్యనులేగాక బ్రాజ్ఞియను ప్రభుత్వము కూడా చూచెను. వానినే బంధించనుని తమప్రభుత్వము కూడ నొకపరి యాజ్ఞాపించిరి.

సు—అల్లా!!—నీవు చెప్పువాఁడు కైరికరమనుఁడా యేమి?

హా—చిత్తము.—మాకుకనబడినవాఁడు సమీపమునందు గోరిల్లాదొంగ కైరికరమనుఁడున్నట్లు చెప్పెను. మేమాతని నటకు రమ్మంటిమిగాని యాతఁడియ్యకొనలేదు.

"నిజముగ వాఁడు ఖాజీ" యని ట్యూనారుఁడెంచెను.

హా—ప్రభుసత్తమా!—పిమ్మట మేము కరమనుని పట్టుకొన బోయితిమి. వాఁడొక సెలయేటి పొంతనుంట గాంచితిమిగాని పట్టుకొన జాలకందుకు విచారించుచున్నాము.

సుల్తాన్—దొరకలేదా. మీరు చాలమందిగలరే!

హా—కరమనునకు పూర్ణాయుర్దాయము గలదు. వాఁడు లేవకుండుటకై యెన్నియో తుపాకుల గాల్చితిమిగాని గురితప్పి వృథాయయి మరియొకనితోఁ గూడి పారిపోయినాడు. వాడు పోఁగా దొరకిన వాఁడీతఁడు (అని ట్యూనాదునిచూపెను).

సుల్తాన్—హామెట్! ఇంతకును దైవము ప్రతికూలమైయుండ మనమేమి చేయఁగలము? అదృష్టుఁడే బంధితుఁడాయెనా గరన్‌రాగ్ కోట బురుజుపై నురిదీయించి యుంచును. పోనిమ్ము! రష్యనులు మనభూములలోనికి వచ్చిరని విన్నమాట యబద్ధమగును? అట్లయిన నేనును బయలుదేరుట మానెదను.

హా—చిత్తము.

సు—(ట్యూనాదునితో) ఓరీ! నీవింత చిన్న వయసునందే యా దుర్మార్గుఁడగు కరమనునితో నేల గూడితివి?

ట్యూ—రాజశేఖరా! నే చెప్పున దాలింప వేడుకొనెదను. నేనెంతమాత్రమును వాని యనుచరుఁడనుగాను. నాప్రయాణమునందు, నిన్ననాతఁడొచ్చి కలసినాఁడు. వాఁడును నావలె బాటసారియే యనుకొని సంచరించితిని. పిమ్మట తమ యోధులచేజిక్కినవాఁడు కైరికరమనుఁడని తెలసికొంటిని.

సు—హామిట్ ! ఈవృత్తాంత మెంతవరకునిజము.

హా—నాకీతఁడు చెప్పుదానియందు నమ్మకములేక తమసముఖమున కీడ్చుకొనివచ్చితిని.

సు—అయిన వీఁడు కరమనుని దుష్టకోటిలోనివాఁడే.

ట్యూ—ప్రభువరా ! నాకును కరమనునకును సంబంధము లేదని ప్రమాణముచేసి చెప్పుచున్నాను—.

సు—మాటలాడక నోరుమూసికొనుము !— నిక్కముగ నీవు శిక్షాపాత్రుడవు. అయినను జిన్నవాడవని క్షమించుచుంటిని ! కాని

బ్రతికియున్నంతకాలమును కారాగారవాసము ననుభవింపుము (హామిట్‌తో) హామిట్ ! వీనిని గొంపోయి డోర్వాలు (Dorwal) నుంచబడిన చెరయందుంచుము.

అని యాజ్ఞాపించి సుల్తాన్ స్కెమిల్ గుఱ్ఱమునుత్రిప్పి, కొన్ని గుడారములు వేయఁబడియున్న గుట్టలవంకపోయెను. ట్యూనారుఁడు తనదుర్విధికి కంటనీరునిడుకొని దుఃఖించుచుండ హామిట్ "ఓరీ !యిఁక లాభములేదు ! పద" అనెను.

ట్యూనారుఁడు నిరాశనొంది గుఱ్ఱముపై చైతన్యమునుదక్కి కూర్చొనెను. కళ్లెము వానిచేతినుండిజారెను. పిమ్మట నొకచో నాసైన్యమంతయునాగి ట్యూనారుని దిగుమనిరి. ట్యూనారుఁడు చెప్పిరిలి పిచ్చివానివాలె నిటునటుచూచి సైంధవమునుండిదిగెను.

వారు ట్యూనారునితీసికొనిపోయి యొకరాతిమెట్లవరుసవద్ద నాగిరి. ఆ మెట్లకిరువంకలను రాతిగోడ రమారమి ముప్పదియడుగుల యెత్తుండెను. వాటిపైనుండి యిద్దరుమనుష్యులుకలసి పోవుటకు వీలులేనంత యిరుకుగనుండెను. ఆ మెట్లపైనుండిపోయిన గరన్‌రాగ్ దుర్గమును చేరగలరు.

ముందు దారిచూపుచు హామిట్ నడచుచుండెను. తరువాత ట్యూనారుఁడుఅతని వెనుక నిరువురుయోధులు విచ్చుకత్తులతో అట్లా మెట్లపైనుండి మీఁదికిపోఁగనే ఒకసందుగలదు. దానికెదురుగ నొక ఫిరంగియున్నది. ఆఫిరంగి శత్రులెవరయిన మెట్లుదాటివచ్చిన చంపుటకై యట నమర్చబడెను. ట్యూనారుఁడు హామిట్ వెనుక బోవుచు నొకతలవాకిలిజేరె. ఆవాకిలి నూరుగజములచతురశ్రమై నాలుగుమూలల గోపురములు గల్గియుండెను. దానియవ్వల నరి హద్దొక మెట్టు. దానిపై వరుసగ భయంకరమగు ఫిరంగులు బారులు తీర్చియుండిరి.

ఆ చతురశ్రము వెనుక మరియొక చిన్నగదిగలదు. దాని మధ్య నొకపొడవగు గోపురముగలదు. దానిపై నొకపట్టువతాక మొగురుచు నదిసుల్తాన్ స్కాబిల్ రాజ్యమని తెలియజేయుచుండెను. ఇకలోనికోగినకోట.

కోట ద్వారముకడ నిరువురు చొప్పున సిపాయిలు విచ్చు కత్తులతో నప్రమత్తులై గావలియుండిరి. మరికొందరు ప్రక్క హుక్కాపీల్చుచున్నారు. ఆప్రక్క కొందరు సిపాయిలు కత్తుల సానల దీర్చుచున్నారు. వారందరును హాకొమెట్నిచూచి లేచి సలాములు చేసిరి.

ట్యూనారుడు ద్వారములన్నియు దాటింపఁబడి గోపుర ద్వారముకడకు కొనిపోఁబడెను. అప్పుడొండు వచ్చి ద్వారము దెర చెను. అంత నాపై భాగమునకు బోవ మెట్లు గనవచ్చెను. అందుండి మీదికి గొంపోబడి యొకగదియందు ట్యూనారుడుంచబడెను. అది గరజ్‌రాగ్ ప్రభునిచే నిందితులకై యేర్పరుపఁబడిన కారాగారము. ట్యూనారుని లోననుంచి యూవలతలుపు వేసికొని యెవరిమట్టుకి వారు పోయిరి.

---

## నలుబదియొకటవ ప్రకరణము.

## గరజ్‌రాగ్ దుర్గము.

ట్యూనారున కేమిచేయుటకును దోచలేదు. అందుండి పారి పోవుట యతికష్టమని తన దురదృష్టమును నిందించుకొనుచు గోడకు జేరఁబడి దుఃఖింపసాగెను. దుఃఖమినుమడింప నాడు దానికంటె

పర్యాయముగ గొంతెత్తియేడ్చెను. ఏడ్చిన లాభమేమి. ఇంతలో నాతని కెదురుగనున్న ద్వారము తెరువఁబడెను.

అట్లు తెరువఁబడి యొక వింతవింత పురుషుఁడు ట్యూనారు నకు గోచరించెను. ఆతనికి అరువది సంవత్సరము లుండును. ఎన్నియో సంవత్సరములనుండి సంరక్షణ లేనికారణమున, శిరోజములును గడ్డమును ముఖమంతయు చెదరి, యాతఁడొక యడవి మృగము వలె నుండెను. అతఁడు మాసాలు పొడవుగల్గి, మిక్కిలి చిక్కి యుండెను. ఆతఁడు ధరించిన వస్త్రములనుబట్టి చూడ, నాతఁడైరోపా దేశీయుడనియు కారణాంతరములచే నిఖయిదీఖా బంధితుఁడై శిక్షింపఁబడినాఁడని ట్యూనారుఁ డెరిగెను.

ఆతఁడు ట్యూనారునాశ్చర్యముగ జూచుచుండెను. ట్యూనా రుఁడు తనవలె నాపురుషుఁడు నేనాఁడో యీవరిపాలకులకుఁ జిక్కి బంధింపబడెనాయని యనుకొనుచుండెను. తనయెదుటనున్న ముసలి — డోర్యాలుడా? యనుకొనెను. ఏలనన సుల్తాన్ స్కెమిలు ట్యూనా రుఁడు బంధితుడై నపిమ్మట తనపరివారముతో "ఓరీ! వీనినిగొం పోయి డోర్యాలుఁడున్న చెరయందుంచుడనెను" గదా. పిమ్మట నాముసలి "బాలుఁడా! నీవు నావలె ఖైదీవని తెలుసుకొంటి" ననెను.

ట్యూ—అవును. (అని యేడువసాగెను.)

ము—(ఓదార్చి) బాలుఁడా! ఎంతయేడ్చినను లాభము లేదు. నిన్నుబంధించినవారిది జాతిగుండె. నీయేడ్పుకొంచమయిన వారి హృదయములను కలంచజాలదు. నామాటవిని విచారముడుగుము.

ట్యూ—(ధైర్యముగ) ఆర్యా! నిజము.

ము—బాలకా! నేనయిదేండ్లనుండి యొక్కఁడనే యీచెర యందున్నాను. మరియొకమానవునితో సంతోషముగ నేటివరకు

మాటాడియెఱుగను. రమ్ము. మనమిరువుర మొకగదియందుండువారముగ మాటలాడుకొందము.

అని ట్యూనారు నా ముసలివాఁడొక పెద్దగదిలోనికి గొంపోయెను. ఆగది గోపుర శిఖరమున, పాషాణస్తంభ శిఖరార్ధమై నిర్మింపబడిన చీకటి కొట్టువలె నున్నది. దానిపై కప్పును మోయుచు నొక పొడవగు స్తంభము గదిమధ్యను గలదు. దానిప్రక్క నొక యరుగు ఖైదీలు పండుకొనుటకై నిర్మింపఁబడెను. ఆ గదిగోడల చివర సందులనుండి గాలియు వెలుతురు నందు ప్రవేశించుచుండును. ఆ గది యాకృతి నంతయు ట్యూనారుఁడు చూచుచుండ నా ముసలి ఖైదీ "మొదట—మన వృత్తాంతములఁగూర్చి సంభాషింపక నిన్ను చెఱయం దెట్లుచూతురో చెప్పవలసియున్నది. నా యనుభవము ప్రకారము నీవు ఆ యరుగునే కంచముగ నుపయోగించుకొనవలసి యుండును. అటొకటి యున్నది చూడుము, అదే నా పడక స్థలము. కావలసినచో గడ్డియు దుప్పటులును యీయఁబడును. ఆ దుప్పటులు మాసి చినిగిన వెనుక క్రొత్తవి యిచ్చెదరు. ఉదయమున అన్నమును రొట్టియు నాహారములుగ నిత్తురు. మధ్యాహ్నము పాలు-ఒక్కొకనా డన్నము, కాయగూర, పులుసు, మేకమాంసము నొసంగుదురు. మరి యొకప్పుడు ఫలములనిత్తురు. వారమున కొకపర్యాయము నిషాపదార్ధముల నిచ్చెదరు. మనము మామూలుగ కావలి వాండ్రనూ, వారి సుల్తానును పొగడుచుండిన యేలోపమును చేయరు. లేకున్నచో సరి యగువేళ కాహారము నిచ్చుట మానుటయే గాక బాగుగ జిడుకగొట్టెదరు" అనెను.

ట్యూ—నన్న న్యాయముగ కారాగారమందుంచినారు.

నా—ఎట్లయిన నేమి?—

ట్యూ—అదిగో ఆ చిన్న కిటికీనుండివచ్చు గాలియే గాక మనలను బయటకు విడచి విహరింప నిచ్చెదరా?

ము—ఈ మన్నై యొక్క గుర్తు గలదు. అందున మనమున్న గోపురము చాల యెత్తు, ఆ వంక నుండిన గవాక్షమునుండి వచ్చు గాలి కాకసియను పర్వతములది. ఆ చల్లనిగాలి యుండియునటు పచారు చేసిన యెడ హృదయభారము తగ్గును. లేదా, యీ గది ద్వారము ప్రక్కనేయున్న మెట్లపైనుండి సొంపైన గోపురోపరిభాగమును చేర గలవు. అట రాత్రింబవళ్ళువిహరించినను నిన్నేమియు నడుగు వారుం డరు.

ట్యూ—ఖైదు కాచువారో?

ము—ఉండిన నేమి—మనమిందుండి తప్పించుకొని పోజాలమని యూరకొందురు—అబ్బాయీ! అదిగాక శీతకాలమునందు చలిబాపు కొన మంటకు కట్టెలును, నొక దీపమును యిచ్చెదరు. ఇదియే మన కిందు వారిచ్చు సామానులు.

ట్యూ—సుల్తాన్ స్కేమిల్ చాల మంచివానివలె నున్నాడు గాన దర్శనమునకై ప్రయత్నించి క్షమింప వేడుకొందును.

ము—నాయనా! సుల్తాన్ గరన్ రాగ్ దుర్గమునందుండడు. ఇది శత్రువులను రష్యనుల కస్మాత్తుగ వచ్చిపడిన రాజ్యము కాపాడు కొనుటకై సేనలను మందుగుండు సామానులను, మనవంటివారి నుంచుటకును నిర్మింపబడెను.

ట్యూ—అయిన నేనురదృష్టవంతుడను.

ము—అట్లనకు —అదృష్టవంతుడవు.

ట్యూ—అదృష్టవంతుడనా!

ము—గొప్పయదృష్టవంతుడవు. నీకీఖయిదులో నూనుపోవు టకు నేనున్నాను. నేనిచెరయందడుగుపెట్టినది మొదలు మరియొకని మొగమెరుగను. నేడు నీరాక —

ట్యా—అబ్బా ! మరియొకనితో మాటలాడక మూగనైయుండు వలె నింతకాలమెట్లుంటివి? కష్టమే.

ము—కష్టమా మరికష్టమా ! కొంతకాలమట్లు మూగవాని వలెగడపి యిబునుపోక యేదియో పనికల్పించుకొనెడివాడను. గడచిన వృత్తాంతమేల? నీసంగతి చెప్పెదవా ?

ట్యా—ఆర్యా ! నేయున్నవమునందున్నాను. సుల్తాను కఠిన హృదయుఁడే. నాయున్నవశోభనంతియు నీచెరయందుంచి పాడుచేయ నెంచెనే.

ము—కుమారా ! — నీవుచేసిన నేరమేమి ? — ఏమిచేయ నుద్యమించితివి ? సుల్తాన్ సెలీమిల్ స్వయముగ నిన్ను శిక్షించుటకు గల ప్రబలకారణమేమి!

ట్యా—అబ్బ ! ఆతనియాజ్ఞ జ్ఞప్తికివచ్చిన నాగాత్రము కంపించును. "నీకు మరణశిక్ష విధించవలసినదేగాని నవయువ్వనుఁడ వగుటచే క్షమించి జన్మాంతము కారాగారమిచ్చితి" ననెను.

ము—ఆవిధముగనే యయిదు సంవత్సరములక్రిందట నన్నును శిక్షించెను. నేనుముసలివాఁడనని, నీవుచిన్నవాఁడవనియు కరుణించి ప్రాణదానమొసగి చెరయందుంచెను.

ట్యా—నా వం టి వా ని క ట్టి శిక్షననుభవింపఁ జేయుట న్యాయమా?

ము—నావంటివానికో? — సమయమయిన సుల్తానుపాద ములఁబడి వేడుకొనిన మనకీచెరనుండి విడిపింపఁబడుట కల్గునేమో!

ట్యా— అదియే దుర్లభము.

ము—బాలకా! ఇన్నిమాటలాడితివి గాని నీవే కారణముచే శిక్షింపఁబడితివో చెప్పితివిగావు. నీపేరు?

ము—రష్యనుల చారుఁడనయినందున బంధితుఁడనైతి నన్నె
ఱింగితివా—ఇకనీసంగతి జెప్పుము.

ట్యూ—నాపేరు ట్యూనాకుఁడు. జార్జియను దేశీయుండను. నా చిన్నతనమునుండియు నొకవర్తకునింట బెరిగితిని. అతఁడు కొన్ని దినముల క్రిందను మరణించుటచే నీ కాకసియను పర్వతములందు చారసాంచారకులచే విడువవలసివచ్చెను. అచ్చటయిరువురు మనుష్యులతో కలసితిని, వారును నావలెనే బాటసారులనియే యూహించి నేవండిన మాంసముతో వారిని సత్కరించితిని. పిమ్మట నీగరకా గాగ్ సుల్తానుసైనికులచేఁ బట్టువడి వారుబందిపోటు దొంగలనియు రష్యనుపరిపాలకులు వారినేరయిన పట్టుకొనిన గొప్పబహుమాన మిత్తుమని చాటించినట్లు తెలిసికొంటిని. స్క్యామిల్ సైనికులు వచ్చి పడినంతనే యాదొంగలు పారిపోయిరి. నేనన్యాయముగ పట్టువడితిని. సుల్తాన్ సైనికులు నేనాదొంగల పోత్సాహకుఁడనని యను కొనిరి. నేనట్టి వాఁడను గానని యెన్నియో విధములుగ సుల్తానును వేఁడుకొంటిని, కాని లాభము లేకపోయి యిందుపడితిని.

ము—(చింతించి) ఇందేదియో రహస్యమున్నది. అయ్యది నాకును సుల్తానునకును. చెప్పక దాఁచి యుంచితివి.

ట్యూ—అది నీవెట్లూహించితివి?

ము—ఇప్పుడే రెండు కారణములు చెప్పితివి. పిమ్మట 'నీవె ట్లూహించితి'వను నీప్రశ్నలోనింకను భావమున్నది.

అని యేమో యనుచుండ సాయంకాల భోజనమునుదుప్పటి, గడ్డయు కొత్తఖైదీకి గొనివచ్చినసైనికులందు ప్రవేశించుటచే వారి సంభాషణ కాటంకము గలిగెను.

# నలుబదిరెండవ ప్రకరణము

## ఖైదీలు

అట్లాహార పదార్థముల గొనివచ్చి యుంచిన జైలుకాపరులలో నొకఁడు డోర్గ్యాలునుజూచి "ఇపుడు నీకు ప్రపంచపు సంగతులను చెప్పుటకు తగినవాఁడు జైలులో పడెను. ఉబుసుపోవునులే" అనెను.

డో—ఓరీ. నీవుచాలమంచివాఁడవు.

జయిలుకాపు — నాకు తీరిక యయినప్పుడు నీకూసుపోవునట్లొచ్చి మాటలాడెడివాఁడను. ఇపుడు నీతో సదామాటలాడ నొక స్నేహితుఁడు లభించెను.

అనుచుండ నొకఫిరంగి శబ్దమాతని వీనులఁబడి తనతో వచ్చిన మరియొకనితో "నీవు తక్షణమరిగి జెండాను దించివేయుము మనసుల్తాను యెటకో ప్రయాణమగుచున్నట్లా ఫిరంగి సూచించుచున్నద"నెను.

డో—సుల్తాను రాత్రిప్రయాణమగునా?

జ. కాపు—మావీరునకు రాత్రింబవళ్ళను భేదములేదు. ఎప్పుడయిన ప్రయాణముచేయును. అతఁడుబయలుదేరిపోయినమరలనెన్ని నెలలకో సంవత్సములకోగాని తిరిగిరాఁడు. సుల్తానిచ్చటికివచ్చి యెన్నినాళ్ళయినదో నీకు తెలియునా?

డో—తెలియకేమి. ఒక సంవత్సరమగును. అవుడేగదా నామాటలగ సుల్తానునకు నాయవస్థ జెప్పుమన నీవునిరసించితివి—

జ. కా—నిరసింపక తప్పినదికాదు. అదినాప్రభునాజ్ఞ! అప్పుడు విశాలమయిన పట్టుజెండా యెగిరిపోయినది తెలుసునా?

డో—అవునుసుమా. అదిమరల దొరికినదో లేదో యనుగ వలె ననుకొనుచు మరచి పోతిని.—

జ॥ కా—దొరకలేదు. అప్పుడుగాలిభయంకరముగ వీచుటచే నదిపర్వతపంక్తులలో కెగసిపోయినది. అదియేభయంకరాఘాతమున బడెనో లేక కొండదొరల పిల్లల కుపయోగింపఁబడుచున్నదో! ఇదిగో నాసహాయకుఁడు జెండామడిచి పట్టుకొనివచ్చుచున్నాఁడు.

డోర్వాలునితో మాటలాడుచుండినవాడు జెండాతెచ్చిన రెండవకైలుకాపరితోఁ కలిసి యాగదితాళము వేసికొనిపోయెను. ఆతలుపులచప్పుడు ట్యూవారునకు భయముగొల్పెను. డోర్వాలు డట్టిదుసంవత్సరములనుండి వినుచుండుటచే నానాదము వానికంతగ భయము దోచలేదు.

పిమ్మట డోర్వాలు ట్యూవారు లాహారపదార్థములవద్ద గూర్చొనిరి. ట్యూవారుడొక్కపిసరయిన నాహారము నోటనుంచు కొనలేదు. డోర్వాలుడదిచూచి "అబ్బాయీ! దుఃఖితుఁడవై నీవేమిచేయఁగలవు? ఆహారమును స్వీకరింపుము. నీవిట పస్తుపడి యుండిన "నేము"ని యడుగువారులేరు సరిగదా నిన్నీఖైదునుండి దయతలచి విడుపించువారును లే"రనెను.

ట్యూ—ఆర్యా! ఖైదునందుండియు నీవించుక చీకాకుపడి నట్లగపడదు.

డో—అవును. చీకాకుపడి యేడ్చియేమిచేయఁగలము?

ట్యూ—నీవెప్పుడయిన నిందుండి విడివడుదునని యాశగల్గి యుందువు.

డో—తప్పక.

ట్యూ—ఇందుండి బయలుబడుటకేమయిన నాలోచించితివా?

డో—ఏవేళనేయుక్తితోచునో! సుల్తాన్ స్కేమిల్ కే దయ కలిగి మనల వదలివేయమనరాదా? లేక రష్యనులీదుర్గమును పశ

పరచుకొని మనలవిడిపించరాదా? కానున్న కఠినహృదయులు జాలి దలఁపకూడదా? ఎప్పటికయిన బయలుఁబడుదుమను నాశతోనుండ వలెను గాని దుఃఖించినలాభ మేమి?

ట్యూ—స్కామిల్ మనలవిడుచుట; శత్రులకభేద్యమగు నీకోట రష్యనుల స్వాధీనమగుటయు నొక్కటే!

డా—పోనిమ్ము. కానున్నది కాకమానదు. ధైర్యవంతుడవై నీయావద్వృత్తాంతమును నాకెరింగింపుము. నేను నీప్రాణస్నేహితుఁడను.

ట్యూ—అంతధైర్యము మాబోటియువకులకుండదు.

డా—బాలకా! నీకు ప్రపంచానుభవముతక్కువ. నాతల యెంత నెఱసినదో చూడుము — అదియటుంచి నీవృత్తాంతముఁ జెప్పుము. నీవృత్తాంతము నాకు తెల్పిన భయమేమీ లేదు. నమ్ముము. రేపు నాకథచెప్పెదను.

"నిన్నునమ్మితిని" అని ట్యూకారుఁడనెగాని హృదయములో చీకాకువదలుకొనలేదు.

డా—జెయిలు కాపరు లాహారము కొనివచ్చుటకు ముందు సంభాషణలో, నాకును, స్కామిల్‌కును నీవేదియో దాచితివని యంటివి. ఆ దాచిన సంగతేదియో నన్ను నీ ప్రాణ స్నేహితునిగ నమ్మి అబద్ధమాడక చెప్పుము. స్నేహితునికడ మాయమాటలాడుట పాపము.

ట్యూ—అట్లయిన వినుము. నన్ను బంధించిన సైనికులకు గాని శిక్షవిధించిన సుల్తానునకుగాని నేనేల కాకసియను పర్వతము లందు తిరుగుచుంటినో చెప్పలేదు. తత్కారణముననే నన్ను బందిపోటు దొంగలలో నెంచిరి.

డా—నిజమేల వారికి జెప్పలేదు?

ట్యూ—టిఫిలిసు నందొక రష్యను సైనికుని జంపి ప్రాణ రక్షణార్థమై యీ పట్టణమువీడి యెటుబోవలయునో తెలియకయిట్లు కాకసియను పర్వతమునబట్టి, నా వలెనే సైనికరమనుని బాటసారిగ నెంచి కలసితినని చెప్పిన సుల్తాన్ స్కామిల్ నమ్మునా?—అది కాక నే మరొక తప్పు చేసితిని. అదే మన సైనికరమనునితో నే సంభాషించుచున్న సమయమున సుల్తాన్ స్కామిల్ సైనికుల దూరము నుండి చూచి వారిని దేశద్రిమ్మరులుగ నెంచి, కరమనునికి పారిపోవుటకు సహాయము నొనర్చితిని. అది వారు చూచి పట్టుకొని నన్ను బంధించిరి. ఇది నిజము!

హో—ఏమో, మనస్ఫూర్తిగ చెప్పుచున్నావు గనుక నమ్మితిని. (అని లేచి) రమ్ము! సూర్యుడు కాకసియను పర్వతములం దస్తమించుచున్నాడు. ఇపుడు మనము గోపురోపరిభాగమున కేగి యీ శోభ దిలకింతము.

ట్యూనాడుఁ హోర్వాఁడులు గోపురోపరిభాగమున కేఁగిరి. అప్పై భాగమును జుట్టియున్న గోడ యయిదడుగుల యెత్తున్నది. ఆ మధ్య సుల్తానుగారి జెండాస్తంభమున్నది. సుల్తాను కోటయందున్నప్పుడు, ఆ పరిసర ప్రాంతము లందున్నప్పుడే యీ పతాకము రాత్రింబవళ్ళెగురుచుండును. అతఁడు దూర దేశమేగినతరి జెండా తీసిదాఁచి వేయఁబడును. ఆ జెండా స్తంభము చివరకంపుటకు పొడవాటి త్రాళ్ళుగలవు. ట్యూనాడుఁ డా త్రాళ్ళుచూచి "చాల బలమయిన" వనికొని క్రిందకు చూచెను. హోర్వాఁడుఁ డాతని యూహను గ్రహించి "అబ్బాయీ! అట్టి పనికిరాని యాలోచనలకు తావీయవలదని యెన్నిమార్లంటిని? నీ వా త్రాళ్ళువిప్పి వాటిమూలమున నీగోపురము నుండి క్రిందకు నడిరేయిని జారినను పారిపోవుట దుర్లభము సుమా!

ట్యూ—నిజము.

షార్వాల్ పిట్టగోడనుండి పశ్చిమ కాకసియాను పర్వతపంక్తులలో నస్తమించుచున్న సూర్యభగవానుని చూచుచు "అబ్బాయీ! టర్కీ, రష్యాలకు యుద్ధము జరుగనున్నదని, పైలుకాపరి వలన వింటిని. ఆసంగతి నీకేమయిన దెలియునా? — అన్నట్లు నీ పేరు?" అనెను.

ట్యూనార్ !— ఆవార్త నిజమే, రష్యనులు డాన్యూబు నదియుత్తరభాగమునగల సుల్తాను నొక్క రెండు క్రిష్టియను రాజ్యములపై దండెత్తివచ్చిరి. వారినుండి యారాజ్యములఁ గాపాడుటకు సుల్తాను తనసేనానాయకులలో గొప్పవీరుఁడగు ఉమర్ పాషాను సేనావారముతో నంపెను.

షార్వాల్— ఆ యుద్ధమునందే గాబోలు గ్రేటుబ్రిటను, (Great Britain) ను, నామాతృభూమియగు ఫ్రాన్సు (France) ను పాల్గొనుచున్నవి. యుద్ధము గానిమ్ము మనకేమి! ఆయుద్ధఘోరంగుల ధ్వనియు మొదలయినవి యేకాంతమునందున్న మనకు వినఁబడవు లే. మనశాంతమునకేమియు భంగము కలుగదు.

అని షార్వాలుడింకను ప్రపంచమున జరుగనున్న రాజకీయములగూర్చి ట్యూనారునడుగుచుండెను. ట్యూనారునకు తెలిసినంత మట్టుకు చెప్పుచుండెను. ఈవిధముగ వారాగోపురోపరిభాగమున మరిరెండు గంటలవరకు సంభాషించుకొని చీకటిపడినంతనే వారి గదిలోనికిపోయిరి. షార్వాలుఁడు దీపము వెలిగించెను. తదుపరి నిరువురు ననేకము మాటలాడుకొనిరి. షార్వాలుడు నిద్రించెను. ట్యూనారుఁడాచెరయందు తానెంతకాలముండవలయునను నాందోళనచే చుట్టబడి చాలవరకు కునుకు రాక తెల్లవారుఝామున నిద్రాసక్తుఁ డాయెను.

చేసి యానందము నొందిరి. పిదప నా పొన్నులు, ట్యూవాకునకు, నిజ వృత్తాంతమీక్రిందివిధముగ చెప్పసాగెను.

"ట్యూవాక్ ! నా మాతృదేశమునందు నేను కౌంటు (Coumt) అని పిలువఁబడుదును. కౌంటన నొకచిన్నప్రభువను మాట. — ట్యూవాక్ నేను ప్రభువునయినను యిట నిరుపేదను సమానుఁడనే ! నేధనవంతుఁడనై [illegible] నాధనమంతయు వెచ్చపెట్టితిని. [illegible], దుర్వ్యసనములందెల్లపుడు సంతోషముగ నుండనెంచి వివాహము మాని యిష్టానుసారముగతిరిగి ధనవ్యయము జేసితిని. ఆచెడునడత యిప్పుడుజ్ఞప్తికివచ్చుకొని నన్ను నేను దూషించుకొందును. నాకు నలుబదియైదువత్సరములు వచ్చినంతనే నాయిష్టములన్నియు నొక్కసారి పారిపోయెను. ధనలేమిచే దురలవాటులన్నియు మలినవసనముల విడిచినట్లువిడచితిని. పిమ్మట విద్యాభ్యాసముపై మనస్సుతిరిగినది. అచిర కాలములో ననేకభాషలు నేర్చితిని. తరువాత కొంత కాలము రసాయనశాస్త్రము నేర్చి, యొక విషవాయువుస్పృశించి ప్రాణావశిష్టుఁడనైతిని. ఆవెనుక నొకఆవిరి యంత్రాభివృద్ధికై మిగిలినధనములో చాలవరకు ఖర్చుచేసి విఫలమనోరథుఁడనైతిని. ఇది యుదయన నేల! అనేకకళలపై ధనవ్యయము జేసి యెందును సఫలమనోరథుఁడనుగాక ధనముసంపాదించవలెనని యూహించితిని. ధనముచంచలము. అజ్ఞానినై బహుగాకష్టపడితిని. తత్ప్రయత్నమున బీదవాఁడనైతిని. ఉన్నధనముకూడనూడిపోయెను. అంత పారిస్ నందు ధనవంతుఁడొకఁడు చనిపోయినాఁడు. అతనికి నేవారసుఁడను. ఆతనిధనమునకై నేప్రయత్నించితినిగాని వాని యప్పులకాధనము సరిపోయినది. అప్పటినుండి నాజీవితము మరల మారెను. దానితో యూహాలుమానిపోయినవి. దానితో శక్తియు జారెను. పిమ్మట చిత్రకారుఁడనై ఏకాంతముగబ్రతుకనెంచి యీ

కాకసియను పర్వతములందలి ప్రకృతిదృశ్యములదీయ నిటవచ్చితిని. వచ్చియనేకదృశ్యములజిత్రించి యొకదినమున గరన్ రాగ్ దుర్గమును చిత్రించుటకై నొకపచ్చికబయలునకూర్చుంటిని. నేనాదుర్గమును చిత్రించుచున్నతరుణమున ముస్లిము యోధులువచ్చి చూచి నాకళా ప్రవీణతకెంతయు మెచ్చుకొనిరి. దానికినేనానందించి నావద్దనున్న మరికొన్నిచిత్రములజూపితిని. వారమందానందభరితులై నాకుబహు మానముగ ద్రాక్షరసములు, పక్వఫలములు గొనివచ్చి యిచ్చుచుండెడివారు. అప్పటినుండి నేవారిస్నేహితుండనైతిని. పిదప మరికొన్నిచిత్రముల దీయవలెనని యచటికాకసియను పర్వతాంతర్భాగమునకుపోతిని. అటగొందఱు రష్యనులున్నజూచి నావృత్తాంతమంతయునరసి, నాచిత్రములన్నియు జూచి మెచ్చి నన్ను వారియజమానికడకు గొనిపోయిరి. అతఁడును నాప్రజ్ఞకుకడుంగను సంతసించి నావద్దనున్న గరన్ రాగ్ దుర్గచిత్రమునుజూచి దానిచిత్రము తావ్రాసుకొనెదనని వ్రాసుకొనుచు కళవళపడసాగెను. నాకును — ఆహారపదార్థములనిచ్చితనిపిన గరన్ రాగ్ దుర్గసేవకులు జ్ఞప్తికివచ్చి — వారియజమాని కోటశత్రులగు రష్యనులకు వ్రాసికొనిచ్చుటద్రోహమనితోచెను. అట్లు రష్యనులయజమాని యాదుర్గముచిత్రించుచుండ గరన్ రాగ్ సైనికులెటనుండియోవచ్చి వారితోతలపడిరి. ఇరుపక్షములవారికిని ఘోరసంగ్రామముజరిగెను. రష్యనులు చెల్లాచెదరయి పారిపోయిరి. పిమ్మట గరన్ రాగ్ దుర్గభటులు నన్నుబంధించిరి. మరియేమున్నది? నన్నొక రష్యనుచారుడుగనెంచి గరన్ రాగ్ దుర్గభేదనమునకై చిత్రము దీసికొనివచ్చిన వాడననియు చెప్పి నన్ను సుల్తాన్ స్కామిల్ యెదుటనుంచిరి. నన్నాక్షణమున శత్రువుగ నురిదీయవలసినదేగాని స్కామిల్ నామృదువయసునకు గౌరవముంచి యాజన్మాంతము కారాగారము నిచ్చెను. ట్యూనార్! ఇది నావృత్తాంతము.

---

## నలుబదిమూడవ ప్రకరణము.

## డోర్వాలు ప్రభువు

పై విధముగ డోర్వాలు ట్యూనారు లౌకికకథలొకరు చెప్పుకొనుచు లోకపుసంగతుల మాటలాడుకొనుచు చెరయందు సుఖముగఁ గాలము గడపుచుండిరి. ఏడుదినములు గడచినవి. ట్యూనారుఁడు వేరుచింతలేక చెరయందు డోర్వాలునితో నానందముగ నుండెను.

వారమునకొక పర్యాయము, సారాయమును ఖైదీల కొసంగెదరని యీవరకే చెప్పియుంటిమి. అచ్చట వారికి స్కైమిల్ ఛటు సారా బియ్యముతో చేయఁబడినది. డోర్వాలుఁడు మొదటినుండియు సారాయమును ఛద్రపరచి నీటినే ద్రావుచున్నాఁడు. ట్యూనారునకు సారాయ ముండవలయునను నంతయలవాటు లేదు. ఇష్టమయిన ద్రాగును. లేకున్న మానివేయును. ఒక్కొకపుడు సారాత్రాగుట మంచిదికాదని డోర్వాలునితో చెప్పుచుండెడివాడు. అందుకు డోర్వాలుఁడు "ట్యూనార్! నిజమే. సారామానవుని పాడుచేయువిషము. అట్లని మనకు వారము వారము తెచ్చు సారాను వద్దనకుమా. అది ఛద్రపరచిన సమయాసమయములందు పనికి వచ్చు"ననుచుండెడి వాఁడు.

అమరునాడు ఖైదీలకు రెండు రాతి జాడీలతో సారాగొని వచ్చి జయిలు కాచువాడుంచి పోయెను. ఆసారా జాడీలను గొనిపోయి డోర్వాలు డొక గూటియందుంచి ట్యూనారునితో "ట్యూనార్! జాగ్రత్త. మాటవరుసకయిన మేముసారా త్రాగుట మానితిమని జయిలువారితో ననకు" మనెను.

అమరచట వారము మరల శైలుకొపరి సారాగొనివచ్చి యుంచి పోయెను.

ట్యూ—ఆర్యా! మనకొరకై తెచ్చుచున్న సారా దాచుచున్న ట్లున్నది?

డో—అవును. నేనా సారానంతటిని అవుసరార్థమై దాచు చున్నాను. ఎప్పుడయిన నీకు గావలసిన నన్నడుగుము. ఇచ్చెదను. ట్యూనారుడు దుర్మార్గుడు. స్వలాభాపేక్షి. సాధారణముగా నొక రిని నమ్మువాడుగాడు. అందువలన డోర్వాలునియెడ నంతనమ్మ కము గలిగియుండలేదు. గాని యెట్లయిన నాతని మాటలు లక్ష్యము చేయకతప్పను. ఎపుడయిన చెరవిముక్తుడు గావలయును. అదియు డోర్వాలుని సహాయమునసే నని యెరిగిన వాడగుటచే నూరకొనెను. అయిన నాతడు తనకు తెలియకుండ సారాయమును త్రాగుచున్నా డని యనుమానము మాత్రము విడువలేదు.

ఆదినమంతయు ట్యూనారుడు డోర్వాలునియెడ ననుమానముతో గొట్టుకొను చుండెను. రాత్రిపడినది. ట్యూనారు డోర్వాలులు వారివారి ప్రక్కలం జేరిరి. గదియందు వెలిగింపబడిన దీపమార్పివేయబడెను. అంతయు నిశ్శబ్దము. ట్యూనారుడు నిద్ర నుండి లేచెను. తెల్లవారిన దనుకొనెనుగాని సూర్యకాంతికి మారు దీపమాతనికి గనవచ్చెను. దానిని జూచి ట్యూనారుడు, తాను గాఢనిద్రయం దుండునపుడు డోర్వాలుడు లేచి సారాయమును త్రాగి వేయుచున్న ట్లనుమానించెను. లేచి దీపము వెలుగున డోర్వాలు డేమిచేయుచున్నాడో చూడనెంచెనుగాని యిష్టము లేకపోయెను. పండుకొనినట్లే యభినయించుచు చూడవలెనన్న తనకును డోర్వాలు నకును మధ్యనొక పెద్దస్తంభ మడ్డుగనున్నది. స్తంభమునకవ్వలి తట్టున డోర్వాలుడు గడ్డిసద్దుచుండి నట్లాతనికి వినబడినది. అమర్మర

శబ్దమట్లే యాతనికి కొంతకాలము వినవచ్చెను. మరికొన్ని నిముష ములకాశబ్దము వినరాక దీపమార్పివేయబడెను.

డోర్వాలు డొకపరి ట్యూనారునితో తాను వేరుగ నొక సీసాతో సారాయమును తనపక్కక్రింద నుంచినట్లు చెప్పెను. దానినే యారాత్రి డోర్వాలుడు దీపమువెలిగించి త్రాగివేసి యుండునని యూహించుకొనుచు నిద్రించెను. తెల్లవారినది. ట్యూనారుడు డోర్వాలు లిరువురును మేల్కాంచిరి. డోర్వాలుడు గోపురోపరి భాగమున నుదయభాను కిరణశోభయందు దిరుగాడ బోయెను. అప్పుడు ట్యూనారుడు డోర్వాలుడు పండుకొనియుండి తావునకు దగ్గరనున్న గూడులోపలి జాడీలను కదిపి చూచెను. అందొక చుక్కయు సారా లేదాయెను. పిమ్మట నచ్చటి గడ్డిపరుపెత్తి చూచెను. అచ్చటనేమియు గనరాలేదు. అంతట ట్యూనారుడు డోర్వాలునెడ ననుమానము బలపడ తనలో "ఆహా! ఈతడు చెప్పినదంతయు నసత్యము. ఊహించి దేశీయుడు ముసలి యయ్యు నాశపోతువలె గన్పడుచున్నాడు. మనము సారా త్రాగ వలదని, యాతడు నేనిద్రావశుడనై యున్నప్పుడు మారెండు వంతులును తానే త్రాగివేయుచున్నా"డనుకొనెను.

ఆరువారములు గడచెను. ట్యూనారుడిప్పటికి రెండునెలల నుండి యా కోటయందు ఖైదీయయి యుండెను. ఒకనాడు సారా సంగతి ప్రసంగవశమున డోర్వాలునితో నవవలెనని ఉభయుము గోపురోపరిభాగమున విహారమయి వచ్చిన పిదప ట్యూనారుడు డోర్వాలుని చూచి "ఆహా! ఎప్పటికయిన మన మీ పాడు చెర నుండి బయటబడి యా కాకసియను పర్వతపంక్తులందు విహరించ గలమా" అనెను.

డో — చెరవిముక్తుడవయిన నీ వేమి చేయుదువు?

ట్యూ—స్నేహితుడా! ఈ విశాల ప్రపంచమున నావంటి యువకుడు చేయు కార్యమే లేదా? అట్టి ప్రశ్నమేల యడిగెదవు? ఇప్పుడు నే విడువఁబడితినా పోయి రష్యా టర్కీషు యుద్ధమున పాల్గొనియే యుందును.

డో—నీవుపోయి యుద్ధమున జేరెదవు నేనో? ఈ చెర యుందే—?

ట్యూ—అట్లనకుము. నిన్ను విడచి నే నొక్కఁడనే చెరవిముక్తి కోరుదునా? మన మిరువురమును నిందుండి విడువబడుటకు ప్రయత్నింతుము. నీ వేమి చెప్పినట్లనడచెదను. మనము స్వతంత్రులమైన వెనుక నీతో పారిస్ నగరము వచ్చెదను.

డోర్వాలుఁడాలోచనాపరుడై యూరకొనెను. ట్యూనారుఁడాతని రెప్పవేయక చూచుచుండెను.

డో—ట్యూనార్! ఈ రెండు మాసములనుండియు నీ స్వభావమును గనిపెట్టుచున్నాను. నీ వింధించబడిననాఁడే కాపరులనుచంపి పారిపోవలేనా యనుయూహగల్గి యుంటివి. ఆ విధముగ నిందుండి తప్పుకొనజాలవు. ఇట్టి కట్టుదిట్టములుగల ఖయిదునుండి తప్పించుకొనుట కెంత యాలోచించవలెను? తొందరపడిన లాభము లేదు. ఓరిమి వలయును.

ట్యూ—స్నేహితుఁడా! ఓరిమితో నిన్నాళ్ళిందుండి నీవు—?

డో—బాలకా! తొందరపడిమరల తప్పుదారి బడుచున్నావు. నా తలలోని యాలోచనలు నీకు గల్గినసేమియు జేయజాలక నీవీపాటికి పిచ్చెత్తిపోదువు. కష్టములు శాశ్వతములుగావు. కష్టములందే పురుషునకు ధైర్యము గావలెను.

ట్యూ—చిత్తము. అట్లయిన నిందుండి తప్పుకొనుట కుపాయ మూరసితివా?

డా—(ఆలోచించి) ట్యూనాక్! పశ్చిమ పరాసా ఖండము లందు కొందరు శాస్త్రజ్ఞులు వాయువిమానముల గల్పించి వానిమూల మున మనుష్యులు మేఘములదాటి యెగురుచున్నారు. ఇప్పట్టున మనమిందుండి తప్పించుకొనుట కట్టి విమానమొండు చేయ జింతించు చున్నాను.

ట్యూనాకునకు నమ్మకముతోచలేదు. డాక్టర్లు పిచ్చి మాటలాడుచున్నాడనుకొనియెను. లేకున్న నొకయంత్రము నావవు లేమి ఆకాశమార్గమున నెగురుటయేమి?

డా—ట్యూనాక్! ఇటుచూడుము. ఆవాయువిమానమును గూర్చి చెప్పెదను.

అని యాతడు జేబునుండి కొన్నిరంగుముక్కలనుదీసి గోడపై వాయువిమానమును చిత్రించి అదియెట్లాకాశమార్గమున నెగురునో యావృత్తాంతమంతయు దెలియబరచెను. ట్యూనాకుడాతని మేధాశక్తి కాశ్చర్యపడి "ఓ! నీవు గొప్ప తెలివయినవాడవు. నీతో నేను పనికిరా"నని పొగడెను.

డా—అట్లనకుము. నీవే లండనుగాని పారిస్‌గానిపోతివా యిట్టి విమానములు వందలుచూడగలవు.

ట్యూ—అద్భుతము! ఆవిమానమును తయారుచేయుటకు మనవద్ద నేమిపరికరములున్నవి? — మనమిం దాజన్మాంతముండ వలసినదే.

డా—(యోచించి) పిరికివాడవుగాకుము. నీవట్టివాడొకడు చేదోడునున్న యేపనిచేయజాలను.

ట్యూ—క్షమింపుము. నేబుట్టినదాదిగ నిట్టియద్భుతముల గూర్చి వినియెరుగను.

షో—అట్టి ప్రశ్నలు వేయక నా ప్రయత్నమున సహాయము జేయుము. — ట్యూనార్! నీకు విమానమును చిత్రించి చూపితిని గదా, ఇక దానిని చెరిపివేసెదను. లేనియెడల ఖయిదుకాపరి చూచి యనుమానపడినచో మనతిప్ప లనుభవింపవలసివచ్చును.

అని షో ర్యాలుండు తడిగుడ్డతో విమానపుచిత్రమును చెరిపివేసి ట్యూనారుని తాపండుకొను చోటికిగొనిపోయి యచ్చటిగడ్డి నొకవారకుత్రోచివైచి "ట్యూనార్! ఇపుడు నీకొకరహస్యమును చూపుచున్నాను. నేపండుకొను నీరాతియరుగులోన గుల్లగనున్నది. పైనిమాత్రము మూడు రాతిపలకలమర్పబడినవి. వాటిపై నేనుగడ్డి యెత్తుగ వేసికొని పండుకొందును. ఆలోపున ధనముగలదు. అది యెరికిని తెలియ"దనెను.

ట్యూ—ధనమా !!

షో—అవును, నాధనమందున్నది. ధనమనిన బంగారు వెండి నాణెములుగావు. ఆధనము లేదు. ధనములు వాటంతటవియే ముందు రాగలవు.

అనుచు నొక పలకతీసి "ట్యూనార్! ఇదివరకు యిచ్చటికి వచ్చిన జైలుకాపు జెండాయెగిరిపోయి యెటపడిపోయెనో" అనెను జ్ఞాపక మున్నదా" అనెను.

ట్యూ—జ్ఞాపకమున్నది. అతఁడా జెండా యెగిరి యే యగాధమున పడెనో లేక కొందరయితుల పిల్లలకు దుస్తులుగ నుపయోగింపబడుచున్నదో యనెను.

షో—వాడట్లనుకొనెనుగాని యాపెద్ద పట్టుజెండా యిటనే యున్నది. (అని గరన్ రాగ్ దుర్గముపై నెగురు పచ్చని జెండా నీవలకుదీసి) దీనిని గాలితోనింపిన బొంగునట్లు రబ్బరుతో నతికి కొట్టితిని, సారానలన లభించువాయువుచిందు నింపి దానికి

తాళ్ళుగట్టి. (బుంగకు మూతివద్ద) మంచమునకు తేలికయిన కఱ్ఱతో చేసి కట్టి సిద్ధముగ నుంచుకొనిన సమయము చిక్కగనే యెగిరి తప్పించుకొనవచ్చును.

ట్యూ—ఎప్పుడు?

డో—తరుణమునకై వేచియున్నాను. అంధకార బంధురమై యుప్ప శీతాకాలపు రాత్రులకై యెదురుచూచుచున్నాను. ఇప్పుడు మనము చేయవలసిన దేమనగా కోటపై భాగమునకు మామూలుగ పోయి మెలకవతో నచ్చటి జెండాకొయ్యకున్న తాళ్లు తెచ్చుకొని యిక్కడున్న కఱ్ఱముక్కలను మంచముగకూర్చి జాగ్రత్తగ (మన పట్టుజెండాకు) గాలిబుంగకు కట్టి సిద్ధముగ నుంటిమా సమయము చూచి గోపురోపరి భాగమునుండి యీబాయిదువదలి యెగిరిపోగలము.—ట్యూనార్! ఇకనీవిమాన మెట్లుగాలిలో యెగురునందువు? ఇదిగో ఈపీపాచూడుము. మొదట నే నీ చెరయందుంచబడినపుడియ్యది నాకాసనముగ నిచ్చిరి. అది నేనోమూలనిడి నాకై ప్రతివారమును దెచ్చుసారాయమునందు పోసి యుంచుచున్నాను. ఇప్పుడు నీకును నాకును దెచ్చిన సారానంతయు నిందుపోసి భద్రపరచుచున్నాను. సమయమునచ్చినచో నిది యావిరిచేసి నేబుంగగ కుట్టిన పట్టుగుడ్డయందునింపి మూతికట్టిసేసి, క్రిందకొక తేలికమంచమును కట్టి మనమిరువురము నందుగూర్చొని మేఘమండలములోని కెగిరి యీచెరనుండి తప్పించుకొన్నటకు. గాలికంటె సారాఆవిరి చాల తేలిక.

అని తాపందుకొనురాతియరుగుపై రాతిపలకలనుపేర్చి గడ్డి పరచివేసెను. ట్యూనారుడాశ్చర్యపడి డోర్వాలుని మేధాశక్తిని కొనియాడుచుండ డోర్వాలుడు "ట్యూనార్! గోపురోపరి భాగమునకుబోయి చల్లని గాలినాస్వాదింతము రమ్మ"నెను.

---

# పదునాలుగవ ప్రకరణము

## హోర్వాలు ట్యానాసులు

ట్యానాసుడు హోర్వాలుని యభిప్రాయము నెఱిఁగి అతని కుఁజెప్ప మరియభిప్రాయపడినదెంతయో వగచెను.

ట్యానాసు హోర్వాలులిద్దరునుకలసి గోపురోపరిభాగమున గాలియందాలోచనాపరులై యిటునటుపచారుచేయుచుండిరి. ట్యానాసుడు మహోపకారియగు హోర్వాలునకు గులిస్తానులోయవృత్తాంతమును చెప్పుటయా మానుటయా అని వితర్కించుకొనుచుండెను.

హో—"ట్యానాస్! ఇంకను నీకొక యద్భుతమగు విషయమును జెప్పదలచియుంటి" అనెను.

ట్యా—అట్లనా! నేనుగూడ నొకయద్భుతమగు రహస్యము నీకు చెప్పవలసియున్నది. అదియింతవరకు దాచియుంటిని. అదియు నాకంతకాగుగ తెలియునుగాని—దానితుది గ్రహింప లేకపోయితిని.

హో—అబ్బాయీ! నీమాటలు నాకాశ్చర్యమును గలుగఁజేయుచున్నవి. ఈకాకసియను పర్వతములందు నీవుతిరుగాడుటకు మరి రొక కారణమునుగలదా?

ట్యా—గలదు. రష్యనుసైనికునిజంపి ప్రాణరక్షణార్థమై యీకాకసియను పర్వతముల బట్టితినంటినిగదా. అదిగాక నేనీచోటికివచ్చుటకు మరియొక కారణమునుగలదు. చెప్పెదను. నీ విదివరకే యీకారణము నాకేలచెప్పితివిగావని యాగ్రహింపవుగద.

హో—నీకు చెప్పుటకిష్టములేని రహస్యమును దాచితివి. అందు తప్పేమున్నది. నీకుకూడ నేనొన్ని విషయముల జెప్పలేను. దాననేరమేమి ఆగ్రహించుటకు. నీరహస్యమును గప్పికొనుటకు రష్యను

పై నిమ్మనిజంపి ప్రాణరక్షణార్థమై యీయాడవుల బట్టితివని యుక్తిబన్ని తివి. నేనో —— సారాసేమి చేయుచున్నానో నీకు చెప్పకుండ "నీకెవ్వడయిన సారాగావలసిన వస్తువుగు మిచ్చెద నంటినిగాని అసలు సంగతి జెప్పితినా? కాన మనమిరువురము రహస్యములదాచి యుంచితిమి. నా రహస్యము నీ కపుడే తెలియబరచితిని. ఇక నీ రహస్యమేమి!

ట్యూ——నేను నా యజమానియగు మన్సూరుని రహస్య కాగితములందు, కాకసియను పర్వతముల మధ్య సౌందర్యముగు లోయగలదనియు, నందు వజ్రపుగనులు మొదలయినవిగలవనియు, నదిభూలోకస్వర్గమనియు చదివితి——

డా—అదిగులిస్తానులోయ! —— అదినీకుకూడ తెలిసియే సంభాషణలో నొకమారు నీతో ధనములు తమంతట తామే వచ్చు నంటిని.

ట్యూ—ఆయుదాహరణము నేనగ్రహింపలేక నీవు మేధా సంపన్నుడవనియు జైలునుండి విడిపడినపిదప నీశక్తిచే ధనము లార్జింప గలవనియు ననుకొంటిని.

డా—కాదు కాదు. ఈవాయువిమానమువలన నీఖయిదునుండి మనము తప్పించుకునిపోయి యాభూలోకస్వర్గమున దిగవలయునని నా ఊహ.

ట్యూ—బాగు! నడచిపోయిన యీగాఢాంధకార బంధురములగు గుహల యందలి కష్టములు తప్పవు.

డా—నీవు నాకంటె యదృష్టవంతుడివలెనుంటివే. నీవాస్థలము నొకపర్యాయము చేరినట్లున్నది?

ట్యూ—లేదు. అస్థలమున్నతావు నాకు తెలియును. దానిచేత నాగుహనుండిపోవలెను. అందుండి నేపోవుచుండ నాగుహాభిత్తిని నొక

భయంకరవిషసర్పము నాకడ్డమాయెను. యోచించిచూడగ నది యాతాపును గాచుచున్నట్లుతోచెడిని.— దానికిభయపడి యాస్థలము నుమరచి పారివచ్చితిని.

డా—అలాగునా?

ట్యూ—ఆపామును భయమందించి నేనాగుహనుండి యెట్లు వెలబడితినో నాకే తెలియదు. — కాని అదికదలలేదు.

డా—ఆగులిస్తానులోయ కాకసియను పర్వతములందెట నున్నదో నీకు బాగుగా తెలియునా?

ట్యూ—ఆలోయ, వలయాకారముగ మనుష్యానకజేయమగు పర్వతపంక్తులమధ్యనున్నది. ఆపర్వతములలో నెత్తయిన శిఖర మొకటిగలదు. అదిచూచిన నాలోయలోనికి దారిజూపగలను.

డా—ఆ గుర్తును జ్ఞాపకముంచికొనుము. మనము వాయు విమానముపై ప్రయాణము చేయునపుడది చూపితివా, ఆ లోయ లోనే పోయిగ దిగుదము.—తరువాత—నీకు నేనొక వృత్తాంతము శ్రవణపేయముగ జెప్పనెంచితిని వినుము. అది నీవు చెప్పిన దానంత ముఖ్యమయినది కాదుగాని—

టూ—నీవేమి చెప్పిన వినెదను.

డా—నే ననేక పర్యాయములు నాగురించియు నాదేశమగు ఫ్రాన్సును గూర్చియు నీతో ముచ్చటించితిని. ఇప్పుడు మరియొక క్రొత్తసంగతి జెప్పెదను వినుము. అదెప్పుడు జరిగెననః పదునాల్గవ లూయీ ప్రభుత్వము జాలించు సమయమున పారిస్సందు మిగ్నాట (Mignot) ను వాడు పుట్టుకతో ప్రభుసంతతిలోని వాడయ్యు, పరోపకారమునందును, ధర్మకార్యములందును సర్వస్వమును గోలుపోయి పరులపంచ నుండవలసి వచ్చెను. అట్లాతడొరులపంచనుండి హఠాత్తుగ మాయమాయెను. ఆతడేమాయెనో యెటకేగెనో

యెరికిని తెలియకుండెను. మరి రెండు సంవత్సరములు గడచినపిమ్మట నాతఁడు పారిస్ వచ్చి పోయిన వాటినన్నిటిని మరల సంపాదించుకొని మహా ధనవంతు డయ్యెను. ధర్మముకూడ హెచ్చెను. ఆతని పరోప కారబుద్ధి ప్రజల నోళ్ళనుండి రాజాస్థానమును జేరెను. ఆ సమ యముననే దేశము నంతఃకలహములుకూడ ప్రారంభమాయెను. ప్రభువు ప్రజలతో సమానుఁడు గావలసిన సమయము వచ్చెను. అట్టితరి మిగ్నాట్ పరమధార్మికుఁడని లూయీ విని యాతని తన సమ్ముఖమునకు రానంపి, మార్క్విస్ (Marquis) అను బిరుదునిచ్చి గౌరవించెను. మరి కొంతకాలమునకు అల్లరులు లావయి, లూయీ ప్రభువును సింహాసన భ్రష్టునిచేసి రాబస్పీరి అనువాడు ప్రజాప్రతి నిధి యాయెను. ఆతని దౌర్జన్యపాలన (Reign of Terror) కుభయ మంది ప్రభుపదవిగల వారందరును దేశమును విడచి పారిపోసాగిరి. మరికొందరు ప్రభువుల దౌర్జన్యపాలకులచే బలవంతముగ నీడ్చుకపోఁ బడి నరికివేయఁబడిరి. పిమ్మట మిగ్నాట్‌కూడ నా కృతాఘ్నులచేబడి చెరయందుంచఁబడెను. తరువాత న్యాయస్థానమున నాతని విచారించి వానియాస్తిపాస్తులపహరించి దౌర్జన్యపరిపాలకు లాతనికిమరణదండన విధించిరి.

టూ—అయ్యో! ఆ ధర్మమూర్తికి మరణ దండనయా!

డా—అట్లుశిక్షింతుఁడై యాతఁడు లక్సెంబర్గు చెరయందు బంధింపబడెను. ఆతఁడున్న చెరయందే డోర్వాలుఁడను నొకమత గురువుకూడి బంధితుఁడాయెను. అపుడాతఁడు తరుణవయస్కుఁడు. ఆడోర్వాలుఁడు నాపినతండ్రి, మిగ్నాట్ ధర్మాత్ముఁడును మత పట్టుదల గలవాఁడును. ఆతఁడు తనయైశ్వర్యమే తనచావునకు కారణమని, తనధనమున్నతావు నాపినతండ్రికి జూపెను. పిమ్మట నాత డురిదీయంబడెను. ఇంతలో దౌర్జన్యపాలకు లణచివేయబడిరి;

రాబస్పీరి యురిదీయఁబడెను. ప్రజాపాలన నెలకొల్పబడెను. చెరలలో నున్నవారందఱు విడచి వేయఁబడిరి. వారితో నాపినతండ్రియు విడిపింపబడి మతగురువు పదవి నలంకరించెను. ధనము బాగుగ నార్జించెను. డోర్వ్యాలుడుకూడ ధర్మాత్ముఁడగుటచే తన స్థిరాస్థులపై నప్పులుచేసి ఋణగ్రస్థుఁడాయెను. వాని ప్రజలకాసంగతి తెలియదు.

ట్యూ—ఆరు సంవత్సరములక్రితము నీబంధువు డెవఁడో చనిపోయెనని వానివారసునుగపోయి, అప్పులక్రింద ఆస్తిసరిపోయె నని తిరిగివచ్చితివంటివి. ఆతఁడే డోర్వ్యాలుడనుకొందును.

డో—అవును. ఆతఁడు నేనరుగుసరికి మరణం బాసన్నంబై యుండ మిగ్నాటు చెప్పిన గుప్తధన ప్రదేశమునుగూర్చి చెప్పుచు చనిపోయెను.

ట్యూ—అదిగులిస్థాను లోయయా?

డో—ఆ! మిగ్నాటు ధర్మాత్ముఁడై పిత్రార్జితమును గోలుపోయి రొయిరుల పంచ నున్నటులుండి మాయమై యాలోయఁజేరి పారిస్ వచ్చి పోయినవన్నియు కొనుక్కొనెనట. ఆవృత్తాంత మితరుల కెరిగింపవలదని యురికిపోవుచు నాపినతండ్రికి చెప్పెనట. ఆసంగతినే తానుమరణించునపుడు మాపినతండ్రి డోర్వ్యాలునాకు చెప్పెను. అదిపూర్తిగ జెప్పకుండ ప్రాణముల వీడెను.

ట్యూ—ఆలోయ జేరుమార్గము పూర్తిగ వినని కారణమున నిరాశ జెందితివా?

డో—నిరాశ జెందితిని. అయినను మనుష్య ప్రయత్నము లేనిదే దైవసహాయముగాదని కాకసియను పర్వతములకు చిత్రకారుని వేషమునవచ్చి యిదివరకు నేచెప్పినకారణములచే సీగరక్ రాక్ దుర్గమున ఖైదీనై యిడుమలు బడుచున్నాను.

అని శ్రోర్వాలుఁడు కథముగించెను. ట్యూనారుఁడుకూడ తానాలోయను సమీపించుటకు చేసిన ప్రయత్నముల జెప్పెను. అంతటితో వారిరువురి యభిప్రాయ మొకటియై యగుటచే ప్రాణస్నేహితులై కృషిచేయుచు నాచెరనుండి తప్పించుకొనుటకై శీత రాత్రుల కెదురుచూచుచున్నారు.

---

## నలుబదియైదవ ప్రకరణము

## వాయువిమానము

కాలము గడచుచుండెనేగాని ఖైదీలస్థితియందేమియు మార్పు లేదు. సుల్తాన్ స్కైమిల్, గరన్ రాగ్ దుర్గమునకుగాని యాపరిసర ప్రాంతములకుగాని రాలేదు. ట్యూనారుఁడు శ్రోర్వాలునిచేగని పెట్టఁబడిన వాయువిమానము మూలముననగాని వేరువిధమున తనకా చెరనుండి విముక్తికలుగదని రూఢిగనమ్మియుండెను. ఆవిమానమునకై సమకూర్చబడిన పరికరములేవియు నాహారపదార్థములుగొనివచ్చు ఖయిదుకాపరులకంట బడకుండునట్లు దాచబడెను. ఒక్కొక్కప్పుడు అందరును నిద్రించుసమయమున నాపరికరముల నీవలకుదీసి శ్రోర్వాలుఁడు వాటియుపయోగమును ట్యూనారునకు బోధించుచుండెడివాఁడు. ఇంతలోననుకొనిన శీతరాత్రులుకూడ సమీపించెను. పగళ్లు తక్కువ రాత్రులు లావునుఆయెను. కాకసియనుపర్వతశిఖరములు మంచుతోగప్పబడుచుండెను.

శీతకాలమురాగనే శ్రోర్వాలుఁడు విమానమును త్వరలో పూర్తిచేసిసిద్ధముగనుంచ బూనుకొనెను. విమానము గాలియం

దిగురునపుడిటునటు ఒరగకుండనుంచుటకుకొన్ని బరువయిన రాళ్ళను కూడ సిద్ధముచేసెను. విమానము కావలసిన చోట దిగునట్లుచేయుటకు బరువగునవి వ్రేలాడగట్టవలెను. అట్టివానియుపయోగమునకై రాళ్ళున్నవి గాని వానిని వ్రేలవేయుటకు త్రాళ్ళులేకుండుటచే వారికికప్పుకొననిచ్చిన దుప్పట్లుచింపి సుడ్డపేలికలు త్రాళ్ళుగపేని సిద్ధముగనుండిరి. విమానముసిద్ధమయినది. డోర్వ్యాలుడు వాయుచలనముకొన్నాళ్ళుపరీక్షించి ట్యూనారునితో "ట్యూనార్! రేపు రాత్రి మనమెగిరిపోవలయు" ననెను.

చెరనుండి తప్పిపోదుమను నానందమున ట్యూనారుఁడు "రేపే!" యనెను.

ఆమరునాడు పగలంతయు ట్యూనారుడు డోర్వ్యాలు లొకరితో నొకరు మాటలాడుకొనలేదు. ట్యూనారుడేదైనో ఆలోచించుకొనుచుండెను. డోర్వ్యాలుఁడు వాయుచలనమును పరీక్షించుటయందు నిమగ్నుడాయెను.

చీకటులలముకొనెను. మామూలుప్రకారము జెయిలుకాపరి ఆహారపదార్థములగొనివచ్చి ఖైదీలవద్దనుంచి "ఈరాత్రిచీకటి గాఢముగనున్నది. చలికూడజాస్తి. జాగ్రత్త" నెను.

డో—అలాగునా? —— ఈగాఢాంధకారపురాత్రులును చలియుమిమ్ములనుగాని మమ్మేమియుజేయఁజాలవు. మేమొకమూల ముక్కినపేలువలె పడియుందుము. పైనున్నదెట్లున్ననూ మాకేమి మేము ఖైదుదాట వీలులేదుగదా.

ఖయిదుకాపరి—అయ్యా! నామాటలుమిమ్ములను చీకాకు పరచినవా? క్షమించుడు.

డో—లేదు. లేదు. నీవు మాయెడజూపినదయకు భగవంతుడు నిన్ను రక్షించుగాక!

అని వ్రాసి మందస్మితముతో దీవించెను. వాడును వాని సెలవుగైకొనిపోయెను. అంత డోర్వాలు ట్యూనారు లాహారముపద్ద కూర్చొనిరి. డోర్వాలుడు రెండుమూడు పిడచలతిని" ట్యూనార్! జయిలుకాపరి వట్టిఅమాయకుడుసుమా, నిన్ను భగవంతుడు రక్షించును గాక" యని యేలదీవించితినో వాడుగుర్తింపజాలకపోయెను—— పోనిమ్ము. మనప్రయత్నముల నమలులోనుంచుతరుణము సమీపించు చున్నది. జాగుసేయుట" యని హెచ్చరించెను.

ట్యూ—నేడు నేనానందసాగరమున మునిగితి.

డో—ట్యూనార్! నీహృదయమునందలి భయమంతరించెనా? ధైర్యముగనుండుము. మనకుజయము ——.

ట్యూ—నీకుధైర్యమేనా?

డో—మనప్రయత్నము జయప్రదముగ జరుగునని నేధైర్య ముగనున్నాను.

డోర్వాలుడు భోజనమునుముగించి గోపురోపరిభాగమునకేగి గాలివాటమును పరీక్షించుచుండెను. ఆకాశమంతయు తారువూచి నట్లుండెను. అదిచూచి సంతసించి "మనప్రయాణమునకనుకూలముగ చీకటియున్న" దని ట్యూనారునితో జెప్పవచ్చుచుండెను. ఈలోపున ట్యూనారుడు భోజనమునుముగించి ఆలోచనాపరుడై కూర్చొనెను. గాలివిమానమునుండి ఆకాశమార్గమునబోయిన నదియెక్కడపగిలి పోవునో తనప్రాణమున కేమియాపద సంభవించునో యని వాని భయము. ఇంతలో డోర్వాలుని శాంతిమూర్తి యాతనికెదురు వచ్చెను. దానితో నాతనిభయమంతయు మటుమాయమాయెను. అప్పుడే గులిస్తానులోయ జ్ఞాపకమువచ్చెను. అచ్చటి వజ్రపుగనులు, ఫలపుష్పభరితవృక్షములు, సౌందర్యజనకములగులోయలు, మృదు మధురగానముసేసికొనుచుబోయెడు సెలయేళ్ళు నాతనికన్నులకు

గట్టినట్లయ్యెను. అంత బచ్చునవర కీకారాగారక్లేశములనొందుట కంటె సాహసించి బయలుదేరి మారామణీయకమగులోయను గని వానిజన్మము వృథాయనుకొనెను.

వెంటనే ట్యూనారుడ్ డోర్వాలులిరువురును విమానముసిద్ధము చేసికొనుటకు పూనుకొనిరి. డోర్వాలుడు "ట్యూనార్ ! అన్నియు ననుకూలముగనున్నవి. జాగుసేయక మనవిమానము గోపురోపరిభాగమునకు జేర్చుకొనవలెను. అట బుంగనుసారా యావిరితోపూరించి మనముకూర్చొనుటకు మంచము దానికికట్ట వలెను. పిమ్మట నదియెగురుచుండినట్లు ఒరగకుండ రాళ్ళను కట్టుకొనవలెను. అదియెగిరినపిమ్మట భారమును తగ్గించుకొనుటకు కొన్నిరాళ్లు తోసివేయవచ్చు" ననెను.

ఆమాటలు డోర్వాలుని నోటవెలువడినంతనే ట్యూనారుడు రాళ్లు, సారాపీపా, మంచము, తాళ్ళునొక్క-పర్యాయమే గోపురో పరిభాగమున సిద్ధముచేసివచ్చి బుంగగకట్టబడిన జెండాగుడ్డను డోర్వాలుని సహాయమున తీసుకొనిపోయెను.

అచ్చట దానికమర్పబడవలసినవన్నియు డోర్వాలుడమర్చెను. పిమ్మట నిరువురునుగూడి సారాయమును వేడిచేసి యావిరితోబుంగ పూరించిరి. మరియేమున్నది? ఆఖయిదునుండి వారినితప్పించుటకు విమానము సిద్ధమాయెను. డోర్వాలుడు "విమానమిక నెగురగలదు. నీవు దానిమంచము లోనికిపోయి కూర్చొని "మమ్ములసుఖముగ వేరొకతావున జేర్చుమని దైవమునుప్రార్థించు" మని తానును నందు కూర్చొనెను. తక్షణమే విమానము డోర్వాలు ట్యూనారుల మోసి కొని యంధకారబంధురమగు నాకాశమార్గమున కెగసెను. అపుడు డోర్వాలుడు "కొన్నిరాళ్ళనుతోసివేసినబరువుతగ్గి తేలికగావిమాన మెగురు" నని ట్యూనారునకుజెప్పెను. ట్యూనారుడు కొన్నిరాళ్ళను

త్రోసివేయ వని గోపురోపరిభాగమునను తలవాకిలయందునుబడి భయంకరనాదముచేసి గరన్‌రాగ్‌దుర్గకాపరు లలజడిపడునట్లుచేసి నవి. ట్యూనారు ఫ్రోర్వాలు లాకాశపథమున ఖైదువిముక్తులైరి.

---

## నలుబదియారవ ప్రకరణము

## వాయుసంచారులు

ఆధ్వని గరన్‌రాగ్‌దుర్గమునందలి భటులగుండె లవియునట్లు చేసెను. వారుదిగ్గునలేచి గోపురముక్రుంగిపడి లోనిఖైదీలు మరణించిరేమోయని రవ్వునపోయి జయిలుతలుపులు తెరచిచూచి ఖైదీలు మాయమగుట కచ్చెరువడి గోపురోపరిభాగమున కేగిరి. అచ్చట ఫ్రోర్వాలునకాసనముగ నొసగిన పీపామాత్రముండెను. ఖైదీలు ఏమయిరి? అచ్చటి జెండాత్రాడుకూడ కానరానందున వారాత్రాడు మూలమున క్రిందకు జారిపోయిరని యూహించిరి. దానితో వారజాగ్రత్తగ గోపురము కాచుచున్నారని సుల్తానుకు తెలిసిన నేమి యాపదసంభవించునోయని భటులందరును ఖైదీలకై వెదుకసాగిరి. కొందరు దివిటీలతో దుర్గమంతయు వెదుకసాగిరి. కొందరశ్వారూఢులై బయలుదేరిరి కాని పాపము ఖైదీలంతరిక్షమార్గమున పారిపోవుచున్నారని తెలిసికొనరైరి.

విమానమాకాశపథమున మహావేగమునబోవుచుండెను. అట్లు పోవుచుండ సూర్యోదయమాయెను. భూనభోంతరాళమందలమికొన్న చీకటిపటాపంచలాయెను. గాలి విజృంభింపసాగెను. ఆగాలికి విమానమించుక యూగసాగినది. ఆయూగుడువలన భయమంది ట్యూనా

కుఁడు విమానపుత్రాళ్ళను బిగియబట్టికొనికూర్చొనెను. డోర్వాలుడు వానిభయముగనిపెట్టి ట్యూనార్ ! మనప్రయత్నము ప్రమాదకరమయినది. భయమందకుము. దైవమురక్షింపగలడు” అనిధైర్యము జెప్పెను.

డో—ట్యూనార్ ! క్రిందగానవచ్చు కాకసియనుపర్వతములు జూడుము. గులిస్తానులోయనుజుట్టియున్న పర్వతములో పెద్దపర్వతము శిఖరమున చీలియుండునంటివే. అగుర్తు జాగ్రత్తగజూడుమా.

ట్యూ—చూచుచున్నాను.

డో—నాలెక్కనుబట్టి యింకను మనమాకొండను దాటిపోలేదనినమ్మిక. ఇంకను ఆకొండలుముందేయున్నవి. మనవిమానపు శక్తితగ్గి క్రిందకుమెల్లగదిగుచున్నది.

ట్యూ—(చూచి) అదిగో పగిలినకొండశిఖరము. అల్లదే గులిస్తానులోయగలప్రదేశము.

డో—(అటుచూచి) అదేపగిలినకొండ — కాని మనవిమానమంతవరకేగునని నమ్మను. ఆకొండలదగ్గర మనవిమానము నేల దిగును.

ట్యూ—మనము గులిస్తానులోయలో సమానముగదిగలేమా? అదె పగిలినకొండ ! — చూడుము గులిస్తానులోయద్వారముకడనే దిగుదుముకాబోలు.

డో—అట్లుకాదుగాని ఆలోయనుచుట్టియున్న పర్వతములవద్ద దిగుదము. వాటినెక్కజాలము. పోనీ యెక్కప్రయత్నింపబూనితిమా పాదములవద్దనే ఒకయగాధముండుననుకొందును. అపుడెట్లు? మీదికెక్కజాలక క్రిందకుదిగలేకమాడిపోదుము.

ట్యూ—పోనీగుహావెంబడి పోదమన్న పామొకటియడ్డముగనున్నది.

డా—ట్యూనార్ ! ఈవిధముగ నాలోచించుట కష్టమను కొని మనముకృశించుటకంటె భగవంతునిధ్యానించుట యుత్తమము. ప్రమాదకరమగు మనయుద్యమమునందు సహాయుడయిన యాపరమాత్ముడిపుడేల సహాయపడడు?

ఇపుడు విమానము భూమికిమైలుదూరమున నెగురుచున్నది. క్రిందనొక భయంకరాగాధముగలదు. అందుండి యొకసెలయేరు బోరుమని పారుచున్నది. కొండలన్నియు మంచుతోగప్పఁబడెను. ఆప్రదేశములన్నియుదాటి విమానమొక పచ్చికబయలున ఆవిరి పోగాదిగెను. ట్యూనారుడోర్వాలు లేయాపదయునులేక నేలదిగిరి.

ట్యూ—డోర్వాల్ ! మనమించుకకష్టపడి యావలయాకారముగనున్న పర్వతముల సమీపించితిమా కావలసినన్ని ఫలవృక్షములు.

డా—ట్యూనార్! గులిస్తానులోయయింకెంతదూరముండును?

ట్యూ—అదియేమోగాని దానిజేరుట కొకగుహగలదు. ఆ గుహ రెండుగంటలలోచేరగలము. తరువాత —

డా—తరువాత యెట్టికష్టములకైననోర్చి యాలోయజేరవలెను. పిమ్మట ఆవిషసర్పముమాట నాలోచింతము. పద.

---

## నలుబదియేడవప్రకరణము

## గుహ

కొండదారులన్నియు మొదట ట్యూనారుడు చూచినవాడగుటచే జాగ్రత్తగ డోర్వాలును గులిస్తానులోయకు మార్గమగు గుహవద్దకుగొనిపోయెను. ఆగుహసమీపింపగనే పాముభయముచే ట్యూనారుడందు ప్రవేశింపజంకెను. అదిచూచి డోర్వాలుడు "ట్యూనార్! నావంటి ముసలివాడే ధైర్యముగలిగియుండ నవయవ్వనుడవగు నీవేల్లయింతపిరికివయ్యెద" వనెను.

"భయము జనించుచున్న"దని ట్యూనారుడు ధైర్యము దెచ్చికొని గుహకూటిలోని ప్రమిదనువెలిగించి గాఢాంధకారమగు లోయలోనికి దృష్టులనిగుడ్చుచు నిలచిపోయెను. డోర్వాలుడాతనికి భయము పోకుండుటచే "ట్యూనార్! నిజము నిందు విషసర్పమే యున్నచో నేనేముందు దానిని తాకెదను. రమ్ము"అని ముందడుగిడెను.

ట్యూనారుడావాక్యములతో ధైర్యచేతస్కుడై దీపముపట్టుకొని "స్నేహితుడా! వలదు. నేనేముందునడచెదను." అని గుహలోనికి ప్రవేశించెను. ఆవెనుక డోర్వాలుడుబయలుదేరెను. ఇరువురు నాగుహయందు రమారమి రెండువందలగజములుపోగా గుహసన్నమై యొకచోట ట్యూనారునకేదియోగనవచ్చి "డోర్వాల్! నీకేమయిన కనబడుచున్నదా?" యనెను. "ఒకరాతివిగ్రహము. అదుదావివలెనున్నది. అవిగ్రహము ఈవ్ (Eve) దయియుండును, అక్కడే సర్పమదిగో!" అనె డోర్వాలుడు.

ట్యూనారుడు గడగడవడకి "ఆఁ!" అనెను.

"ఆబొమ్మయెట్టిదో పామునట్టిదే. భయపడకు"

ఆవిగ్రహము మనజాతికి మాతయగు ఈవ్ (Eve)ది. అది యొకదిమ్మపై నమర్చబడెను. దానిచుట్టును పాము చుట్టుకొనిపడగ నెత్తి ఈవ్‌తో మాటలాడుచున్నదో యనునట్లు చేయఁబడెను. తడవి చూచిన చల్లగనున్నది, మొదట ట్యూనారు డీగుహాప్రవేశించి యాపామునుతడవి చల్లగనుండుట నిజముగుపామేనని భయమంది యీవలకు పారివచ్చెను. డోర్వాలు డావిగ్రహముకడకూర్చొని పరీక్షించుచుండ ట్యూనారుఁడు "డోర్వాల్! అదిచూచుచు కూర్చొనిన ఫలమేమి? గులిస్తానులోయ జేరుట కిట నెద్దియేని రహస్యమార్గమున్నదేమో చూడవలెనుగాన" నెను.

డో—ఓరిమి యుండవలెనని యెన్నిమారులు చెప్పవలె.

ట్యూ—క్షమింపుము.

డో—ట్యూనార్! నేనీవిగ్రహముకడ వెఱ్ఱివాడనై కూర్చొనలేదు. ఈ విగ్రహమిచ్చట నుంచుట కేదియో కారణముండునని చూచుచున్నాను.

ట్యూ—విగ్రహము.

డో—తొందరవలదు. దీనిరహస్యము గన్గొన ప్రయత్నించుచున్నాను. రహస్యము తెలిసినదా గులిస్తానులోయ మనసొమ్ము.

ట్యూ—అట్లే గానిమ్ము.

ట్యూనారుఁడు దీపమును విగ్రహ మమర్పఁబడిన దిమ్మపై నుంచి, ద్వార మెటనయిననుండునేమోయని చూచుచుండ నాదిమ్మ ముందుభాగము తటాలున తెరువబడి యొక నల్లని స్త్రీ యీవలకు వచ్చి "అన్యులు! అన్యులు!" అని గట్టిగ నరచి దీపపు కాంతిని ట్యూనారునిపోల్చి "ట్యూనార్! ఇట కేలవస్తివి?" అని గర్జించెను. ట్యూనారుడామెను గుర్తించి "క్లోడిస్సా" అని గట్టిగ కేక వేసి వణకెను.

రెప్పపాటుకాలములో క్లోడిస్సా మొలనున్న కఠారిని దీసి ట్యూనారుని హృదయము భేదింపనురికెను. ట్యూనారుడు కోపించి ధైర్యముగ నామె చేతిలోని కఠారి నందుకొని గుండెలలో గుచ్చి ఆమె యేడ్చుచు నేలబడ, నా తెరువబడిన ద్వారములోని కాతడు మాయమాయెను. వెంటనే ద్వారము మూయుబడెను.

ఆ దృశ్యమును జూచి డోర్వాలు డాశ్చర్యమునొందెను. ఏడ్చుచు పడియున్న క్లోడిస్సాను సమీపించి ఆమె గుండెలలోని కత్తి నూడబెరికెను. రక్తమామె హృదయమునుండి కాలువగట్టు చుండెను. రవిక బిగువుగనుండుటచే రక్తము దుడుచుటకువీలులేదా యెను. డోర్వాలు డారవికను చించిపారవైచెను. క్లోడిస్సా తెల్వి తప్పెను.

ఆమె రవికను జింపి గాయము నొత్తుచుండ డోర్వాలున కాశ్చర్యము జనించెను. ఏలన? నామె ముఖము నల్లగనున్నది. రవిక చింపివేయుగా నా ప్రదేశమంతయు చంద్రకాంతశిలవలె శోభాయమానముగ నుండెను—ఆమె నల్లనిదా? తెల్లనిదా? అని యాతని కాశ్చర్యము గలిగెను.

---

## సలుబడియెనిమిదవ ప్రకరణము

# సుల్తాను వ్యాధి

చదువరులారా! మన కథాభాగమిపుడు 1853 సంవత్సరపు యెండకాలమునకు సమీపించినది. అపుడు రష్యాటర్కీలకు ఘోర మగు సంగ్రామము డాన్యూబునదీతీరమున జరుగుచున్నది.

ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశములు టర్కీకి సహాయముచేయ నిష్టులయి యున్నను యుద్ధమునందింకను పాల్గొనలేదు. సుల్తాన్ సేనానాయకుడు ఒమర్ పాషా, ఓల్టనీజావద్ద రష్యనుల నోడించి వారి వశమయిన తురుష్క రాజ్యముల స్వాధీనము చేసికొనెను. ఆతని జయమున కైరోపాఖండమంతయు సంతోషించెను.

అట్టి సమయమున సుల్తాన్ అబ్దుల్ మజీదు జబ్బుతో నుండెను. ఆతడు ముప్పదేండ్ల యువకుడు. అంత చిన్నతనముననే రాజ్యభారము మీదబడుట, యుద్ధములు సమీపించుటయు మొదలగు వాని వలన విశ్రాంతిలేక యీ సంవత్సరాంతమున నాతడొక భయంకరమగు వ్యాధికి లోనయ్యెను. ఆ జాడ్యములో నాతడు మరణించునేమోయని రాజమాతతల్లడమందసాగెను. రాజవైద్యులెందరును మందులిచ్చిరి గాని లాభము లేదాయెను. ఆ కారణమున రాజమాత నిరాశజెంది కృశించుచుండెను. కుమారుడు తన కండ్లయెదుట మరణించునేమోయని యామె యేడ్చుచుండ కోడలు తాక్షానా సమీపించి "మీతో నొకసంగతి జెప్పవచ్చితిని. ఏడ్చిన ఫలమేమ" నెను.

సుల్తానుతల్లి లేచి యేమియో యనబోయెను గాని దుఃఖాతిశయమామె నోరు కదుపనిచ్చినదిగాదు.

తా—సుల్తాను మరణించునని దుఃఖించినలాభ మేమి?

సు॥త—మనవైద్యులు మందులిచ్చిరిగాని లాభములేకున్న యేమిచేయుదును.

తా—నామనవి వినిన నొకటి చెప్పెదను. దానివలన లాభము కలుగును.

సు॥త—చెప్పుము.

తా—తమరిదివరకు చెరయందుంచిన స్త్రీ......

సు॥త—ఆఁ—జ్ఞాపకమువచ్చెను తెస్లా.

తా—అవును. తమరు మరచితిరనుకొంటిని.

సు॥త—లేదు. ఆమె దుర్మార్గురాలని వైద్యులు చెప్పుటచే ఖయిదునందుంచితిమి. ఆమె రంజానుత్సవమున నా కుమారునకు భార్యగ నెన్నుకొనబడిన కాంతను పారిపోవునట్లుచేసెను. ఆమె చనిపోయినదికదూ తైలా.

తా—లేదు. ఇటనుండి తప్పుకొనుటకామె తెస్లాసహాయ మర్థించెను. ఆమె యామెను తనమందులబలముచే చనిపోవునట్లు చేసి తప్పించెనుగాని ఆమెబ్రతికి——

సు॥త—తైలాబ్రతికియున్నదా?

తా—ఆఁ — తెస్లా జగద్విఖ్యాతిగాంచిన అహమ్మద్ ఆర్లాన్ కుమారి. ఆమహనీయుని అద్భుతమేధాశక్తి మీరెరింగినదే గదా.

సు॥త—తెలియును. మనవైద్యులు తెస్లా దుర్మార్గురాలని నుడువుటచే నామెను బంధించితిని.

తా—ఆమె వైద్యమునందసమానమగుచేయి.

సు॥త—అట్లయిన నామె మాకుమారుని రుజనుపోగొట్టగల దేమో? తెలిసికొందము. —— ఆగా !

కిల్సర్ ఆగా—చిత్తము ! హుజూర్ !!

సు॥త—తెస్లాకు చెరయందుక్షేమమా ?

కి॥ఆ—చిత్తము.

సు॥త—ఇపుడునీవేగి యామెను మాసన్నిధికి గొనిరమ్ము.

కిల్సర్ పోయి తెస్లానామెసన్నిధికిగొనివచ్చెను.

సు॥త—కాంతా ! మేము నీయెడజూపిన క్రౌర్యమునకు క్షమించుచున్నాము.

తె—అమ్మా! నామందులపెట్టెచోరికి నేబట్టుపడిన వెనుక నొకమందునుగూర్చి తెలియజేయ నెంచిన నన్ను చెరనుంచిరి.

సు॥త—అదియేమి? ఆమందుప్రభావము?

తె—నావద్ద నొకమందుగలదు. దానితో నెట్టిజాడ్యమైన కుదురును. అట్లుపోనిచో నన్ను బోస్ఫరస్ నదియందు పారవేసి చంపుడు. అందు నేజయమందితినా నాకు ధనధాన్యములొసంగక పోయినగవిడచిన జాలును.

సు॥త—అట్లయిన నామందు నుపయోగించుము.

తె—నేదుర్మార్గురాలనని మీయభిప్రాయము. అందువలన నామందుప్రభావమును నమ్మెదరో లేదో.

సు॥త—అదిమావైద్యులన మేమునమ్మితిమి.

తె—నామందులయుపయోగము వారికేమెరుక.

సు॥త—ఒప్పుకొంటిమి. నీమందుప్రభావమునుజూపుము.

తె—సుల్తాను నొకజాడ్యము పట్టినదనివింటిని. అది బాగు చేయుశలవా?

సు॥త—రూఢిగ జెప్పగలవా?

తె—మీరునమ్మవలెను.

సు॥త—నమ్మెదనుగాని —

తె—తల్లీ! నాకుసుల్తాను శత్రుడుగాడు. నేనాతనిజాడ్యము గుదుర్పగలను! నిజము.

సు॥త—నాకట్టి యపనమ్మకము లేదు. ఏమిగావలయునో చెప్పుము.

తె—నామందులపెట్టెనిప్పించి మీవైద్యుల రప్పింపుడు.

సు॥త—అట్లేచేయించెదము.

కిల్సర్ ఆగాపోయి తెక్లామందులపెట్టెతో వైద్యులలో పెద్ద వానిని గొనివచ్చెను.

వై—అమ్మా! ప్రభువారు నిద్రించుటచే రెండవవాడట నున్నాడు.

సు॥త—తెక్లా! ఇద్దరువైద్యులుండవలెనా ?

తె—ఈతడుచాలును, నామందుప్రభావముచూపుదును.

తెక్లా యచ్చట కిల్సర్ ఆగాయుంచిన తనమందులపెట్టెనందికొని యమందానందమునొందెను.

---

## నలుబదితొమ్మిదవప్రకరణము

## పింగాణిగిన్నె

రాజవైద్యుడు తెక్లామందుపరీక్షచూచుటయందయిష్టుడైనను సుల్తానుతల్లియెదుట యిష్టముగనుండినట్లుండక తప్పినదికాదు. సుల్తాన్ తల్లియు తార్ఖానాయును తెక్లాచేయుమందు పరీక్షచూడ కుతూహలులై యుండిరి. సుల్తానారోగ్యమే సర్వదాకోరువాడగుటచే కిల్సర్ ఆగాకూడా తెక్లామందుప్రభావమును గమనించుచుండెను.

తెక్లా మందులపెట్టెదెరచి యందుండి కాఫీకప్పుకంటెనించుక పెద్దదగు గాజుగిన్నెతీసి మెత్తగుబల్లపై నునిచినది. ఆగిన్నెచుట్టును లతలును, పూవులును, రంగులతో చిత్రింపఁబడియున్నవి.

తెక్లా—మహారాజ్ఞీ! ఈగాజుగిన్నెపై జిత్రితములయిన లతలుమొదలగువానిని చిత్తగింపుము. ఈనీలిరంగు చూడుము.

బంగారపుఛాయగల యీపసుపురంగుచూడుము. ఈయాకుపచ్చ రంగుగాంచుము. మరియు మహారాజ్ఞీ! గాజుగిన్నె యెంతస్వచ్ఛముగ నున్నదో తిలకింపుము.

సు॥త—చూచితిమి.

తె—మహారాజ్ఞీ! ఇకనాపెట్టెనుండి మీయిష్టమువచ్చినవిషము బయటకుదీయుడు. విషమనిన భయమందకుడు. విషములుచాలజబ్బుల కుపయోగించిన హానికరము. ఆసంగతి వైద్యునకుకూడ తెలియును.

సు॥త—అవును.

రాజవైద్యుడు— (మందులపెట్టెనుండి తెల్లనిగుండగలసీసా దీసి) ఇది యేమయిననేమి. దీనిమాహాత్మ్యమునుజూపుము.

తెక్లా యాసీసానందుకొని కొంతగుండ గాజుగిన్నెలోపోసి దగ్గరనే వేరొకబల్లపైనున్న గాజుపాత్రమునుండి నీటిని కొంత యందుపోసి కదిపి "మహారాజ్ఞీ! ఇదియొక ప్రాణములదీయు విషము. గాజుగిన్నెను గుర్తింపుడనెను. అందరు నాగిన్నెపై రంగులు చూచుచుండగనే మాడిపోయినవి. గిన్నె యస్వచ్ఛమాయెను. సుల్తానమ్మ, తాఖానా, రాజవైద్యులిది కనికట్టేమోనని యొక పర్యాయము కన్నులుతుడుచుకొనిచూచిరి. కిల్నర్ ఆగా ఆశ్చర్య ముతో నోరుతెరచుకొని నిలచిపోయెను.

తెక్లా "యిక దానవిరుగుడు గుర్తింపు"డని యందలిమందు నీటిని వేరొకగిన్నెలోనొంపి బల్లపైనుంచెను. అందరు నాగిన్నె వంకనే జూడసాగిరి. మారిపోయినరంగులన్నియు యథాప్రకారము ప్రకాశించెను. గాజుగిన్నెస్వచ్ఛమాయెను.

సు॥త—ఆహా! ఏమీఅద్భుతము తెక్లా!

తా— తెక్లామందులప్రభావము నాకానందము నద్భుతమును గలుగజేయుచున్నవి.

కి॥ఆగా—మహారాజ్ఞీ ! ఈయమగొప్పది.

రా॥వై—నీమందులపెట్టెలో స్ట్రిచినైన్ (మరణమూపాదించు విషము) మొదలగువిషములున్నవా? వాటిసంగతి నీకు తెలియునా ?

తె—నావద్దలేవు. నీవద్దనున్నవా ?

రా॥వై—ఉన్నవి.

తె—అట్లయిన వాటినుపయోగించి నేజేసినట్లుచేయుము.

రాజవైద్యుడు తనమందులపెట్టితెచ్చి తెక్లావలె గాజు గిన్నెపై పూవులరంగులజార్చనెంచి విఫలమనోరథుఁడై తెక్లాయెడ మచ్చరమున "మహారాజ్ఞీ! ఈమెగారడివిద్యచేయు స్త్రీవలెనున్నది. లేకున్న నావద్ద మందులవలన నాగాజుగిన్నెపై పుష్పములరంగును మారడలేదు. ఈమెను నమ్మకు" డనెను.

సు॥త—ఓరీ ! మాటలాడక నీవిటనుండిపొమ్ము. ఇది నాయాజ్ఞ. తెక్లా! సుల్తానునకు మందుచేయుటకు నీకేమికావలయునో చెప్పుము.

తె—ఏమియువలదు. మీాదోటలోనికి పోననుజ్ఞయిచ్చిన కొన్ని మూలికలుతీసికొని రేపుమధ్యాహ్నమున కౌషధము తెచ్చెదను.

సు॥త—కిల్సర్ ! ఈమెమందులపెట్టెపట్టుకొని, యీామెను మాపూదోటలోనికి తీసుకొనివెళ్ళుము.

---

## ఏబదియవప్రకరణము

మరునాడు మధ్యాహ్నమిరువురు బానిసలనంపి తెక్లానౌషధ ముతోఁగొనిరమ్మని సుల్తానుతల్లిపంపెను. వారుపోయి తెక్లాను సుల్తానమ్మగారి యాజ్ఞయయినదిరమ్మనిరి. తెక్లావారికొకసీసాతో నౌషధమునిచ్చి పంపి తాను వెనుకనే వచ్చెదననెను. వారామందుగొని పోయి, జ్వరాభరముచే కృశించి మంచముపట్టిన సుల్తాన్ అబ్దుల్ మజీజ్ వద్ద ఖిన్నురాలై కూర్చొనియున్నతల్లి కాయౌషధమునిచ్చిరి. ఇంతలో తెక్లాకూడ నటకరుదేగా సుల్తానుతల్లి యామెనుజూచి "యిదియేనా యౌషధ"మని ప్రశ్నించెను.

తె—చిత్తము.

సు॥త—తెక్లా! నిన్నిదివరకు మేమునిందించితిమని యేమియు ననుకొనకుము ఇదిగో — ఈతఁడు నాకుమారుఁడు. అట్టోమను చక్రవర్తి. ఏడుగడ! రాజవైద్యులనుకూడ తృణీకరించి నీవు గొప్ప దానవనినమ్మి నీ మందునిచ్చుచున్నాము. దీనితో నాకుమారుఁడు బ్రతికెనా మహానందము. నీవు నాకు పుత్రదానము జేసితివని చెప్పి కొందును. — లేక యీమందువలన నాతడుమరణించెనా, ప్రజలు నిన్నునిందించి తిరుగుబాటుచేయుదురు. నిజమేనా?

తె—నిజము.

సు॥త—నేనిట్లు నిక్కచ్చిగ చెప్పుచున్నానని చీకాకుపడకుము. నాకుమారుడిడుగో — నీవిచ్చుమందును నిదిగో. దీనిప్రభావమున నాకుమారుడుజీవించిన నిన్ను ధనకనకవస్తువాహనాదులతో నెక్కువగా బహూకరించెదనని చెప్పుచు తనపుత్రున కా తెక్లాయొసంగిన మందునిచ్చెను. ఆమందుప్రభావమేమోకాని యదియొసంగిన కొలది

కాలమునసే నాతడు రోగనివారణంబై యారోగ్యవంతుడాయెను. త్రెబ్లా ! నీమూలమునగదా, నాకుమారుడు రోగవిముక్తుడాయెను. నీకేమి కావలయునో కోరుకొనుము ?

త్రె—నీకుమారుడు రోగవిముక్తుడగుటయేచాలును. నాకుబహు మానము లవసరము లేదు.

సు॥త—త్రెబ్లా ! సంతోషపూర్వకముగ నాబహుమాన మందికొనవా?

త్రె—వలదు. నాపరివ్రాజక జీవనమువలనసే విచారము బాయునుగానినాకీధనము లేల? ఏరికొరకు? నాకుస్వేచ్ఛయేముఖ్యము

సు॥త—నీకువిచారమేల ?

త్రె—నావిచారమునుగూర్చి యొకకథ కలదు. చెప్పెదనాలిం పుడు. మహారాజ్ఞీ! నేను జగద్విఖ్యాతిగాంచిన అహమ్మద్ ఆర్స్లామ్ కుమార్తెను. నాతండ్రికి బోస్ఫరస్ నదియొడ్డున నొకచక్కని సౌధ ముండెడిది. నాతల్లిచిన్నతనమునసే మరణించుటచే నాతండ్రిబానిసల చేతులలో నేపెరిగితిని. ఇపుడు నాకు నలుబదియయిదు సంవత్సరముల వయసు. నేచెప్పుచున్నకథ యిరువదియేడుసంవత్సరములక్రిందట జరిగినది. అప్పుడు నాకు పదునేడుసంవత్సరములవయసు. ఆవయసు న నేనొకనిప్రేమించితిని. ఆతఁడు మిక్కిలియందమయినవాడు. వాని యాకృతినిబట్టి యాతడొకపెద్దరాజోద్యోగియనియూహించివానితో కలసి బోస్ఫరస్నదీతీరమునగల తోటలలో ప్రేమపాఠములజదివితిని. ఆతనినమ్మితిని ! మనప్రేమవృత్తాంతము నీతండ్రికి చెప్పకుమా” యని యాతడనెను. వానిపై మోహాంధురాలనై తిని. అట్లు కొంత కాలమాతనితో రహస్యముగతిరుగ నేగర్భవతినైతిని. క్రమముగ నాప్రియుడు నన్ను విడచెను. ఆతనియెడ మోహాతిరేకమున కని ష్ఠాంబనోపిలువచ్చి మోహమయినజూచిన కొంతయానందమని వెద

కుచు నిలుచుంటిని. కొన్నిశబ్దములు వినవచ్చెను. రాజభటులాయుధపాణులై ప్రజాసముదాయము నిటునటుత్రోసి దారిచేయుచుండ నచ్చట వారినడిగి సుల్తాన్ మహమ్మదు సులేమాన్ మసీదునకు పోవచ్చుచున్నట్లు చెప్పిరి. నేనును, నాప్రియుడు రాజోద్యోగులలో గానవచ్చునేమో ముఖమయిన జూతమనినిలచితిని. ఇంతలో నాకన్నెరికము వాడుచేసినదుష్టుడు ప్రేయసిని మోసగించినద్రోహి గానవచ్చెను.

సు॥త—ఆతఁడెవఁడు?

తె—మరెవడు? సుల్తాన్ మహమ్మదే!!

సు॥త—నిజము ?

తె—నిజమే. ఆతనికుమారునిజీవనమే నేనీదినమున రక్షించితిని.

సు॥త—తరువాత ? సుల్తాన్ మహమ్మదు నిన్నుపోల్చెనా ?

తె—పోల్చి "మామూలుగ మనముకలసేచోట రేపుకలసికొండ"మని సేవకునిచే కబురంపెను. మరునాడు తప్పక నన్నుకలసికొని తనజనానాకురమ్మనికోరెను. జనానాయందుండుటయు సూర్యరశ్మి నెరుగనిబానిసత్వము. అందులకు నేనిచ్చగించలేదు. అంత మేమిరుపురము విడిపోతిమి. మరికలసికొనలేదు. నేచేసినదుర్నీతి నాతండ్రిభరింపజాలక పొలములో చేనుకోయుచు పీకకోసికొని మరణించెను. ఆవెనుక నాకొక స్త్రీ శిశువుజన్మించి చనిపోయెను. దానితో నాకీజీవితమునందసహ్యముజనించి నాతండ్రివైద్యగ్రంథమొకటితీసికొని తక్కిన యావదాస్తియు బీదలకుపంచిపెట్టి దేశద్రిమ్మరినై పరోపకారమునందే నాజీవిత ముపయోగించుచున్నాను, నేనితరులబాధలనుమాన్పి బహుమానము స్వీకరింపను,

సు॥త—అయ్యో! తెక్లా! ఎంతనిర్భాగ్యురాలవు. నీకన్నెరికము పాడుచేసిన వానికుమారునే నేడుమృత్యుహస్తములనుండి కాపాడితివి.

తె—ఇపుడు నీకుమారుడారోగ్యవంతుడు. ఇకముందట్టిదేమయినవచ్చిన యీమందుతో కాపాడుకొనుము (అని యొకసీసాతో మందునిచ్చెను.) ఇకనాగాజుగిన్నె నిచ్చివేయుము. పోయెదను.

సు॥త—బహుమానము వలదనినచో నీమణిహారము నా జ్ఞాపకార్థము నీవద్దనుంచుము. (అనితీయబోవును)

తె—వలదు. వలదు. నాస్వేచ్ఛనాకుసౌఖ్యము. పోయెదను. శలవా?

సు॥త—స్వతంత్రురాలవు వేరేమాశలవేల ?

తెక్లా గాజుగిన్నె మందులపెట్టెలోనుంచుకొని సుల్తానుతల్లి మొదలగువారికడ సెలవుగొని తనదారినరిగెను.

---

ఏబదియొకటవ ప్రకరణము

## క్యుటాయిస్

తెక్లా కనిస్టాంటునోపిలు వదలి మూడువారము లయిన వెనుక, మింగ్రేలియా ముఖ్యపట్టణమగు క్యుటాయిసు చేరి మహారాజ్ఞి లైలా కోటయందున్నట్లు తెలిసికొని ఆమె దర్శనమునకు బోవలయునని యెంచెను.

క్యుటాయిసు దుర్గము చాల సుందరమయినది. దుర్గములోనికి ప్రవేశించు సింహద్వారముల కిరుప్రక్కల సైనికులగృహములు

గలవు. అందొక ప్రక్క రష్యను సేనలు. రెండవ ప్రక్క మింగ్రేలియా సేనలునుగలవు. మింగ్రేలియా రష్యనులు జయించిరని యిదివరకే చెప్పితిమి. వారు మింగ్రేలియా జయించినామ కా మింగ్రేలియా రాజకుమారి త్రైలాను సింహాసన మెక్కించి, రాజ్యభారమంతయు తామే వహించి యున్నారు. మింగ్రేలియా యెపుడయిన తిరుగబడు నేమోయని రాజ్య మందెల్లెడల తమ సేనల నుంచుకొనిరి.

తెక్లా త్రైలాను చూచుటకై కోట సమీపించి యచ్చటి సిపాయిలకు తనపేరు చెప్పి త్రైలామహారాజ్ఞి దర్శనార్థమై వచ్చితినని చెప్ప వారామెకు సలాము గావించి లోనికి విడచిరి. తెక్లా లోపలి ద్వారము లన్నియు దాటిపోగా త్రైలా చెలికత్తెలగు జైదాయమీనా లామె రాకకు సంతసించి, త్రైలాయున్న మహలునకు గొనిపోయిరి. త్రైలా తెక్లానుజూచి యమందానందమున కౌగలించుకొని యొక యున్నతాసన మలంకరింపజూపెను. పిమ్మట జైదాయమీనా లావలి కరిగిరి.

త్రైలా యడుగు ప్రశ్నలకు తగు జబాబుల నొసగినవెనుక తెక్లా—మహారాజ్ఞీ! డానియలు యిప్పుడెచ్చట నున్నాడు?—ఆతఁడు సెంటుపీటర్సుబర్గు కోటలో యెటకో ఖయిదీగా గొంపోయినట్లు విన్నాను నిజమా?

త్రై—చెప్పెదనుగాని క్లోడిస్సా—

తె—క్లోడిస్సా!! ఏమి?

త్రై—నేనును డానియలును టిప్లిన్ దాటినవెనుక నామెను గన్గొనలేదు (గులిస్తానులోయమాట చెప్పలేదు)

తె—డానియలు సంగతి?

త్రై—డానియలు మింగ్రేలియా సింహాసనార్హుడయినట్లు తన పెంపుడు తండ్రియగు కార్సుపాషానుండి నిదర్శనములతో

ష్యటాయిను వచ్చెను. పేరునకే నేను రాణినని నీకు చెప్పవలదు గదా. రష్యను సేనానాయకునితో నేను డానియలును ప్రేమించితి ననియు, నాతడు మింగ్రేలియా రాజవంశీయుడేయనియు, నావంతున నాతని మింగ్రేలియాకు ప్రభువునుచేయుమనియు నంటిని. ఆతఁడు, డానియలును, సెంటుపీటర్సుబర్గు పోయి జారు యనుమతి లేని దే మింగ్రేలియాలో నడుగు పెట్టరాదని కఠినముగ శాసించెను.

తె—రష్యను పరిపాలకులు, రాజవంశీయుడు దేశమందుం డిన ముప్పు చేకూరునని యట్లు చేసిరి.

లై—డానియలు ప్రజల వశము చేసికొని యుద్ధమునకు సిద్ధ పడి దేశమునం దశాంతి నెలకొల్పుట కంటె పీటర్సుబర్గు పోయి జారు (రష్యాచక్రవర్తి)తో మాటలాడివచ్చుట మంచిదని యను చరులతో నటకరిగెను.

తె—అచ్చట డానియలు సౌఖ్యమా?

లై—అచ్చట డానియలు నికలస్ చక్రవర్తిచే సన్మానింప బడెను. నికలస్ "డానియల్! మింగ్రేలియా రాజ్యమును చూచు చున్న మామంత్రిత్వరలో నీవారసత్వ హక్కులను పరిశీలించు" ననెను. తరువాత డానియలు మీరు దర్శనమునకై డానియ లడుగ నాతడు డానియలును తనయాస్థానమునం దుద్యోగిగ నుండుమనెను. ఆతడందుల కిచ్చగించలేదు. రష్యన్ ప్రభుత్వోద్యోగులు డానియలు వారసత్వహక్కులను పరిశీలించుటయం దాలసించుచున్నారు. డాని యలు వారితో పరిచయము చేసికొని నట్లును త్వరలో తనకు సహా యము చేయుదుమని వాగ్దత్తము చేసినట్లును తెలియుచున్నది.

తె—లైలా! దైవము సర్వరక్షకుడు. ఆతఁడు డానియలును మింగ్రేలియారాజను చేయుగాక. మీ ప్రేమలత పుష్పించుగాక!

అనితాను సెలవుగైకొనియెదననెను. త్రైలా యామెను పరివ్రాజక జీవనమునుమాని తనవద్దనుండుమని వేడెను గాని తెక్లా సమ్మతించక సెలవుగైకొని టిఫ్లిస్ చేరెను.

చదువరులారా! ఇఁకమనము డోర్వ్యాలు క్లోడిస్సాల జాతము

---

# ఏబదిరెండవప్రకరము

## క్లోడిస్సాడోర్వ్యాలుల

డోర్వ్యాలుఁడు తెల్వితప్పియున్న క్లోడిస్సాశరీరమును చూచి చకితుఁడాయెను. ఏకారణమున నిట్టిసుందరరంగు ముఖమునకు పూనుకొనెనాయని విచారించసాగెను. ఆవృత్తాంతము తరువాత తెలిసికొనవచ్చును. ముందామె బ్రతికియున్నదా లేదాయని నాశికారంధ్రములకడ చేయియుంచిచూచెను. ఆమెబ్రతికియున్నది. ఇకనా గుహాయందామె నుంచుటమంచిదికాదని యెత్తుకొని గాలిలోనికి గొనివచ్చెను. కొంచెముసేపటికి క్లోడిస్సా కండ్లు తెరచినది కాని బాగుగ తెల్విరాలేదు. డోర్వ్యాలుడామె గాయమునుండి రక్తము స్రవింపకుండ కట్టుకట్టెను.

చల్లనిగాలి లావువచ్చుచుండుటచే తనపైమీద వస్త్రమామె గాయపడినచోటగప్పి మరల గుహాలోనికి గొనిపోయి యొకచోటను తెరచుటకై తడవెనుగాని లాభములేకపోయి క్లోడిస్సా కడకువచ్చి చూచుచుండెను. ఈవిధముగ గొంతకాలముగడపి చివరకు గులిస్తాను లోయమార్గము తనకు తెలియదని దృఢపరచికొనెను.

ఆకలి వేయుచున్నది. డోర్వాలుఁడు గాయమునొంది ప్రాణావశిష్టురాలై యున్న క్లోడిస్సాను విడచి యావలకేగి మరల ట్యూనారుడు లోనుండివచ్చి యామెను హింసించునేమో?— సమీపమున గల గులిస్తానులోయకరిగి ఫలములనాహారముగ తినివత్తుమనిన ట్యూనారుడు పోయినద్వారము తనకు విడదాయెను 'లోనికరిగిన ట్యూనారుఁడు నాకొరకై వచ్చినాడుకాడు స్వలాభాపేక్షియై, నిక్కముగ సంగాతకునిమరచెనే' యనిడోర్వాలుఁడనుకొనుచు మైమరచి యున్న క్లోడిస్సా వద్దకూర్చొనెనేగాని యాకలిలావగుటచే నామెను మోసికొని యావలకు వచ్చి దారిమరువకుండ దూరముగనున్న మరియొక గుహాయందామెనుంచి, తాను ట్యూనారుఁడు విమానమునుండిదిగిన తావునుచేరెను. అచ్చటి కొంతదూరములో మనుష్యావాసమున్నట్లు తెలిసికొని యటకరిగి యేరినిగానక నచ్చట సగముకోసి పడివేయబడియున్న మేకనుజూచి. కొంతమాంసము. నచ్చటనే యామాంసమును విడచినవారు వదలిన పొయిలోకాల్చుకొనితిని క్లోడిస్సానుంచిన గుహకు పయనమాయెను.

ఆగుహను సమీపించుసరికి సూర్యాస్తమయమై చీకటిపడుచుండెను.క్లోడిస్సాబ్రతికియున్నదిగానింకనుస్మృతిరాలేదు.చలిమిక్కుటముగనుండుటచే నచ్చటిపుల్లలను మంటచేసి, క్లోడిస్సాపై గుడ్డలను కప్పి డోర్వాలు డానిప్పసెగను నిద్రించెను.

తెల్లవారినది. డోర్వాలుడు మేల్కొని కాలోచిత కృత్యముల నిర్వర్తించుకొని క్లోడిస్సా కుపచారములు చేయుచుండెను.

అట్లొక పదిదినము లుపచారములుచేయ క్లోడిస్సా మాటలాడగలిగెను. క్లోడిస్సా డోర్వాలునిచూచి "స్నేహితుఁడా! నీవెవరో నాకుతెలియదుగాని నామారువేషమునందలి రహస్యమునీవెరిగితివి. నేనీరూపమొసుల మోసగించ వేయలేదని నమ్ము"మనెను.

డా—అమ్మాయీ! ఆ సంగతి నాకేల. గాయపడినదానవు గాన నీకు సదుపాయము చేయుచున్నాను. గులిస్తాను లోయనుండి నీవు——

క్లో—నే నాలోయనుండి రాకున్న చో నా కీయాపద సంభవించకుండును. ఏడీ! దుర్మార్గుడగు ట్యూనాఱ డేడీ?

డా—ఆతడు గులిస్తానులోయలోని కేగి మార్గమును బంధించినాడు.

క్లో—నా కీ గాయముతగిలి యెన్నినాళ్ళగును?

డా—ఏడుదినములు గడచెను.

క్లో—నేనపుడు బయటకు రానిచో ట్యూనాఱునకు గులిస్తాను లోయ మార్గమే తెలియకుండు ననుకొందును.

డా—అవును. ఇపుడాతడాలోయయందువిహరించుచుండును.

క్లో—ప్రాణదాతా! లేదు. వాడు కొండగర్భమున ఖైదీయై యాకలిబాధకు మరణించియుండును.

క్లో—అలాగునా?

క్లో—అందభ్యంతరము లేదు......దుష్టుడు. ద్రోహి!

డా—వానిస్వభావము నేనునెఱిగితిని. పాపము. యువకుడు మరణించునా? —— మనమిప్పుడుపోయి రక్షింపజాలమా?

క్లో—రక్షింపజాలము. చనిపోయియుండును. నేనాలోయ జాడ మార్గమితరులకు చెప్పనని ప్రమాణముచేసితిని. నేను నడయాడు వెనుక నావెంటవచ్చిన దిన్నాలోయలోనికి గొంపోదును.

డా—అట్లయిన ట్యూనాఱుడు మరణించవలసిన దే!

క్లో—ఆహా! —— నీపేరేమి ——— (డార్యాలని చెప్పెను) డార్యాల్! నీవునాతండ్రివంటివాడవు. నావెనుక నీవు గులిస్తాను లోయలోనికి రానెంచితివా ప్రమాణముచేయవలెను.

డో—ఏమని ?

క్లో—ఇపుడు నేనీకుజూపనున్న గులిస్తానులోయను జేరు రహస్యమునాకును మరియిదువురకునుదప్ప నితరులకు తెలియదు. — వారినిపేర్కొనను — ఆయిదువురయాజ్ఞయులేనిదే యేరినందు లోనికి తీసుకొనివెళ్ళను. — గులిస్తానులోయ వజ్రవైడూర్య గోమేధికాదిమణుల కొటపట్టు, అందలి విలువయగు వస్తువులతో పంద్రెండురాజ్యములు కొనవచ్చును. అట్టిలోయలోనీవునా వెంటవచ్చి మూడురోజులుండి నాల్గవరోజునపోవలయును. లేకున్న తక్కినవారు నేనిన్ను తీసుకొనివెళ్ళితిననివిన్న నన్నుదూషింతురు. ఇందులకొప్పు కొంటివా నావెంటవచ్చి నీకుకావలసిన వజ్రములతో నీవలకు వద్దుము.

డో—ఒప్పుకొంటిని. ట్యూనారుడు,

క్లో—ట్యూనారుడు చచ్చియేయుండును. దుర్మార్గుడు. నా ప్రియస్నేహితురాలును, సుందరవతియు దయామయయునగు నౌక సుందరినాతడు కష్టములపాలుచేయు గారకుడాయెను. యజమాని యగు మన్మారుని హత్యావిషయమున సహాయుడు ! దుష్టుడు ! స్వామిద్రోహి ! వానిగూర్చి విచారింపకుము.

డో—అట్లనా !

మరిమూడుదినములయినపిదప క్లోడిస్సాడోర్మాలుని సహాయమున నడువగలిగినది. మరిరెండుదినములకు పూర్తిగా నాతని సాయమక్కరలేకనే తిరుగాడెను.

క్లోడిస్సా సౌందర్యవతిగాని కారణాంతరములచే నితరులు తన్నుపోల్చుకొనకుండుటకై దేహమునకు నల్లనిరంగుపూసుకొనినది. ఆమె యట్లు మారువేషమున జేయదలచుకొనిన పనులన్నియు జరిగినవెనుక గులిస్తానులోయయందుండి రంగువేసికొనలేదు. ఇక

త్రైలాంజానియులుకూడ తాను చెల్లెలనని తెలిసికొనిరను నిజ వృత్తాంతము వారలకెరింగింపనుండుటచే రంగువేసికొనలేదు. ఆ కారణమున శరీరమునందుకొంతభాగ మూవల్లెనికందిపోయినది. ఆసంగతి యెవ్వరికిని తెలియదుగాని అకస్మాత్తుగ ట్యూర్నారునిచే పొడువబడి స్మృతితప్పి షోర్వాలుని యుపచారమునబడుటచే నాత డామెయొక సుందరియనియు మారువేషమునేకారణముననో ధరించె ననియు తెలసికొనెను. షోర్వాలును నాలుగుదినములుండి పోవువాడ గుటచే క్లోడిస్సావానికి తనవృత్తాంతమంతయు చెప్పనెంచలేదు.

---

## ఏబదిమూడవ ప్రకరణము

## గులిస్తానులోయు

ఒకదినము క్లోడిస్సా షోర్వాలునితోకూడి గులిస్తానులోనికి మార్గమగు గుహాప్రవేశించెను. ప్రవేశించినంతనే షోర్వాలునకు ట్యూర్నారునిసంగతి జ్ఞప్తికివచ్చి యాతడు మరణించియుండునని విచారించసాగెను. గుహాంతర్భాగము చిట్టచీకటిగనున్నను క్లోడిస్సా లోనగల ఈవులిగృహమువరకు షోర్వాలుని తీసికొనిపోయి "షోర్వాల్! నీవిటనాగుము, ఇటగూటిలోని ప్రమిదతీసి దీపమువెలిగించి రహస్యమార్గముతెరచి నిన్ను లోనికితీసికొనిపోదును—పిమ్మట మన మొకదానికొరకు వెదుకవలసియున్న" దనెను.

షోర్వా "లొక దానికొరకు వెదుకవలెనన్న" క్లోడిస్సా యుద్దేశమూహించెను. ఆవెదుకవలసినదేమి? ట్యూర్నారుని మృతకళేబరము. క్లోడిస్సాదీపమును వెలిగించి రహస్యద్వారమును తెరచి

లోన మెట్లుదిగసాగెను. డోర్వాలామె వెనుక పయనమాయెను. వారామెట్లపైనుండి దిగుచుండ డోర్వాలుని పాదఘట్టనలు ప్రతిధ్వనించుచుండెను. అడుగునకు పోయినకొలది భూగర్భము వేడిగనుండెను.

అట్లిరువురును మెట్లుదిగి చాలదూర మేగిరి. అచ్చటక్లోడిస్సా ట్యూనారుని శవమునకై వెదకుచుండ నొక పాషాణము వెనుక ట్యూనారుడు చచ్చిపడియుండెను.

క్లోడిస్సా ట్యూనారుని శవముపై దీపము ప్రసరింపజేసెను. వానిశవము కుళ్ళుచుండెను. ఆశవము జూచి డోర్వాలు కన్నుల నీరునించి "పాపము! పదిరోజులనుండి గులిస్తానులోయ జేరుమార్గ మెరుగక, బయటకు రాలేక, యాకటిబాధజిక్కి దుష్టబుద్ధి ట్యూనారు డసువుల గోలుపోయెనే. పాపము. గులిస్తానులోయ జేరవలెనని యాశపడి లోయద్వారముకడనే చచ్చె" నని క్లోడిస్సా, ట్యూనారునిపై తనకుగల క్రోధము తీరినందులకు సంతసించసాగినది. మరియొక నిమిషమయినది. క్లోడిస్సా దీపమార్పి యొకద్వారమును తెరచెను. వెంటనే వెలుతురు వారున్నచోట చుట్టివేసెను. ద్వారము ట్యూనారుని మృతకళేబరమువద్దనేయున్నది. ఆద్వారము తెరచి క్లోడిస్సా, డోర్వాలును వెంటరమ్మని బయలుదేరెను. అదియే గులిస్తానులోయ. ఆలోయచుట్టు నెత్తయిన పర్వతరాజములు గలవు. డోర్వాలుడాగుహచూచి యచ్చెరువడెను. మానవమాత్రులకునునెలవు తెలియనిచోటనుప్రవేశించుటకష్టమని యెరిగెను. లోయయందెటుచూసినను, పండ్లభారముచేవంగిన చెట్లు, పుష్పసౌరభముల సెలయేళ్లు, మధురగానముచేయు విహంగములు మొదలగు వానితో యానందదాయకముగనుండుటగాంచి డోర్వాలుండు గులిస్తానులోయలో ప్రవేశించుటవలన తనజన్మ సార్థకమాయె ననుకొనెను.

తరులతాద్యనేక ఫలభరితంబగు నాలోయయందు షోర్వాలుని క్లోడిస్నా కొనిపోయి, లతలచే నల్లిబిల్లిగ నల్లికొనిన యొకపొదరింటిలో గూర్చొనజేసి యొకస్ఫటికపు గిన్నెతో తేనెయు, పక్వఫలములను గొనివచ్చి యెదుటనుంచెను. షోర్వాలుడవి రుచిచూచి తన జన్మమధ్యమున నిట్టిదివ్యఫలముల దినియెరుగననెను.

పిమ్మట యాతని క్లోడిస్నా యొకసెలయేటివద్దకు గొంపోయి యందలి వింతవింతలగు మీనములజూపి "షోర్వాల్! ఈలోయ యందలి వారలకు, పక్వఫలములు, మధురరసములేగాక రుచికరములగు చేపలుకూడ లభించును. అనేకవిధములగు కాయగూరలు, మాంసములుగూడ దొరకును. ఆవంకచూడుము, పచ్చికబయళ్ళపై గొఱ్ఱెపిల్లలు తిరుగాడుచున్నవి." అని చూపి మరియొక తావునకు గొనిపోయి బంగారపుగనులు, వజ్రపుగనులను జూపెను. అవిజూచి షోర్వాలుడు కన్నులుమిరుమిట్లుగొన నచ్చెరువడెను. క్లోడిస్నా "షోర్వాల్! నీవీలోయవిడచి పోవునపుడు యిందుండి నీకు కావలసినవి కొనిపొమ్ము! అంతియేగాక యిందొక యద్భుతముగలదు రమ్ము"ని మరియొక తావునకుగొని వేడినీటిసెలయేరు జూపెను. ఆప్రక్కనే యొక యగ్నిపర్వతము గలదు.

గులిస్తానులోయ యంతయు జూచుసరికి షోర్వాలునకు మూడురోజులు పట్టెను. పిమ్మట నిరువురును గలసి ట్యూనాదుని మృతకళేబరమును గొనివచ్చి లోయలో నొకచోట పాతిపెట్టిరి.

నాల్గవదిన ముదయమున షోర్వాలుడు కొన్ని వజ్రములు, మణులు మొదలయినవి మూటగట్టికొని వాగ్దత్తము ప్రకారము లోయవిడచి పోబయలుదేరెను. క్లోడిస్నా వాని నీవలకు గొనివచ్చి యచ్చట తనచే విడువబడిన హయమొందుజూపి "షోర్వాల్! అది నేనీలోయ ప్రవేశించక పూర్వము విడచినగుఱ్ఱము. మైదానముపై

దిరుగుచున్నది. దానినధివసించి నీవు సేకరించుకొనిన ధనముతో పోయి హాయిగ నుండు” మనెను.

డా—అమ్మాయీ! నిన్నువిడచి పోవుట ప్రియుకోమార్తెను విడచిపోవునంత సంతాపముగలుగుచున్నది. మగిమన మొకరినొకరు చూచుకొనుట సంభవింపదు.

క్లో—తండ్రీ! నీవు నాప్రాణరక్షకుడవు. నీయుపకారము నా కంఠమున జీవుడున్నంతవరకు మరువను.

పై విధముగ వారు మాటలాడుకొనుచుండకొందర శ్వారూఢు లాయుధపాణులై కేకలువేయుచు వచ్చుచుండ డోర్వాలుడు వారిని గరణ్రాగ్ దుర్గసైనికులుగ గుర్తించి “హా! చచ్చితిననీ” గడగడ వణకుచుండ వారు వచ్చి యాతని బంధించిరి. అట్టితరి మరియొక తట్టునుంచి సుందరమగు యువకుడు, అశ్వారూఢుడై మరికొందరితో వచ్చి యాగరన్రాగ్ గ్రికులనోడించి డోర్వాలుని విడిపించెను. డోర్వాలుడాతని యుపకారమునకు సంతసించుచుండ క్లోడిస్సా యా యువకుని మందస్మిత వదనముతో సమీపించి “కైరీ! మరల యేనాటికి నిన్ను జూడగల్గితి” ననెను.

కైరికరమను డమందానందభరితుడై గుఱ్ఱమునుండి దూకి వచ్చి యామెను కౌగలించుకొని “మీరా! ప్రేయసీ! బ్రతికి యున్నావా? యేమి నాభాగ్యము” అని యామె యధరము ముద్దాడుచు తన్మయుడాయెను.

---

## ఏబదినాలుగవ ప్రకరణము

## మీరా కైరికరమునులు

పిదప మీరా ఘోర్వాలుడు తన్నురక్షించిన సంగతిజెప్పెను.

కై—మీరా! నీవు పాముచే కఱవఁబడి చనిపోయితివిగదా. ఎట్లుమరల బ్రతికితివో, ఇన్నాళ్లెక్కడనున్నావో చెప్పుము.

మీ—నాథా! నీకాగ్రహము జనించనిచో జెప్పెదను.

కై—ప్రాణసఖీ! నాకుకోపముకలుగదు. మరియాతనువుతో నిన్నుజూచుభాగ్యము నాకులేదనుకొంటిని. అట్టితఱి నాభాగ్యవశమున నీవుసజీవురాలవయి నాహృదయాందోళనము బాపితివి. (కౌఁగలించుకొని) చెప్పుము. నీమరణమందలి రహస్యమేమి? — బ్రతికియుండి నిన్నుపెన్నిధివలె జూచుకొను నీనాథునివిడచి యింతకాలమెట్లుండగల్గితివి? ఈకాకసియనుదుర్గ మారణ్యములనుండనేల? — నిన్ను రక్షించిన యాముసలివాడెవ్వడు?

మీ—నాథా! మనమిరువురము కలసి మన్సూరుడు లైలా మహారాజ్ఞికిజెప్పనెంచిన రహస్యము నెరుగనెంచిన పన్నగడనీవెరిగినదేగదా, నేను నీయాజ్ఞప్రకారము లైలాను మార్గమధ్యమున గలసికొని యొకసెలయేటియొడ్డునకూర్చొని యామెరహస్యము బయటకుదీయప్రయత్నించువో గడ్డిలోనుండొకపామువచ్చి నన్నుకరచినది. అంతలైలా — కరుణాస్వరూపిణి — నాకుపచారము చేసినది నాకువిషము తలకెక్కెను, మరినేబ్రతుకనని లైలాయుంగరమిచ్చివేసితిని.

కై—ఊఁ!

మీ—తరువాత నేతెల్వితప్పిపోవుచుండ తెల్లా — (టిఫిలిస్ నందు నామృతదేహమువద్ద నీవుసంగి నాజీవనమునకు పరలోకమున

శాంతికొరకై నీచేత ప్రేరేపింపజేసిన స్త్రీ) తక్షణమే పాముకరచిన స్థలమున నేదియోమందువ్రాసి నోట నింతయౌషధముబోసినది. ఆమందుప్రభావమున నేమరణించినట్లు యితరులనుకొనునట్లాయెను గాని నేనుమరణింపలేదు. పిదప లైలా దాసీలతోపోయెను. నాకు తెల్వివచ్చినవెనుక నేనేచచ్చిబ్రతికితిననుకొంటిని. పాముకరచి నపుడు నాపశ్చాత్తాపమునకు దేవుడుసంతసించి నన్నుబ్రతికించె నను కొంటిని. అపుడు నాహృదయాంతరాళమున "దుర్మార్గమునుండి మరలుము. ఆదయామయ, నమ్రాయిశురాలు, భూలోకసుందరియగు లైలాకు హానిచేయదలంపకుము. పశ్చాత్తాపపడుము" అనువాక్య ములు మారుమ్రోగెను. ఆవాక్యములననుసరించుట యుత్తమమని నిశ్చయించుకొని సత్ప్రవర్తురాలనయితిని. ఆఁ. కైరీ! ఎన్నియో కష్టములుపడి లైలాయుంగరమును నీవుతెచ్చితివి. ఆయుంగరము మరల నేనామెకిచ్చివేసితిని. కోపమా? ఆమె నాకాసమయమున జేసినయుపకారమునకు నాజన్మములో నామెకుహానిచేయనని భగ వంతునియెదుటనే ప్రమాణముచేసితిని. నాటినుండి నేటివరకు తెల్లాకు నాదాసీలకునుదప్ప యితరులకు నేబ్రతికియుంటినని తెలియదు.

మీరా! ఎంతపనిచేసితివి. నన్ను కలసికొని నీయభిప్రాయముఁ జెప్పినచో నేనును పశ్చాత్తప్తుడనైన మార్గమనుసరించియుందునే. అట్లుచేయక నన్ను నీకొంతకై దుఃఖితునిచేసివైచితివి.

మీ——ఆలానా.

కై——నిజము. నమ్ముము ఇక నీ యనుచరుల విడచి నాతో సుఖముండుమనుము. తక్షణమే విడచివేయుదును! మీరా! నీమీద నాకు ప్రేమ అగ్గలముగదా! నీ వియోగమునకై నేనెంత విలపిం చితినో దైవ మెరుగును! టిప్లిస్ ఖయిదునుండి ట్యూనారుడు దాటి పోయినవెనుక వానికి సహాయము చేయ నేనును నాయనుచరుడును

పూనుకొనినప్పుడు శత్రుల తుపాకినుండి వచ్చిన గుండుచే తెల్విదప్పి నేల బడితిని. అప్పుడు నీవలెనే యొకసుందరి వచ్చి కసెలవేఁటి కడకు గొనిపోయి యుపచారముచేసినది. నాకు మెలకువవచ్చెను. ఆమె నల్లగనున్నది. మాటలు నీ మాటలువలె నుండి నీవేయని పోల్చితిని. కాని—

మీరా—కైరీ!—ఆ దినమునను నిన్ను విడచిపోవుటకు శాఖ్యాక లేదు. కాని నారహస్యము బయల్పడునని పోకతప్పినదిగాదు— కొన్ని కారణములచే నేనితరులకు పోల్చనశక్యముగునట్లు నల్లనిరంగు పూసికొని మాఱురూపము ధరించితిని.

కై—మీరా! నీవీ కాకసియను పర్వతములయందుండ గారణ మేమి?

మీరా—దైవప్రేరణ! దైవబహుమానము—పరహస్య స్థలమును తెలిసికొనుటకై నీవు దుర్మార్గమున కొడిగట్టితివో, పరహస్య భూమికై నేనును నిన్ననుసరించి దుర్మార్గత చేయనెట్టుకొంటినో— ఆరహస్యస్థలము నేపడినపశ్చాత్తాపమునకు బహుమతిగ భగవం తుడు ప్రసాదించుటచే నిటనున్నాను.—

కై—(వికసితాననుడై గులిస్తాను!—

మీరా—కొన్నినెలల నుండియు నే గులిస్తానులోయ యందే వసించుచున్నాను. ఇప్పుడునీవు రక్షించినముసలివాడు నాసహాయుము ననే గులిస్తాను లోయజూచి యందలి వజ్రవైడూర్యములు చేకొని యీవలకువచ్చెను.—నాధా! ఇకనీపరివారమునువిడచి —దొంగవృత్తి మాని, నాతో సన్మార్గవర్తివై బ్రతుకనెంచితివా గులిస్తానులోయ నీయది.

కైరికరమనుపు మోకాళ్ళఁబడి, యర్ధాంగి హస్తమునంది కొని ముద్దాడుచు “నీవుచెప్పినట్లు చేయుదు” ననిప్రమాణము

చేసెను. మీరాయాతని లేవనెత్తి కౌగలించికొని ప్రాణనాథుని పశ్చాత్తాపమునకు సంతసించి, ముద్దాడెను.

ట్యూనాడుడుకరమనునకులనగాస్థలమూనసేగానవచ్చి,క్లోడిస్సా యనుకాంత తన్నుటిఫలిస్ చెరనుండి రక్షించెననియు—న్యాయస్థానమున వాని నిర్దోషియని నడచిన వెనుక యీయరణ్యమునకువచ్చి సుల్తాన్ స్కెమిల్ సేవకులచే బంధితుడగు వరకు మీరాకు చెప్పెను.

మీరా, డోర్వాలు ట్యూనాడులు కలసివచ్చిరనియు, తన్ను ట్యూనాడుడేల గాయపరచెనో డోర్వాలుడెట్లు తన్నురక్షించెనో కరమునకు చెప్పెను.

మీ—నాథా! ట్యూనాడుడు మనుష్యుని చంపలేదనియు, అతడు నిర్దోషియనియు, జమ్మజెట్టి మనుష్యుని జంపినవాడనియు నీవు తెల్విదప్పిననాడు చెప్పితిని. ట్యూనాడుడు యువకుడగుట మొదల యనేక విధముల కాపాడితిని. నేను పల్లని రంగుపూసికొని క్లోడిస్సాయను మాఱు పేరుతోనున్న పుడువాని ననేకవిధముల కాపాడిన వాడు నిన్ను కలియకుండ జేసితిని. వాడు వచ్చి నిన్నుమరల దుర్మార్గుని చేయునని.

కై—ప్రాణసఖీ! నీవనేకవిధముల నన్నుగాచితివి—ఇక నీ మాటదాటను.

ఈ మాటలసందర్భమున డోర్వాలు తన్ను గులిస్తానులోయలోనికి గొనిపోయినకాంత బందిపోటుదొంగయగు కరమునిభార్యయనియు, కారణాంతరములచే క్లోడిస్సా యనుపేర దిరుగుచున్నదనియు గ్రహించెను. తనతో చెరలోనుండిన ట్యూనాడుడు దుర్మార్గుడనియు, బందిపోటుదొంగ స్నేహితుడనియు గుర్తించెను.

మరియొక గంటకు కైరికరమనుడు భార్యతో తనపరివారమును సమీపించి, నేటినుండి తాను వారిని విడచివేయుచున్నా

ననియు వేదనాయకుని గూముకొనుమనియు చెప్పెను. వారందరుల కెంతయో చింతించిరి. పిమ్మట కరమునుని యాజ్ఞచేవారు. సోర్హ్యా బుని జాగ్రత్తగ బాటూముదిగబెట్టిరి. అటనుండి సోర్హ్యాబుడు సుఖముగ కనిష్టాంటునోపిలు చేరెను. సోర్హ్యాబుడు పోవునపుడు మీరానుచూచి "అమ్మాయీ! కొంతకాలమయినవెనుక నీవును నీభర్తయును పారిస్‌రండు. అక్కడ మనమందరము సుఖముగ నుండవచ్చు. పారిస్ నాజన్మభూమి. నీవు నాకుమూర్తవలె కన్నుల కానందము గూర్చుచు నుందు" వనెను.

పిమ్మట మీరాకైరికరమనులు ఒకరి భుజములపైనొకరు చేతులు వేసికొని, సరసల్లాపము లాడికొనుచు, మహానందమున గులిస్తాలోయను జేర్చు రహస్యమార్గములోనికి పోయిరి.

---

## ఏ బ ది యై ద వ ప్ర క ర ణ ము

## స మా ప్తి

మీరా, కరమనులు (కాకసియను బందిపోటువాంగయునాతని భార్యయు) నిపుడు మహాధనవంతులు. ఇపుడు వారు పశ్చిమదేశములకు పోవుటకై బయలుదేరి, కనిష్టాంటునోపిలునందొక పెద్ద భవనమున నొన్నిదినములుండ దిగిరి. వారచ్చట నున్నట్లు దేశద్రిమ్మరియగు తెక్లా తెలసికొని చూడంబోయి, తైలావృత్తాంతము మీరాకు చెప్పి, వారి మర్యాదలందెను. మరి రెండురోజులు వెనుక కైరికరమను, మీరాలు, మారుపేరులతో కనిష్టాంటునోపిలువద్దవారి సెలవుగైకొని పశ్చిమదేశములకు బయల్వెడలిరి. పిమ్మట తెక్లా

శైలా మహారాజ్ఞిని సమీపించి మీరా బ్రతికియేయున్నదనియు, తనతో తిరిగి రక్షించిన నల్లనిస్త్రీ మీరారాయుడనియు, కారణములచే క్లోడీస్సా యను మారువేషముతో సంచరించినదనియుఁ జెప్ప శైలా యాశ్చర్యపడి "తెక్లా! కంఠస్వరమునుబట్టి క్లోడీస్సా మీరారాయని గుర్తించితినిగాని రూపమునుబట్టి యనుమానమునొందితిని" అని మీరా కరమునునిలిపుడు సన్మార్గవర్తనుల్తో కూడి సుఖజీవనము చేయుచున్నారని విని యెంతయో సంతసించెను.

తె—అమ్మా ! మీరా! నీ యోగక్షేమములు తనకు త్తరము వ్రాయుమన్నది.

శై—తప్పక వ్రాసెదను. ఆమె నాయెడ పూర్వమెంత ద్రోహ చింతగలిగియున్నను పిమ్మట మహోపకారము చేసినది.

కొన్నిరోజులు తెక్లాక్యూటాయిసునందు శైలావద్దనుండి మగిడి దేశద్రిమ్మరియాయెను.

ఒకసంవత్సరమాయెను. సెంటుపీటర్సుబర్గునుండి కను డానియలురాలేదు. యుద్ధమొకటివచ్చునని తలచియుండుటచే రష్యను ప్రభుత్వము తత్ప్రయత్నమున నిమగ్నమై యంతవరకు డానియలును గౌరవమైదీగా తమవద్దనుంచికొనిరి. అట్లుండియు డానియలు తన ప్రయత్నములగూర్చి శైలాకు త్తరములనంపుచు నామె యోగక్షేమములనారయుచుండెను. శైలామాత్రము ప్రియుడగు డానియలు రాకకై యెదురుచూచుచున్నది.

మరికొన్నినాళ్ళవెనుక మరల తెక్లావచ్చి శైలాడానియలు నకై కృశించిపోవుటచూచి తాను మారువేషమున పీటర్సుబర్గు పోయి డానియలును గొనివచ్చెదనని చెప్పి యామెను శాంతింపజేసి బయలుదేరెను. కొన్ని నెలలు గడచినవి. శైలాకు, తెక్లాడానియలుల వృత్తాంతమే తెలియునందున వారిరువురు నటఖయిదీలయిరనియామె హృదయభారమున కృశింపసాగెను.

1855 సంవత్సరము సమీపించు సరికి డాన్యూబునదీతీరమున జరుగుచున్న యుద్ధమంతమై, జయమందిన టర్కీరాజ్యము మింగ్రేలియా రష్యనులనుండి వశపరచుకొన వచ్చెను. అప్పటికు దగ్గరగ రియన్ (Rhion) అనుకోటవద్ద రష్యనులకును, టర్కీసేనానాయకుఁడగు ఉమర్ పాషాకును ఘోరయుద్ధముజరిగి, రష్యనులోడి పారిరి. ఉమర్ పాషా పిమ్మట మింగ్రేలియా స్వతంత్రరాజ్యమాయెను. అట్లురష్యనులు యుద్ధసన్నాహమునందేమరుపాటున నున్నపుడు తెక్లాజానియులు చెరనుండి విడిపించి మింగ్రేలియా దోడ్కొనివచ్చెను. లైలా, తెక్లాజానియులుల రాక కమందానంద భరితురాలాయెను.

మింగ్రేలియా స్వతంత్ర రాజ్యమాయెను, లైలాజానియులు లకు మహావైభవముగ వివాహము జరిగెను. ఉమర్ పాషా లైలా జానియులులను మింగ్రేలియా సింహాసనాధిపతులజేసి, దీవించి తన దేశమునకు పోయెను.

డోర్వాలు గులిస్తానులోయనుండి తెచ్చుకొనిన యమూల్య రత్నాదులతో పారిస్ చేరి గొప్పభవనమును నిర్మించుకొని రాజ భోగమనుభవించు చుండెను. అతని భవనము ప్రక్కనే మరియొక భవనమం దిరువురు, భార్యాభర్తలు సుందరులుగూడ సాటిలేని వైశ్వర్యములతో తులదూగుచుండిరి. వారెవరు? వారుగ్రీకునామ ధేయముల ధరించి యుటకువచ్చిన కైరికరమను మీరాలు.

రాజ్యాభిషిక్తులై జానియులు, లైలాలు మహానందముగ నుండిరి. వారు మీరా తామపుడు జూచినగులిస్తానులోయ యద్భుతరామణీయకములు తలచికొనితలచికొని సంతసించుచుండెడివారు. తెక్లాకూడ వారి దాంపత్యముకనులార గొన్నాళ్ళు జూచి తనదారి బోయెను.

ద్వితీయభాగము సమాప్తము.

---

## మంత్రిప్రగడ సూర్యనారాయణగారి కథలు

## 1

# దా చే ను మ గ డా వే రుం డు !

నాభార్య కమాంరమ్మ పాలుగున్నప్పట్నుంచీ యెన్నాళ్ళనించో చెవి నిల్లుకట్టుకుపోరుతూంది "వేరుండు వేరుండు"మని. కాని నే ఖాతరు చెయ్యలే. నిరోద్యోగపీనుగుని వేరుండని తినేస్తూంటే ప్రాణాలంత రించుకుపోవ్వూ ? ఇంతకీ వేరుంటే నాదగ్గరున్న దేమిటి? పోనీదాని దగ్గరేమేనావుందేమో అనుకుందామంటే మొహోపసుపుకొమ్మకట్టు కుంటూంది. ఏమో ఆడదానిహృదయం మహాగంభీరమయిందనీ దానిలోతుబ్రహ్మకేనా తెలీదంటారుపెద్దలు ! ఏందాచిందో ! ఇంతకీ — ఆ మహారాజు – నాతండ్రి లోకస్థితి గమనించినవాడు కాబట్టి "ఉద్యోగంచెయ్యకపోతే తిండెలావస్తుంద"ని ఓనాడేనా గద్దించెరగడునన్ను ! మీదుమిక్కిలి నేనోగడియయింటికిరావడం ఆలస్యంఅయితే కాలుకాలినపిల్లిలా వూరంతాతిరుగుతాడునాగురించి. అటువంటి మునిలాటితండ్రితో వేరేలావుండడం? ఇదియిప్పుడు నా మనసులోమెరుగుతూన్నప్రశ్న! దీనికేమిపోగాలమొచ్చెనో! మగవాడై పుట్టేకన్నా ఓదండకారణ్యంలో మానయిపుడితే బావుణ్ణు! "మొగ రాజు" మొగరాడం"టారు ఎందుకు వెధవమొగరాజు? పుట్టిందగ్గ ర్నుంచీ చికాకులేగదా! అందులోకీ యిటువంటిపెళ్ళాం దొరకడం మహాపుణ్యం! కణకణలాడుతూన్న చింతనిప్పులు తీసుకెళ్ళి భగవంతుని నెత్తినిపోసుంటాను. పూర్వజన్మలో" అనుకుంటూ పేరయ్యశాస్త్రి గుడికి మేకపోతుమల్లే ప్రాణాలుబిగబట్టుకొని యిల్లుచేరి తలుపుతట్టాడు.

భార్య సూరమ్మ తలుపు తెరచింది.

"నాన్నేడే—రాలే?"

"అదేమో!"

పన్నెండుఘంట లయిపోయింది. ముసిలాడీపాటికేనా యిల్లు చేరుకోక, గుళ్లు తుటాయించుకుపోతూ, ప్రారంటతిరిగొచ్చి విస్తరి దగ్గర కూచుంటె నోటికేం మెతుకు వెళ్ళను.

"చాల్లెద్దురూ నాన్నోనాన్నో అని మీరిదవడమేగాని మీమీదాయనకొక్కాస్తైనా దయ పతికినాలేదు. వినండి నామాట వినండి, మనం వేరుందాం, నేదాచిఃదిస్తా. హాయిగా బ్రతుకుదాం. మీకు తెలీకుగాని మీరు వీధులోకెళ్ళిపోయాక, మీనాన్నగారనే మాటలు—రామహరీ!—నాచెవులు వినలేకున్నాయి. శరీరం చిల్లులు పడిపోతుంది. మరి మీయిష్టం. లేకుంటురూ ఫరవాలేదు."

"ఓసీ! నీకు బుద్ధిలేనట్టుంది. ఇంతాపెంచి పెద్దవాణ్ణి చేసిన తండ్రి నెలా పెద్దకాలంలో వదిలేసరూ అని ఆలోచిస్తున్నా."

"మరి మీ యిష్టం. నాకు మీనాన్నగారితో కలిసుండాలని సుతలామూ లేదు. వేరుంటేవుండండి నేదాచినదాన్తో బ్రతుకుదాం లేదా మీదారిమీది. నాదారా? పిడికెడుప్రాణంగా యెలాగయినా విడిపించుకుంటా మీరూ మీనాన్నగారూ కలిసుండండి."

"బాబూ! బాబూ!!"

"అదిగో మానాన్న పిలుస్తున్నాడు నోరుముయ్యి."

మీయిష్టం. ఇవాళనుండీ మరినేనోర్వలేను. ఇష్టమయిందా యీ వుత్తరక్షణం రండి వేరుందాం. లేదా యిదుగో 'జయ్! గంగాభవానీ' అని నూతులో దూకుతా.

"ఓసి గుంటపీనుగా, అపనిచెయ్యకే వేరుందాం! ఇదో అప్రతిష్ఠ."

* * * * *

అని తండ్రికి తలుపు తీయబోవును.

పేరయ్యశాస్త్రి భార్యబాధ పడలేక వేరయేడు తండ్రితో. పంచుకు తెచ్చుకున్న పైసాపరకాతో ఒడుదుడుకుల్లేకుండా ఒకరికి చెయ్యిజాపకుండా ఒకయేడు గడిపాడు. క్రమంగా పూటభత్యం పుల్లలవెలుగులోకి దిగింది సంసారం. సూరమ్మ వేరుండేదాకా మొగుడిప్రాణాలు కొరికేసింది. తీరా వేరున్నాక ముంగిపోతులా కూరకుంది. పేరయ్యశాస్త్రి, భార్య ఒకటో రెండో వందలు కూడబెట్టి దాచిందేమో పుచ్చుకుని సామాను తెద్దామని ధైర్యంగా ఒకనాడు "ఒసేవు! నువ్వు దాచిందేమో తియ్యి అవుసరంవచ్చింది. ఇంట్లో అన్నీ కొనాలి" అన్నాడు.

"ఇస్తానుండండి. తొందరపెట్టక. పొద్దున్నే చింతపండుతో తెల్లగా తోమేనివాళిద్దామనే!"

పేరయ్యశాస్త్రి "డబ్బ్యాగటారి తోమాలా?—ఆ—ముక్కి—వుంటుంది చాలాకోజులయి దాచివుంచడంచాత." అనుకున్నాడు తనలో.

"ఐతే తే వేగంబజారికెళతా"నన్నాడు.

"అది బజారులోమారదు. మీచేతులోవుంటే ప్రతియింటా మారుతుంది!"

"బాగుంది. ఏమిటో ఆరహాస్యం యేడువు!"

"ఇదిగో" (అని చీరకప్పుతీసి రాగిచెంబందించి) 'రాగి చెంబు. రెండు కుంచాలుబియ్యం పడుతుంది. పైమీదగావంచావేసుకుని పూజ్లోబయద్దేరండి. సాయంకాలం అయ్యేసరికి రెండుకుంచాల బియ్యం శాకంపాకం అన్నీ దొరుకుతాయి. ఇంతకన్నా యేమిటి కావాలి మనకి. ఇదే భూమి, పాడి, పంట, ధనం సర్వమూనులెండి ఊc!"

(పేరయ్యశాస్త్రి స్వగతము) అయ్యో! నీపిండంపెట్టా! ఇదటె నువ్వుదాచింది. నాకూ నాతండ్రికీ యెడబాపులుచేసి ఆయనవారసమా సలహోయిచ్చావు! ఇంకా నూరో రెండువందలో ఖిరావళ్లిచ్చావన గామాసనుకుని గడ్డితిని నీమాయల్లోపడి కూచున్నకొమ్మ నరుక్కున్నా! అయ్యో! నేనెంత సత్తిగాలం ముండావాణ్ణి! నేనాయనవారం చెయ్యలేను. నేనిదే మళ్లీ నాతండ్రికాళ్ళమీదపడతా. వస్తేరా. లేదా చావు. ఒట్టినే అన్నారా "స్త్రీబుద్ధిః ప్రళయాంతకః" అని.

---

మా గ్రంథమండలిలో చందాదారులుగా చేరి మా గ్రంథ మండలి అభివృద్ధికి ప్రోత్సాహమివ్వ గ్రంథాలయాధికారులను మునిసిపల్, జిల్లాబోర్డు, పంచాయితీబోర్డు అధ్యక్షులను, ఆంధ్రుల నందరిని కోరుచున్నాను.

ఇట్లు

వ్యవస్థాపకుడు

# 2

## పెద్దవాడి పెళ్ళిమాటలు

"వాడికింకా లోకజ్ఞానమే లేదు. అప్పుడే పెళ్ళిచేసేమంటూ వేమిటి? బాగా నేవుంది తెలివి! ఏంకొంప మునిగిపోయింది మరో నాలుగేళ్ళుపోతే? 'అయ్యో ముసిలికక్క గట్టయిపోతున్నాడు పెళ్ళి కాలేదేందారి?' అని తొందరపడతామా?- ఇంకా గుంటడాయెను" అన్నాడు శంభరయ్యభార్య అందిచ్చిన చెక్కకటాలున పళ్ళక్రింద వేసి నొక్కుతూ.

"ఆ-అలాగనకండి. మనం బ్రతికున్నన్నాళ్లూ పిల్లలెంత పెద్దవాళ్ళయినా మనకంటికి గుంటలే. కృష్ణమూర్తికేం తక్కువేళ్లు లేవు. కిందటి గాలివానకప్పుడే యేడాది పిల్లడు. గాలివానపోయి యిప్పటికి పందొమ్మిదేళ్ళయింది. వాడికిరవై. మనం సంకోచించసక్కర్లేదు. వాడికి పెళ్ళీడు లేదనం"ది సన్నమ్మ తములపాకు చిలకలందిస్తూ.

"ఒప్పుకున్నాను. కాని నువ్వెన్నివిధాలు నామెడలు పూదామని ప్రయత్నించినా లాభంలేదు. నాకిప్పుడే వాడికి వివాహంచేదామనిలేదు."

"అలా భీష్మించికూచుంటే యెలాగండీ? మీరూం నేనూం చల్లగా వాడికోఅయిదుముళ్లూ; పరహాఁనికో మూడుముళ్లూ వేసేస్తే మనడూటీ తీరిపోతుందంటాను."

"మనం ఆఖరికి వేసేవి ముళ్లేవాళ్ళకి! కాని యిప్పుడే? మనం దుక్కపోతుల్లాగున్నాం! మనకేం ఫరవాలేదు. మరోపది పదిహేనేళ్ళు గారంటీ మనకింకా యముడు కోర్టుకి వున్నపాటుగా హాజరవ

మని సమన్లురావని! ఇంకారెక్కులు రాకుండా పాటికి శాస్త్రులకే లంపటం తగిలించడం నాకావంతా యిష్టంలేదు."

"సరిపడని సంగతుల్లావున్నాయి మనఅక్షౌహిణీలు, (నవ్వి) కథవిన్నారా? చూశారా వెలగాడకొండలాటి కొండొకటుందట. అది వనమూలికలకు నిధట. ఒక తురకాడిపెళ్ళానికి జబ్బుచేసిందట. దానికౌషధం ఓమూలికట. అదాకొండనుందట. అది తెచ్చియిస్తే రోగం కుదురుతుందట. తురకవెళ్ళి తేవాలి. అతను వెళ్ళడు. ఆ కొండ వాడిదగ్గరికిరాదు. తురకాడికి కొండదగ్గరికివెళ్ళి మూలిక తెచ్చుకోడం దర్జాకిలోటు! మనతురకవాడి వాళ్లెవళ్ళో పూర్వం రాజ్యం చేశారట. వాళ్ళకేది కావల్సినా, యెన్నివేలమైళ్ళదూరంలోవున్నా తల్చుకుంటే గుమ్మంలో వుండేవట. ఆదర్జావల్ల తురక వెళ్ళనని కూచున్నాడు. కొండసహజంగా అచలం గనక తెచ్చివాడికి మూలిక యివ్వదు. ఇకనెలా? అలాగుంది మనవరస. ఎన్నిచెప్పండి వాడికేం మగరాజు. నోట్లోముక్కలున్నాయి. ఎక్కడో నాలుగు రాళ్ళు తెచ్చుకుని పెళ్లాన్నిపోషించుకోలేడూ?"

"వంటింట్లోకూచొని మాట్లాడ్డంఅనుకున్నావేమిటి? హనుమ రావులు గతిలేక ఆఖరికి కోమటికొట్లు పడుతున్నారు. అలాటివాళ్ళ ముందు కిట్టిగాడు ఉష్ప్రాపతాఁ! — వెధవది. ఆస్కూలుఫైనలు గట్టెక్కడానికి మూడేళ్ళు నానాసంకానాకి కోటాకుతీశాడు! — ఏదో చూస్తున్నాను. ఈయూరుకు మంచిచెడ్డలుచూడడం తండ్రి బాధ్యతగనుక ఓ నాలుగురాళ్లొచ్చేనౌకరి యెవడికాళ్ళైనాపట్టుకు వాడికిప్పించాక — నువ్వుచెప్పినట్టూ పెళ్ళిగాని — "

"అమగో అలాగ చేస్తే ధర్మమా?"

"ఏం?"

"ధర్మపత్నిని తూలనాడొచ్చా! కొడుక్కంటే భార్యే పురుషుడికి యెక్కువప్రియం"

‘‘ఔనవునూ ! —— మానాన్నగారిదగ్గరకు నిన్ను నా కొట్టినే యిచ్చివేయలేను. ధర్మానికిచూశాడు ఈశంభరయ్యగారికి యిల్లూవాకిలీ, భూమీపుట్రా, పాడీపంటావుంది. పిల్లనిస్తే సుఖపడుతుందనిచ్చాడు. అదీకాక వాడేంతక్కువ బుజ్జా ! బుజ్జులుమార్చుటంలో ఘట్టు ! కరణంగా ! —— లోగుట్టు పరమాత్ముడికి తెలుసు. నాకుపిల్లనిచ్చి కాలేకుంటే —— నేను గుణిక్కుమంటే ఆ స్త్రీతో కూతురిల్లుపడుతుందనికూడ ——’’

‘‘అయ్యో ! అవేంమాటలండీ. తీగతీస్తే డొంకకదలినట్టుంది. బాగుందిపోనిస్తురూ. అన్నపూర్ణ నెరుగుదురండీమీరు?’’

‘‘అయ్యో ! అదినీబొందిలోదేగదూ’’

‘‘దానికి పదమూడేళ్ళు దాటాయటప్పుడే. కట్టుతప్పివుంది పిల్ల.’’

‘‘ఇంకా పెళ్ళికాలేదూ ?’’

‘‘నేచెప్పేదంతా యేమిటి? చేరడుకళ్ళు. ముఖం మహాలక్ష్మిని రాగోడుతుంది. అది మనింటతిరుగుతూంటే’’

‘‘ఆఁ ! దీనిసిగాతరగా ! అంతబావుంటుందేంగుంట.’’

‘‘కొంచం నాజూకుగామాటాడండి. వాఘాయిత్యంకోరుతారేంఅప్పుడే. దాన్ని మనపిల్లాడికి చేసుకుంటే ——’’

‘‘అమోఘం!’’

‘‘నాకుదగ్గరిది. చిక్కనిచుక్క. సద్గుణవంతురాలు. కనుక మనంపెద్దవాళ్ళమై కాలూచెయ్యీవంగితే’’

‘‘——తాడు కట్టివీధులో కీడుస్తుంది !’’

‘‘అబ్బ ? వెటకారాలు’’

‘‘వెటకారంగాదు! ఎప్పుడూ దగ్గరపిల్లనిచేసుకోకూడదు.’’

‘‘చివరకి మీకిష్టంలేదందురూ’’

“.........”

“ఒప్పుకోరూ.”

“దగ్గరపిల్లని చెయ్యడం నాకు నచ్చదు. నీకు తెలియదు. చెబితే వినవు. ఏంబాధపెడుతున్నావే నన్ను. నామతి పోతుందిరా దేవుడా”

“కాదండీ——”

“కాదనే నే నంటున్నాను——”

“నామాట చొరబడనివ్వండి.”

“నీకు మాటాడడం తెలియదూరుకో.”

“బాగుంది”

“ఇక విషమిస్తుంది.”

“అబ్బ! నేను చస్తే బాగున్ను. తరువాత మీ యిష్టంవచ్చిన పిల్లని వాడికి పెళ్ళిచెయ్యొచ్చు.”

“చస్తే చస్తావు. నేనేంచేస్తాను. పండుటాకులు రాలితే, పచ్చివి నవ్వుతాయి. పాపాత్ములు చస్తేమేలు. భూదేవి అలోమనేడుస్తోంది మనలాంటి పాపపుఘటాలని మొయ్యలేక. అదీ వుపకారమే. నేను గదా వెధవాయమంగళం అంటే ఓయని పలుకుతాను.”

“ఇంత డొంకతిరుగుడుమాట లెందుకండీ. నా వుద్దేశ్యం యేమంటే మా వాళ్ళపిల్లని మనబ్బాయికి చేసుకుని వాళ్ళ బంధుత్వం మరింత దగ్గరచేయాల్సిందని ——”

“అంతేనా? ఇక నా మాటలు విను నిన్ను కట్టుకుని నేను మహా అనుభవించాను; అనుభవిస్తున్నానుకూడా దగ్గరదానిని మేనరికమనిన్నీ—ఇంతగా సౌఖ్యం అనుభవించినవాణ్ణి నేనేగాకుండా నా కొడుక్కుకూడా ఆ సౌఖ్యం ప్రాప్తింపజేయడం దెందుకని నా అభిప్రాయం——!”

"అయ్యో! అమ్మా! మీకేం తీపిదిగేసింది. మీకు నాతండ్రి యేమిలోటు చేశాడు. గడుస్తనం వుంటే సరి."

"కాదామరి. నువ్వు మాయింట కాల్పెట్టావు. నేను లేకెత్తేను. ఏం?!"

"అబ్బ! అసందర్భపుగాథ లెందుకండీ యీ సందర్భంలో!— అవునూ కాదూ అందురూ తెగుతుంది."

"తెగేపోయింది."

"ఎలాగ?"

"ఇంకా తెలియకపోతే నీవు దమ్మిడీకిమారవు."

సన్నమ్మ భర్తని తన అభిప్రాయంలోనికి తీసుకురావటం పుత్తదని, కళ్ళనీరు నించుకుని చివాలున లోపలికిపోయి పరువుమీద కూలబడింది యేడుస్తూ. భార్యకు ఖేదంకల్గించానుగా అని శరభయ్య గుప్చప్గా కూచున్నాదివతల. ఇల్లంతా నిశ్శబ్దం. భర్త యివతలా భార్యలోపలామనసులు బాగులేక—

అరగంటయింది. సన్నమ్మ గదిలోంచి "అమ్మో! చచ్చేనండోయి"అని కేకేసి వూరకుంది.

శంభరయ్య గజగజలాడి దీనింటా పీనుగుపోనూ! మాటనెగ్గలేదని వురిపోసుకుందాయేమిటి?— అపకీర్తిముచ్చట" ని తటాలున లోపు కోదాటుదాటి "ఏమే! ఏమే!!" అంటూ మంచందగ్గర మోకాళ్ళబడి అడుగుతున్నాడు.

సన్నమ్మ గుభాలున మంచంమీంచిలేచి నేల చతికిలాబడి "ఏమే? ఏమిటి? నావల్లకాదు! చచ్చాను!" అనికుడిచెయ్యి యెడం చేత్తో నొక్కుకుంటూ యేడ్చింది.

"చావడంయేం?..."

"అబ్బా!" (అని చీరిచెంగుతో కుడిచెయ్యి బిగించుకుంటూ "అన్నా!!—అబ్బా!!"

శంభరయ్య వేషాలుగా భావించి "ఏమమ్మా పాపం! ఏం ముంచు కొచ్చిందప్పుడే! అలాగుండాలి—అడదాని... మీయిష్టానికి "ఉఁ" అంటే గంగిరెద్దులా శంభరయ్య వంటిమొగుడు ముష్టిగాళ్లో నూవుండడు? లేకుంటే నించున్నపాటున యిలాటిముక్కా మొహం లేనిరోగాలు ముంచుకొస్తయి!! అన్నాడు.

"బాబూ! నాతండ్రీ!! —అవతలికెళిపోండి నాయనా, నూది పోట్లల్లా యీమాటలు కూడా యేమిటి నాబాధకి తోడు!!

"—కానీ మీవాళ్ళనే గుంటపిల్లడికిముడేసి యేనాటిలోనో తోస్తానులే. సరిగదా. ఆబాధపోనీ!!— లేకుంటే యీపూట మెతుకులు కానను! యిమ్మాటికి చెబుతున్నాను నీయిష్టప్రకారం మీవాళ్ళపిల్లనే చేస్తానని. లే."

"అబ్బా!— వెధవపెళ్ళి!—ఆపెద్దవెధవ చచ్చేదాకా బ్రహ్మచారిగా వుండనివ్వండి ఈచెయ్యిలాగేస్తూంది బాధతో తలకెక్కితే నేచచ్చూరకుంటాను!!

"ఏమే!!—కొంపదీసి పామూగట్రా కుట్టిందా యేమిటి. చెప్పు మంత్రగాడి కోసమైనాపోతా.!!

"మహాప్రభూ! పక్కమీద పడుకునేసరి కేదోకుట్టేసింది. చెయ్యి భగ భగ మండుతోంది. వెళ్ళిమంత్రిగాడిని లాక్కురండి. నాప్రాణందక్కితే చూద్దాం పెద్దవాడి పెళ్ళిమాటలు; చూడండిమంచం కిందనేదేనా పురుగూపుట్రా దాగిందేమో!

శంభరయ్య "సరా! పెళ్ళిమాటలు" అని మంచంక్రిందకు చూచాడు. ఏమీయెరగనట్లో యెఱ్ఱతేలు చరచరాపోయికన్నంలో మాఱిపోయింది.

# 3

## చోరాన్వేషణము

విశల్యాపురం స్టేషను విద్యుద్దీపాలతో దేదీప్యమానంగా ప్రకాశిస్తూంది. అదో ప్యాసింజరు ట్రెయిను రావలసినసమయం. ప్రయాణీకులు ప్లాటుఫారంమీద మాటలతో కూచున్నారు. ఇంకో అరగంటకిగాని రైలు రాదు. అప్పుడో యువకుడు టక్కు టక్కు మను జోళ్ళచప్పుడుతో ప్లాటుఫారంమీద యిటూ అటూ కొంతసేపు పచారుచేసి, ఒకపండ్లదుకాణంసమీపించి "అబ్బాయీ ! ఒకణా అంటిపళ్ళియ్యి" అనికొని యిటుచూచుసరికి వానికంటికో బల్ల కన బడింది. దానిపై యీరీతిగా వ్రాయబడుంది:—

"ప్రయాణీకులారా ! జాగ్రత్త. నిన్నరాత్రి కాపలావాని చంపి 50,000 రూపాయలనోట్లు నిచ్చటకుదగ్గరనున్న బ్యాంకునుండి దొంగలపహరించినారు. ఏమరచియుండకుడు. రైలులో కూడనట్టి దుష్టులుందురు."

అదిచదివి తలపంకించి, ఆయువకుడాలోచనాపరుండై యుండ రైలువచ్చి ప్లాటుఫారంమీదఆగింది. తక్షణామే "పళ్ళా ! పళ్ళా" అనికొందరూ, "పాక్, బీడీ, చుట్టా, సిగరెట్టని" కొందరూ, "సోడా, సోడా" అనికొందరు, కుఱ్ఱాళ్ళు యిటూ అటూ తిరుగు తున్నారు. బండినుండి దిగేవాళ్ళు దిగుతూన్నారు. ఎక్కవలసిన వాళ్ళెక్కుతున్నారు. మరొకదుకాణదారుడు "తలగడాలో" అని అమ్ముతున్నాడు. మనయువకుడు ప్రతీపెట్టెలోకీ ఒకమారు చూస్తూ పోతున్నాడు. వాడలా చూడడానికి కారణంఎవరికీ తెలీలేదు. ఇంతలో ఓమిలిటరీయుద్యోగి పెట్టెలోంచివకలికిచూచి "ఒరే ! తలగడా

లిలాతే" అని ఒకతలగడా కొనుక్కొని లోపలికిపోయాడు. మన యువకుడా మిలిటరీవానిపై నెందులకో అనుమానించి త్వరగాడి నం దేప్రవేశించాడు. మిలిటరీయుద్యోగికూడా మనయువకునిచూచి అనుమానించి తలగడా ఒడిలోనుంచికొని యేమోసర్దుతున్నాడు. మనయువకుడటు చూచీచూడనట్లభినయిస్తున్నాడు.

మనయువకుడాపెట్టెయందలి నలుగురుమనుష్యుల నొకమారు పరికించెను.

మనయువకునకెదురుగా నొకతురుష్కుడు గ్రామఫోనుపాటల పుస్తకమువిప్పి చదువుకుంటున్నాడు. వానిప్రక్కనే సద్దినతలగడాకు చేరబడి మిలిటరీయుద్యోగి నిద్రనభినయించుచుండెను. వానితలపై నున్న హాటులో కొంతసామానుగలదు. అదివానిదేయయియుండును.

వానికిసమీపంగా నొకముసలిస్త్రీ సామానుకుచేరబడి గాఢనిద్రావశయైయున్నది. మనయువకుడు కూర్చొనిన బల్లచివర నొక బెంగాలీయువతి నూతనముగ వెలువడిన డిటెక్టివునవలనొకదానిని చదువుకొనుచుండెను.

రైలు స్టేషనువిడచిపోయేవేళయింది. కండక్టరు పెట్టెలన్నీ తాళాలువేసికుంటూవచ్చి మనప్రయాణీకులున్నపెట్టెలో కడుగిడి నాలుగువేపులాచూచి క్రిందనుండొకకార్డుతీసి "అరవిందు" డని దానిపైనున్నది గట్టిగాచదివెను.

"అరవిందుడు" అనివాడు చదువగనే గాఢనిద్రావశయై యున్న ముసలితప్ప తక్కినవారంతా చకితులై కండక్టరువేపు తేరిచూచిరి. అరవిందుడొకడిటెక్టివు అపరాధ పరిశోధనానిపుణుడు.

కండక్టరటనుండిపోయెను.

"అరవిందుడపరాధపరిశోధనయందతిచతురుడుగదా ?" అని బెంగాలీయువతి తక్కిన ప్రయాణీకుల ప్రశ్నించెను.

"ఇక్కడున్న వాళ్లెవరికేనా అరవిందుణ్ణి తెలుసా ?" అని పాటలపుస్తకముమూసి మహమ్మదీయుడడిగెను.

"ఇక్కడున్నవాళ్లెవరూ అరవిందుని పోల్చుకోనజాలరు. అతడనేక మారువేషముల చరించుచుండును" అని మనయువకు డనెను.

మిలిటరీయుద్యోగి కనుబొమలకూడదీసికొని ఆలోచనాపరుడై గాఢనిద్రనొందుచున్న ముదుసలినిగాంచి తలపంకించాడు. మన యువకుడది చిరుజూపులజూచి, బెంగాలీయువతితో "ఇదిగో యీ పత్రికయందు "నిన్నరాత్రి విశల్యాపురపు రైలుస్టేషను సమీపమున నున్న బ్యాంకు కాపలావానిచంపి 50,000 రూపాయలొకదొంగఅపహరించెను. వానినిబంధించుట కరవిందుడు పలుప్రయత్నములు చేయుచున్నా"డని వ్రాయబడుంద"నెను.

"అట్లనా!" అని బెంగాలీయువతి మల్లీనవలవిప్పింది. మిలిటరీయుద్యోగి అటుంచో మారు తిరిగి పరున్నముదుసలినీ మనయువకునీ ఓమారుచూచి కునుకటంప్రారంభించాడు.

* * * *

అర్ధరాత్రయింది. రైలు గమ్యస్థానం పరిగెత్తిపోతూంది. పొగతో కూడి రైలు గొట్టాలలోంచొస్తూన్న, నిప్పుకణాలు మిణుగురుల్లా మెరుస్తున్నవి.

మన యువకుడికి నిద్రరాలే. లేచి కూచొని జేబులోంచి అంటిపళ్ళు తీసి న్యూసుపేపరులో పెట్టుకుని తినడం మొదలుపెట్టాడు. అదిచూచి మిలిటరీవాడు మంచి నిద్రలోంచి లేచినట్లు ఒళ్లు విరుచుకుని "నాకూ ఆకలిగావుంది. ఇంత జీడిపప్పుతింటూ"నని పైనున్న సామాను 'బడీ'మని లాగేసరికి ఆపెట్టికి వెలుతురిస్తూన్న కార్బాయిడులైటు పగిలి ఆరిపోయింది. పెట్టి చిట్టచీకటయింది.

అప్పు "డమ్మో!"అని యువకు అరవసాగారన్నాడు. తక్కినవాళ్ళు కంగారుపడి యిటూఅటూ తిరగడం మొదలుపెట్టారు. ఇంతలో రైలాగి గార్డు లాంతరు పట్టుకొని యందు ప్రవేశించి "చైనెవరు లాగారు?"ని ప్రశ్నించాడు. మనయువకుడు "నేన"న్నాడు. గార్డు జరిమానా విధించి లాంతరొక్క కొక్కానికి తగిలించి పోయాడు. ముసిలిదిమాత్రం యింత గోలలోకూడా లేవనేలేవక పడుంది. మరేం అపాయాల్లేవని యెవరిస్థలాల్లోవారు కూచున్నారు. బండీ బయలుదేరింది.



తెల్లవారింది. రైలు మణిపురంలో ఆగింది. మిలిటరీఉద్యోగి ముసలిదాన్ని "అమ్మా! లేవే మణిపురంవచ్చేశాం"అని లేపాడు. ఆమె లేవలే. వెంటనే జాగుచేయక ఆమెను చేతుల్లో యెత్తుకుని సామాన్తో యివతలికొచ్చి ఒక జట్కా అద్దెకుపుచ్చుకుని ధర్మసత్రానికి తోలమన్నాడు. అరవిందుడు మొదట్నుంచీ యీమిలిటరీ వాని మీదనుమానంపడటంచాత పరస్పరంగా తానుగూడ వాని వెనుక పడ్డాడు. బెంగాలీయువతికూడ వేరొక జట్కాపై ఆసత్రము లోనే విడియుటకు బయలుదేరింది; భోంచేసింతరవాతక్కడ పని చూచుకుని రెండోరైలులో తనవూరు పోదామని.

మిలిటరీవుద్యోగి ఆ సత్రంలో ప్రవేశించి ఒకగదిలో ముసలి స్త్రీని పడవేసి తన దుస్తులు విడచి మరియొకరూపంగా తయారవుతూండే సరికి మనయువకుడు ఆతనికెదురుగ పిస్తోలు చూపుచునిలచి "దుర్మార్గుడా! నిలు"అనెను. అనంతుడు చేతులెత్తి నిలచిపోయెను. అప్పుడే బండిదిగిన బెంగాలీయువతియు నాగదిలో ప్రవేశించి యీ దృశ్యము చూచి ఆశ్చర్యపడింది.

మన యువకుడు "మోసగాడా! మిలిటరీ వేషంలో వుంటే నిన్ను నేను పోల్చుకో లేననుకున్నావా? నేనెవర్నో తెలుసా? డిటెక్టివు అరవిందుణ్ని!" అని తన బేడ్జి (badge) చూపెను. బెంగాలీయువతికి ఆశ్చర్య మినుమడించింది.

బెంగాలీయువతి "మీరా అరవిందుడు! ఇప్పటిదాకా పోల్చుకోలేకపోయాను. ఎవరో ప్రయాణీకులనే భావించా రాత్రంతా!" అని నవ్వెను.

అరవిందుడు:—అమ్మాయీ! నిన్నరాత్రి మిలిటరీయుద్యోగున్నాడే మనపెట్టెలో అతడేఇతడు, గజదొంగ. విశల్యాపురంలో సొమ్మపహరించినవాడు వీడేనని నా అనుమానం. వాడిచంకలో తలగడలాగి చింపు. అందులో నేమిటో వున్నట్టు నాకనుమానం.

బెంగాలీయువతి నిర్భయంగా తలగడలాగి చింపింది. అందులో 50,000 రూపాయిల నోట్లున్నవి. ఆమె ఆశ్చర్యపడింది. బ్యాంకు దోచినవాడు వీడేనని అరవిందుడికి రూఢయింది. అరవిందుడు ఆసొమ్ము తనజేబులో పెట్టుకొని రెండో చేత్తో మరోపిస్తోలుతీసి అనంతునివేపు గురిచూపుచూ బెంగాలీయువతితో "అమ్మాయీ! ఆ ముదుసలి చచ్చిపోయినట్టు నాకు పొడగడుతోంది. చూడు!" అన్నాడు. బెంగాలీయువతి చూచింది. ముదుసలి కొరడుబారింది. "దుష్టా! ఆ ముసలిదాన్నెందుకు చంపావు చెప్పు. లేకపోతే కాల్చేస్తా" నన్నాడు.

అనంతుడు:—నిన్నరాత్రి నీవు మాపెట్టెలోకి రాగానే అరవిందుడేమో అనుకున్నాను గాని నిశ్చయంచేసుకోలేదు. తరువాత ప్రసంగాన్ని బట్టి పోల్చుకొనుటనుండి తప్పించుకొనేందుకు ఏమి ఆలోచనలు తోచకపోయినవి. ఆ ముసల్ది నాకేమీఅవదు. అయినా అదినావల్ల నిన్ను భ్రమింపచేస్తే దాటిపోవచ్చునని దీపం పగలగొట్టి

చీకట్లో గట్టిగా వాసిపెక పిసికాను. "అమ్మా"అని ప్రాణం కోంది. అప్పుడే ప్రాణాలుపోయాయి. మీరంతా అది నిదురిస్తూందనే అనుకున్నారు. తెల్లారేక ఆచచ్చినశవాన్ని "అమ్మా"అని పిలిచి ఎత్తుకుని రైలుదిగి యిక్కడ వొదిలేసి నీకంటిలో దుమ్ముకొట్టి పారిపోదామనుకున్నా గాని దొరికిపోయాను. నీవు నావెనకాలే పడ్డావు. ఆస్త్రీ బ్రతికుంటే నే "నమ్మా"అని పిలుస్తే "ఎవడివిరా నువ్వ"నును. నేనే దొరకిపోయాను.

అరవిందుడు:—నీ పేరు.

అనంతుడు:—అనంతుడు.

అరవిందుడు:—పద జైలుకి. నువ్వుపుద్దండపిండానివి. బ్యాంకు సొమ్మూదొరకింది. నువ్వూదొరికావు.

అట్లరవిందు డనంతుని పోలీసుస్టేషనుకి తీసుకపోయాక బెంగాలీయువతి అత్యాశ్చర్యమున రైలుకి పోయింది.

---



# 4

## దొంగ దొరికాడు.

"ఒకనాడనా? రెణ్ణాళ్ళనా? పూరుకోడం! అలాగని రోజూ అడేపనా? నేరకగడ్డితిని ఇదివరకు పొడుం వ్యసనం పెట్టుకున్నాను. చక్కనిమారేడుకాయ మద్రాసుపొడుంతో పూరించి, వెండితోడి వెండిగొలుసుతో వీధిలోకి బయలుదేరుదును. అలవాటున్న అభాజనుడికీ; లక్షాధికారికీకూడా చెయ్యిచాపడం రివాజయిపోయి, నాకా స్తపొడుంకాజేసి నన్నింటికి పంపేవారు. ఏంచేదును? సంసార సాగరం యీదుతున్నవాణ్ణి అలవాటనే మహామారికి గులామునై ఒకపూట, కూరకనుంచిన కానీ దానికింద వెచ్చించేవాడను. దానితోకష్టంతోచి, యింటోనేగాని పైకితీసుకోని వెళ్ళకుండా పొడుంమాని చుట్ట అలవాటు చేశాను; అడిగేవాళ్ళ బాధపడలేక! ఆరహస్యంగా కాల్చుకుందికి తెచ్చుకున్నచుట్టకూడా యిప్పుడు గాలి...!!" అన్నాడుశంభరయ్య కొంచంవిసుగ్గా.

నన్నమ్మ పస్తాయించి "ఊరుకోండి. మీరుకొంచం పరాకు మనుష్యులు. అన్నిచుట్టలూ కాల్చేసుంటారు. కాకుంటే యెలా పోతాయండీ. యింటో మంచంక్రిందనున్న పెట్టిలోచుట్టలు యేదో కథలో రాక్షసి ప్రాణాలున్నట్టు" అన్నది.

"తెలివిలాగేవుంది. దొంగకి దాపరికమేమిటీ—! కానీకి 5 చుట్టలు. మూడుపూట్లా మూడయిపోతే వుదయానికి రెండుమిగలాలా!—మిగుల్తే నే కాల్చకుండా వున్నానుగదా పొద్దున్నఆరెండూ కనబడకపోతే యేమయినట్టు? ఎవడో దొంగిలించినట్టేనా—"

"జౌనుగాని మనింటోకెవరూరారు. అందువల్ల పరాకున మీరే కాల్చేసి పోయినవని వెతికొచ్చును.—"

"సరా!—నేను కాల్చేయలేనోయి దేవుడా! పెట్టిలో నేవుంచాలి"

"—ఎలాపోతాయండీ అయితే?"

"...నన్ను తప్పించి యింటోనాళ్ళెవళ్ళేనా కాల్చేయాలి. లేకుంటే యేమహానుభావుడో నాచుట్టలకోసం యింటిలో ప్రవేశించి దొంగలించాలి."

"మనింటికే ... మనంనలుగురంతప్ప మరో మానవుడు కాలెట్టడం కూడానా? గుండెలు తీసినపని!—పోనీ అనుకుంటే; యిల్లా సామానూవదిలి తీరాచూస్తేదమ్మిడీ విలువలేని చుట్టముక్కలా కాటు ఖర్మం!!"

నువ్వింతయిదిగా మాటాడుతున్నావు. నువ్వుగాని—"

"చంపేరు. నాబ్రతుకుమండా, ఆడముండని చుట్టలుకాల్చడం కూడానా?సిగ్గు"

"కాకుంటే పెద్దవాడిదో చిన్నవాడిదోయీ దెబ్బ అదిధృవం"

"పెద్దవాడి కిలాంటిపక్కన్నేలేదు. వాడు వేసుకోరానాయనా అంటే చెక్కముక్కేనా వేసుకోడు. గుంటడు వరహాలు కెందుకండీ చుట్టలు?"

"అన్నిటి కన్నివిధాల సంజాయిషీ చెప్పేవు. అయితే యింటోకిదొంగ దొసగూరాక; నువ్వుతియ్యక, పిల్లలుతియ్యక, మరేమవుతాయే, ఆఖరికి పెట్టితినేయాలి యీ వెధవకు చుట్టలుకూడానా అనియేం?"

"అలాగేవుంది చూడగా—!"

"నాలుగురోజులయింది దిలాచుట్టలుపోవడం. పోనీ దమ్మిడీ విలువలేదు. చూస్తే దీనికింత్లో తర్కించటంయెందుక నూరకుంటే అదేపనా? ఇవాళసాయంకాలంలోపునా దొంగని పట్టుకుతీరాలి. రాత్రినిద్రపట్టాలి. నువ్వాళ్ళికాఫీనీళ్ళుపడే; ఆకలివేస్తూంది. మూడు ఝాము లయిందప్పుడే కాఫీగతప్రాణికి!"

నన్నమ్మ వంటింట్లోకి పోతూవుంది.

శంభరయ్య "ఒసేవ్! ఇలారా! నిన్నను పిలకాకామేశిగారు యేంజెప్పేడో విన్నావా. "మీవరంగాడు రోజూ మధ్యాహ్నంబడి యెగేసి పెరట్లోజామిచెట్టుమీద చుట్టలు కాలుస్తున్నాడ"న్నాడు!!

"అబ్బే? నేన్నమ్మను. మన వరహానికి చుట్టలుకాల్చే యీడేదీ పాపం! ఎనిమిదేళ్ళపిల్లవాడు. కాని ఒహాటిమట్టుకునిజం. అది నా కళ్ళారాచూశాను. అప్పుడూ అప్పుడూ బీరపుల్లలు కాల్చడం"

"చెప్పవైతివి. అదేపెద్దలవాట్లకిమెట్టు. విన్నావుగదా తోటకూరనాడైనా చెప్పవయితివి రాకోడకా అన్నకథ!!

"బీరపుల్లలు కాల్చినంతమాత్రానికే?"

"అవునవునుమరి! వీడేడీ?—"

"బడికెళ్ళాడు. ఇకనింటికి వచ్చేస్తాడు. ఇవాళిన్ని మెతుకులు తినలేదుకొడుకు, కడుపునొప్పని,"

"అవతలకూచుంటాను రామ్మూర్తిపంతులుతో మాట్లాడుతూ కాఫీ అయితేపిలు, లేకుంటే తెచ్చిచ్చీ"

"ఎవరాయింట్లో చప్పుడు."

"నేనే అమ్మా!"

"వరహం!"

"ఆఁ—ఆఁ"

"చదువుకు నొస్తున్నారేమిటి మానాన్నగారు. బాబూ! నాన్న యేంచేస్తున్నాత్తా?"

"అవతల కూచున్నాడు?"

ఎవరేనా వున్నారేమిటి?"

"ఒక్కడే"

"ఇదిగో! ఈగళాసులో కాఫీపోసి యింటోగాజుకప్పుంది తీసుకురా. దాంతో కాఫీయిస్తాను మీనాన్నకి తీసుకెళ్ళిచ్చి."

వరహాం కాఫీతాగేసి "అమ్మా! నాన్నకు నేనివ్వను."

"ఏమి ?"

"నాన్న! దగ్గుసలాడుతున్నాడెందుకోను. ఇక నేవెళితే తన్నేస్తాడు"

"మరేంభయంలేదు. ఉలుకూపలుకూ లేకుండా అక్కడపెట్టేసి వెళిపోరా."

"అలాగే, తే కాఫీ"

సన్నమ్మ కప్పులో కాఫీపోసిచ్చింది. వ ర హా లు తీ సు కె ళ్ళి "నాన్నా! ఇదుగో కాఫీ" అన్నాడు. శంభరయ్య చుట్టలుపోతున్నా యన్నకోపంతో అట్నుంచిటుతిరిగి "అక్కడపారేసే" అన్నాడు.

వరగహాలు అదిరిపడి నిలపడ్డపాటున కప్పునేల విడచాడు. గచ్చుమీదపడి కప్పుచితికిపోయింది. వేడికాఫీ, శంభరయ్య వంటి మీదపడింది. అతనుకోపించి వరహాన్ని తన్నలేచాడు. వరహాలు "చర్"న యింట్లోకిపారిపోయాడు. శంభరయ్య పేకవువ్వుపుచ్చు కుని వెంటపడి వాణ్ణికానక "ఒసే యీగుంటవెధవయేడీ. నరికేస్తా" నంటూ గంతులేశాడు.

"ఏమండీ వాడేంచేశాడు ?"

"జెష్టవెధవ ! నాకడుపులో కాఫీ పడనివ్వక పోవడమేకాక, కప్పుకూడా పడవేశాడు. దొరకనీ చమడాలూడకొడతాను."

"అదేమో యిక్కడికిరాలేదు. ఎటుపారిపోయాడో పోనివ్వరూ. వాడితో మీరుసరిపగతా రేమిటి? పిల్లలు తెలిసో తెలీకో తప్పుచేస్తే మనంగాక గైవుచ్చుకునేవారెవరు? అదుగో పొయ్యి మీద గిన్నెలో కాఫీవుంచాను పెద్దవాడికని. అదిమీరు తాగేయండి.

శంభరయ్య కాఫీతో కోపాగ్నిచల్లార్చుకుని భగవద్గీతపట్టు కుని చీడీమీదకూర్చున్నాడు. సన్నమ్మ వంటాపెంటాచేసుకుని [illegible]

గుగాపడ్డుగా సుంది వినడానికి. ఆమాటాగానే శంభరయ్య పుస్తకం మూసేసి కళ్ళద్దాలు కిందనుంచి "నాకూ చుట్టలుపోతున్నాయగా అన్నదింకాపోలేదే" అన్నాడు.

"మరేంచెయ్యడంపోతే"

"దొంగని పట్టుకోడమే. ఇవాళమళ్ళీ ఒకయిదు చుట్టలు తెచ్చి పెట్లోపెడతాను. ఎల్లుండిపొద్దున్న; రేపు మూడూకాల్చగా మిగిలినవెన్నో వుంటాయో వుండవోచూడాలి అన్నట్టు......"

"ఇవాళే చుట్టలు తెచ్చిపెట్టండే."

"తేవడం. రెండుత్రాగేయడంగా అయింది. ఇంకా మూడు వుంటాయిపెట్లో. రాత్రోకటిఅయితే, పొద్దున్నకి రెండుంటాయో వుండవోచూడాలి."

"........."

"అసరసంధ్యవేళకావచ్చింది దీపంపెట్టుయిక."

"పెడతా"నని సన్నమ్మ లేచింది.

"ఒసే! ఇంకానిప్పారిపేలేదూ? ఆపొగేమిటి? ఇల్లూవాకిలీ చుట్టేస్తూంది."

"నిప్పులార్పేసి యేజామయింది."

"ఈపొగెక్కణ్ణించో చూడు."

"పొరుగువాళ్ళింట్లోంచిలాగుంది."

(వాసనపట్టి) "కాదే! చుట్టపొగలావుంది."

"కాదు కాదు. మనపొరుగు రామమూర్తిపంతులు దోమలు పోడానికి పొగాకు కాడలు కాలుస్తూంటాడు అదీపొగ."

"బాగుంది అలాగయితే వాసనవేస్తుందిగాని మనింటోనిండుతుందా. ఆపొగంతా మనగదిలోలాగేవుంది."

"అయితే చూదాంపదండి."

భార్యాభర్తలుగదిలోకివెళ్లారు. గదిచీకటికోణం. పొగచుట్టేసింది, శంభరయ్యభార్యతో "నువ్వు వేగం దీపంపట్రాయిక్కడుంటా"

వన్నాడు. సన్నమ్మ దీపం వెలిగించి తెచ్చింది. దాని వెలుగుని శంభరయ్య గదంతా చూచాడు. ఎక్కడా మనిషి జాడ గాని లేచి పారిపోతున్నట్టుగాని కన్పించలేకపోయాడు. తరువాత మంచంక్రింద పిచూగట్రా అంటుకుందేమోనని వంగి చూచి యెవరో వున్నట్లను మానించి ‘‘ఒసే! లాంతరిలా తే దగ్గరసా’’ అన్నాడు భార్యతో. భార్య మంచంక్రిందకు వెలుగు చూపింది. శంభరయ్య ‘‘ఓరి వెధవా! ఇదెప్పట్నుంచిరా’’ అన్నాడు ఆశ్చర్యంగా.

‘‘ఎవరండీ ?’’

‘‘మరెవడు ? నీవరహాలమూట బంగారుతండ్రి !! బాబు !!’’

‘‘వరహాం !’’

‘‘అమ్మ !’’

‘‘ఏం జేస్తున్నావురా మంచంకింద ?’’

‘‘నాన్నతన్నొస్తాడని దాగున్నా !’’

నువ్వు చుట్టకాల్చలేదు, రా వెధవ రాగమ్మా !

‘‘లేదునాన్నా ! నేను చుట్టకాల్చేనూ !—చూడే అమ్మా’’

శంభరయ్య పెట్టితీసి రెండే చుట్ట లుండటం చూచి ‘‘ఒహోయి ! ఇవాళ దొంగ దొరికాడే ! ఈ—మన—వరహం వెధవాయే ! వాడి దేయీ దెబ్బ !!’’ అని వాణ్ణి యివతలికిలాగేడు.

‘‘అప్ప ! ఎంతపని చేశాడండి మనబాబు ! అబ్బబ్బ !!’’

‘‘ఏడిశావలే నవ్వి — గూబకదిలేటట్టు లెంపవాయించక. నీముద్దే వాణ్ణి పాడుచేస్తూంది.’’

వరహం కిచకిచ నవ్వుతూ వీధిలోకి వుడాయించాడు.

---

బాక్సు ప్రెస్, రాజమండ్రి. 1950

అతి చౌక!  అతి చౌక!!

## నాణ్యమునకు నమ్మకమునకు మాతోవ్యాపారంచెయ్యడి

# మనవి

అయ్యా,

మావద్ద అసలు రంగూన్ వినోలియావజ్రములు, చంద్రా క్వాలిటిడైమండ్సు, యింటర్నేషనల్, బెల్జియం, స్టార్, తాజమహాల్ వగైరా బ్రాండుడైమండ్సున్నూ విశ్వబ్రాహ్మణులకు పనికివచ్చు ఆకురాళ్ళు అన్నిరకములు అన్నిసైజులున్నూ, రంపములు, త్రాసులు, తూకపురాళ్ళు, మూసలు, వడ్డాణం పెట్టెలు, నక్లిస్ పెట్టెలు, సెట్టుబాక్సులువగైరా యినియువిఅననేల! విశ్వబ్రాహ్మణులకు పనికివచ్చు అన్నిరకములపనిముట్లు మావద్ద సరసమైనధరలకు దొరకును. మాదుకాణమునకువచ్చి మాయొక్క వ్యాపార సరళతను పరిశీలించి, మాతోఒకసారి వ్యాపారముజరిపిన మంచిచెడ్డలు మీకే తెలియగలవు.

రాజు డైమండ్ కంపెనీ,

ప్రొప్రయిటరు:—కక్కిరాల వీర్రాజు

రాజమండ్రి

# ఆంధ్రవిజ్ఞానము (Telugu Encyclopaedia)

(ప్రసాదభూపాలుడు)

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వైస్ చాన్సలర్ పదవి నందియున్న శ్రీ డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి, M. A., (Cantab) గారిచే మెప్పువడసి "బాలసార్వప్రసాదాంధ్రవిజ్ఞానసంహిత" యని పేరందిన గ్రంథము. శ్రీవారే దీనిపీఠిక (Preface) వ్రాసియున్నారు. ఈమహా గ్రంథమును వ్రాయుటకేయించుమించు లక్షరూప్యములువ్యయమైనవి. ఆయాస్థలముల కరిగి చూచి పరిశీలించుట కధికప్రయాసమయినది. అంగదేశము, చేదిదేశము, మరుధన్వదేశము మొదలగువ్యాసములం గాంచిన నిట్టి వ్యయప్రయాసములు చదువరులకే తెలిసెడివి.

ఇంటింట నుండవలసిన గ్రంథము

ఏదేని యొకవిషయమై సంశయముకల్గునతఱి నెన్నో గ్రంథములు పరిశీలించి ఎందఱనో అడుగవలసియుండెడిని. అట్టి దీగ్రంథరాజమింట నుండిన నిదియే తెల్పుచుండును. విశ్వవిద్యాలయములందు, కళాశాలలందు నేర్పెడి విద్యలిందు పొందుపఱుపబడి యున్నవి.

**7** సంపుటములు రూ. **56**/-

ఖర్చులు అదనము.

ఏజంటు:—

ప్రిగ్గళపాటి ధనరాజు, రాజమండ్రి.

ఆంధ్రవిజ్ఞానకార్యాలయము,

దేవిడి. (Via) నరసన్నపేట.

[ఉత్తరవిశాఖ జిల్లా]

# కాలచక్రము

కీ॥ శే॥ కవిశేఖర భోగరాజు నారాయణమూర్తిగారు.

ఇందు కాలపరిభావమువల్ల ఓడలు బండ్లగుచున్నవి. బండ్లు ఓడ లగుచున్నవి. నేడు దరిద్రులుగా నున్నవారు దైవవశమున అతి సంపన్నులగుట; లక్షాధికారులు, జమీందారులు కన్నుమిన్ను గానక దుర్వ్యయము, అతిపోకడలకు పోవుటవల్ల భిక్షాధికారు లగుట— సంఘీయులలో అనేక పరివర్తనలు శాఖాంతర వివాహములు, వితంతూద్వాహములును తేటతెల్లముగ వర్ణింపబడినవి.

వెల **2-8-0**

అభిప్రాయములు:

గ్రంథకర్త ఖద్దరుఅభిమానము, దేశభక్తి సర్వత్రగోచరించుచున్నది - ఖద్దరునే వీరు భార్యాభర్తలకు సంధానసాధనముగావించి యున్నారు. మానవుల చిత్తవృత్తులను మార్చుమహిమ ఖద్దరులో నుండనోపు. వీరి యభిప్రాయము నాతితీవ్రమగుటచే అందరికి సమ్మతముగానే యుండవచ్చును - గ్రంథకర్త కథను గ్రాంథికభాషలోను సంభాషణలను విశాఖపట్నం 'యాస'లోను నడిపియున్నారు. పాత్రలన్నియు సజీవమైనవిగాను, వ్యక్తిత్వముకలవిగాను ఉన్నవి. అత్యంత పాఠ్యయోగ్యముగా నున్నది— భారతి.

ఇందులో కామదూషితులైన విద్యార్థుల దుశ్చర్యలు, ధనమదాంధులఅధికారవ్యామోహం, వారిదుష్టచర్యలు, తార్పుడుగాండ్ర నయవంచకాలు, దరిద్రుల ఇక్కట్లు, కానుకగతిలేనివారసుల దురాశ వగైరా వర్తమానాంధ్రసమాజంలో ఎల్లెడల కానవచ్చు అనేకసంగతులు వర్ణింపబడ్డాయి. శైలి గ్రాంథికమయినా సరళంగా వున్నది—

ఆంధ్రప్రభ.

# త్యాగి

తనతోబుట్టువుకు కష్టముకల్గునని తనబావదుర్మార్గమును తనమీదవ్వైచికొనిన శంకర్రావేత్యాగి. అట్టిత్యాగిచరిత్ర చదవండి.

వెల 1-8-0

త్వరలో

ఆయిదవప్రచురణకు

ఎదురుచూడండి

# వాణీగ్రంథమండలి, రాజమహేంద్రవరము.

## ఉద్దేశ్యములు.

ఈ గ్రంథ మండలిలో నవరసభరితములైన నవలలు, కథలు, రాజకీయములు, శాస్త్రములు మొదలగు పుస్తకములు వెలువడును.

1. ఈగ్రంథమండలిలో రెండునెలల కొకపుస్తకముచొప్పున వెలువడును.

2. ఈగ్రంథ మండలిలో చందాదారులగువారు ప్రవేశ రుసుము రు 0—8—0 లు చెల్లించవలెను.

3. గ్రంథములను చందాదారులకు అందజేయుటకగు ఖర్చులను వారే భరించవలెను.

4. ఈగ్రంథ మండలిలో వెలువడు ప్రతిగ్రంథమును చందాదారులు పుచ్చుకొనుచుండవలెను. కాని వెనుకటి పుస్తకములు పుచ్చుకొనవలెననెడి నిబంధన లేదు. వలయువారికివి చందాదారుల కిచ్చు వెలకే యీయబడును.

ఈగ్రంథ మండలిలో ఆంధ్ర భాషాభిమానులెల్లరు చందాదారులుగచేరి, మాగ్రంథమండలిని ప్రోత్సాహపఱచగలందులకు గోరుచున్నారము.